శ్రీ.

# కాదంబరి.

తెలుఁగు వచనము.

బ్ర. శ్రీ. ముదిగొండ నాగలింగ
శాస్త్రులవారిచే

రచింపఁబడి



చెన్నపురి

[illegible] ముద్రాక్షరశాలయందు

[illegible] ప్రచురింపంబడినది.

MADRAS.

1912.



వెల రు 1-4-0 లు.

# విషయసూచిక

## భూమిక.

క॥ జలజాసన జలవాహన
బలశాసనసేవితాంఘ్రిపద్మవిలసనా ।
లలితగజాజినవసనా
కలితబుధోల్లసన మల్లికార్జునలింగా॥ ౧

మ॥ వసుధామండల మండనాయితభరద్వాజాన్వవాయంబునం
దసమాప్తాప్తిఁ బగ్గాయజ్ఞోద్భటకుటీనాఘోరసూనుండఁద భ
వ్యసమంచత్కృతి నాగలింగసమభిఖ్యాఖ్యాతి విద్యాకళీ
గ్రసనైకవ్యసన స్ఫురద్రసికహృత్కంజార్చనవ్యగ్రుఁడన్॥ ౨

శా॥ ఆనేనాకక్కటికథాప్రబంధము బుధాత్యానందసంధాయిగా
జానొందం దెనిఁగింపఁబూని కృతులంజక్కంచి యెంతేని స
స్థానంబై తులనావిహీనమగు సద్దానిన్ గఁ గొదంబటన్
లోనూహించి రచింపనూనితి సుశ్లోకంబు కీర్తింపఁగాన్॥ 3

ఉ॥ ప్రౌఢితకావ్యవైభవుఁడు బాణకవీంద్రుఁడు చారుకీలిగీ
ర్వాణమునందుఁ బూర్వమగుభాగము వ్రారచియించెనెంతయున్
బాణకవీంద్రనందనుఁడు భవ్యతనుత్తరభాగమొప్పని
ర్మాణము సేసె విజ్ఞకవిరాజ మనంబులసంతసింపఁగాన్॥

చ॥ ఇమవురలోని యంతరము వేర్పరుపన్ వశమా సె భావమం
దిరయుఁగ నాకకోకగిరిని నకటంట మించిరి యిద్దియుండనీఁ
దురుమతి బూతి బాణతనయుండనె నెన్ గద పేరు సెప్పకే • •••
పరసునహంక్రియాహిత శైలి మహామహిమంబు గంటిరే॥ ౪

## స్వాహారకారపరిహారము.

ఉ॥ గంగను జేరి తన్మయతఁగాంచి మహీన గలౌనాతివాహినుల్
పొంగుమనీరథంగలియు పోలిక నాచతురర్ణవాంతకే

వేశపెట్టెను. అట్లు ప్రవేశించి యబ్బాలికామణి యశనిభయంబున కురుపురాధీశ్వరులగిరులనడుమ నుండుపసిండికొండవిధంబున నరపతిసహస్రమధ్యవర్తినియై, ఇంద్రధనుశ్శతంబున నష్టదిశలం గప్పిన వర్షర్తుదివసంబుచందంబున రత్నాభరణకిరణజాలమధ్యగతమూర్తియై, చదలేటినురుగు తెలుఁగునం బాండురం బగుపట్టుమేల్కట్టుక్రిందఁ జంద్రకాంతమణిపర్యంకంబున నాసీనుం డయినరాజేంద్రుం గాంచి దూరంబున నె చెంగలువ చెలువుఁ గొల్పుతనకరతలంబున నున్న వెదురుబెత్తంబు నాసభాకుట్టిమంబున మోదిన నాశబ్దంబుచే రాజలోకం బాతె యుం దాశబ్దంబుచే వనకరియూథంబు నుంబోలె నప్పు డప్పుడమిఱేనియాననంబుననుండి చూడ్కి మరల్చి యమ్ముగుదకభిముఖం బయియుండెను. అంత నారాజశేఖరుండు 'దూరంబుననుండి చూచు, మనిప్రతీహారిచే నిర్దేశింపంబడుచు ముందు ముదుసలి పోవుచు, వెనుకఁ జిలుకపంజరంబుం గొనివచ్చు శంభళితోడనుం గూడి, శ్యామయగుట రక్కసుల వంచింప నన్ను మహాపుం గొన్న వెన్నుని ననుకరించుచు, వర్షర్తువుం బోలె ఘనకేశజాలయై, దివ్యాంగనయుం బోలె ననిమిషయై, అశరీరిణియుం బోలె స్పర్శవర్జితయై, చిత్తరువుంబోలె దర్శనమాత్రఫలయై, మదనుని పూవిల్లుం బోలెఁ బిడికిట గ్రహింప నగు నెన్నడుము గలిగి కరంబు భాసిల్లు నామాతంగకన్యకం గనుఱెప్ప వ్రేయక కాంచి యచ్చెరు వొంది మనంబున నిట్లు వితర్కించెను.

"ఆహా, తగనిచోట నింతటిచక్కఁదనంబుఁ రచించినవిరించి నేమనవచ్చును? నిజరూపంబున నఖిలరూపసంపద నపహసించునీమించుబోఁడిని సృజించినవాఁడు స్పర్శసంభోగసుఖంబులకుం దగనికులంబునఁ బుట్టింపనేల? మాలెతం దాఁకవెఱచి ముట్టకయె తన్మనోమాత్రంబునం బుట్టించి యుండ నగు. కాదేని లావణ్యంబు చెడకుండు నెట్లు? చేసోకి వాడినయంగంబుల కిట్టి కాంతియుండునే?" అని చింతించు నారాజన్యు నక్కన్యప్రోడమాస్కఁ కర్ణావతంసంబు జాఱఁ జేతులు జోడించి మణికుట్టిమంబునఁ గూర్చుండ దానిచెంత నున్నపురుషుఁడు పంజరముతోన చిలుకం బట్టుకొని కొంతసమీపంబున కేతెంచి రాజు నుద్దేశించి వినయంబున "దేవ! సకలశాస్త్రార్థవేదియు రాజనీతిప్రయోగంబుల నేర్పరియు, కావ్యనాటకాదులు, సుభాషితంబులుం గట్టియు; ప్రణయకలహంబులం గినుక పెంచినసుందరులఁ బ్రసాదింపఁ బ్రోడయు నగు వైశంపాయనుం డనుశుకంబు సకలభూతలరత్నంబగు. సర్వరత్నంబులకు సముద్రము బోలె దేవరవారె పాత్రులని యెంచి మాఱేనియనుంగుగూఁతురు దీనిని మీచరణసన్నిధికిం గొనివచ్చెను. దీనిం బరిగ్రహించి యనుగ్రహింపవలయు," నని యాపంజరము నచట నునిచి తాను వెనుక కేగెను. అంత విహంగరాజంబు రాజున కభిముఖంబుగ కుడికాలెత్తి విస్పష్టవర్ణస్వరసంస్కారంబగువాక్యంబున జయశబ్దంబు నుచ్చరించి యారాజు నుద్దేశించి యీపద్యంబుం జదివెను.

గీ॥ అనఘ భవదంగకామినీ తనయ యుగంబు।
బాష్పమున మున్గి యాహార వాంఛ వీడి॥
హృదయశోకాగ్నిఁ జెంత వర్తించుచుండి।
వ్రతము సేయించునో ధ్యానవశులుచుండు॥

భూనాథుం డాపద్యంబు విని యచ్చేరు వొంది సమీపమున సర్వాసనోపవిష్టుండు ను, బృహస్పతిం బోలి సకలనీతిశాస్త్రపారంగతుండును సుకుమారపాలితుం డను మంత్రిముఖ్యు నవలోకించి మీరీ విహంగమంబు వర్ణోచ్చారణమునందలి విస్పష్టత ను, స్వరమునందలి మాధుర్యము ను వింటిరా? ఇది యత్యాశ్చర్యకరంబు. మఱి యు నియ్యది దక్షిణచరణంబు నెత్తి జయశబ్దంబు వలికి నన్నుఁ గీర్తించి యీపద్యంబు సతిస్ఫుటాక్షరంబు గాఁ జదివెను. లోకంబునఁ బశుపక్షులు భయాహారసంగమనిద్రాసక్తమాత్రంబులు నెఱుంగును. ఇది మిక్కిలి యక్కఱంబు" అని విని సుకుమారపాలితుండు చిఱునవ్వొలయ రాజు నవలోకించి "దేవ! ఇందేమి చిత్రము, చిలుకలు, గోరువంకలు మున్నగుపులుఁగులు విని నపలుకులు పలుకుచుండు నని దేవరవారికిఁ దెలిసియే యున్నది. అందును జన్మాంతరసంస్కారంబున నో, లేక పురుషప్రయత్నంబున నో, సంస్కారాతిశయంబు పుట్టుట యెంతయు వింతగాదు. మఱి యుఁ గొన్ని చిలుకలకు మనుజులకుంబలె పరిస్ఫుటం బగువాక్కు కలిగియుండెను. ఐన ను వానికి సన్ని దేవుని

శాపంబున నస్ఫుటవాక్కు సంభవించెను" అని యిట్లు పలుకు చుండ నుష్ణకరుం డంతరిక్షమధ్యంబు నధిష్ఠించుటం దెలుపుచు మధ్యాహ్నశంఖధ్వని వెడలెను. అద్ది విని రాజు స్నానసమయం బగుట రాజలోకంబునకు సెల వొసంగి యాస్థానమండపంబు నుండి లేచెను. అంతం దొండరపాటున వెడలు పుడమిఱేండ్ల తొడవులయొరపిడిం బొడముచప్పుడు లుష్కరంబుగ గప్పెను. భుజంబులం జామరంబు లిడుకొని యిరుప్రక్కల నెడలు చామరగ్రాహిణు లనుగు లిడునెడనెడ రాయుంచుకల్కులం దేఁకించు నందియలచప్పుడుల ను, వారవిలాసినీజనంబు నడుచుచుండఁ దదీయజఘనతలంబులం జలించుకాంచికలమనోహరంబు లగు ఝంకారంబుల ను, ప్రతీహారుల ధ్వానంబుల ను నాస్థానమండపంబు క్షోభించినటు లుండెను. ఇట్లా రాజపుంగవుండు రాజలోకంబు విడిచి మాతంగకన్యకను విశ్రమించు మని పల్కి, శుకరాజంబును లోనఁ ప్రవేశపెట్టి స్నానపానాదుల నుపచరింపు మని తాంబూలకరంకవాహిని కానతిచ్చి యాప్తుల గు కొందఱు రాజపుత్త్రులతో సభ్యంతరగృహంబున కరిగెను. అందు సర్వాభరణంబులం దీసి కిరీటజాతరహితుం డగుదివసకరునివిధంబున రాజిల్లుచు గరసీకారాటంబు జొచ్చి, శ్రమవశంబునం బొడమినస్వేదజలకణంబులచే నలంకృతుండై వందిగణంబు మార్గంబు నిర్దేశింప స్నానభూమికిం జని యచట జలద్రోణిం బ్రవేశింప నుత్తరీయాంశుకంబున స్తనపరికరంబు బం

ధించి యు, కంకణంబుల్ వెనుకకుం ద్రివిచి యు, ఆదియలం బైకిలాగి యు, హారాంగముల నభిషేకదేవత లట్లు వచ్చిరి. ఆ నృపకుంజరుం డున్నతంబు లగుకుంభమండలంబులు గలవారాంగనలం గూడి కరిణీగణంబుతోడం గూడిన వనకరిచందంబున నొప్పెను. అట్లు క్రీడించి యారాజు జలద్రోణినుండి లేచి వరుణుండు రాజహంసం బధిష్ఠించువట్లు స్ఫటికమణిమయంబగు స్నానపీఠమునం గూర్చుండెను. అంతం గొందఱు సుందరులు పచ్చలకలశంబులం ధరించి పత్రపుటంబులం గూడినతమ్మి తీవియల ననుకరింపంగను, మఱికొందఱు రజతకలశంబులం గొని పూర్ణచంద్రమండలమునుండి వెడలుచు జ్యోత్స్నాప్రవాహంబు నప్పొంచుకేలం బోలంగను, కొందఱు మలయసరిత్తులవలెం జందనరసమిశ్రంబగు జలంబుచేతను, కొందఱు జలయంత్రదేవతలవలె నుత్తుంగస్తనకలశంబుల పైఁ బాణితలంబుల నునిచి వ్రేళులసందులనుండి వెడలు జలధారలచేతను క్రమంబుగ నారాజును స్నానము చేయించిరి. అట్టియెడ స్నానకాలశంఖనినాదంబు వెడలెను.

అంతట నా నృపుఁడు సాముకుసంబులంబోలు వెలిదువ్వలువలం దాల్చి మంత్రపూతోదకంబుల సూర్యున కర్ఘ్యం బిచ్చి, పితృతర్పణంబుఁజేసి, దేవగృహంబుఁ బ్రవేశించి యందు పశుపతి నర్చించి యచటనుండి వెడలి యగ్నికార్యంబు దీర్చి తగు రాజన్యులతోఁ సభిమతంబగు నాస్వాదనంబునం బ్రీతుండై యాహారం

బు నిర్వర్తించెను. తరువాతఁ దాంబూలంబు గ్రహించి యట నుండి కదలి శయనగృహంబు ప్రవేశించి యందుఁ గుసుమపరిమళవాసితంబు బహుప్రచ్ఛదపటంబుచే నావృతంబై, పట్టుతలగడతో నొప్పియున్న శయనతలంబునఁ గూర్చుండి, ప్రతీహారి క్రొందమ్మిరేకులఁబోలు తనపాణితలంబులఁ బాదంబు లొత్తుచుండ నత్యంతప్రియు లగురాజులు, మంత్రులు మున్నగువారితో నిష్టకథాగోష్ఠిం దేలుచు ముహూర్తమాత్రంబు గడపెను.

పిమ్మట నారాజు చిలుకవృత్తాంతంబు వినుటకు వలయు ననుకుతూహలంబున సమీపమున నున్నప్రతీహారింగాంచి 'యంతఃపురమునుండి వైశంపాయనుఁ డనుచిలుకం గొనిరమ్ము', అని యానతిచ్చెను. ఆప్రతీహారి యు రాజునాజ్ఞఁ దలఁబూని చిలుకం గొనివచ్చెను. ఆచిలుకవెంబడి వచ్చినకంచుకి రాజునకు మ్రొక్కి, దేవ! దేవర యానతిచొప్పున నీశుకరత్నంబు స్నానపానాదులచే సంతుష్టమై దేవరసన్నిధి కనుపఁబడియె, నని దేవరకు విన్నవించుమన్నది. అని పలికి వెడలిపోయెను. అంత నమ్మహీకాంతుండు చిలుకఁగని " యంతఃపురంబులోన నభిమతభక్ష్యరసంబు లేవియైనఁ గుడిచితే?,, యనుడు నాచిలుక యిట్లనియె:— దేవా, అంతఃపురంబున నే నారగింపని దేమి కలదు? మత్తకోకిలలోచనకాంతి యగు, గహాయమునానురంబు నగుజంబూఫలరసంబు గ్రోలితి, సింగాపుగోళ్లం జీల్పబడినను దవుటుమంగుల కుంభంబులందలి రక్తసిక్తంబు లగుముక్తాఫలం

బులంబోలు దాడిమీఫలబీజంబు లాస్వాదించితి. ఏ దని చెప్పుదు?
రాజులపాణితలరేఖలనుంబట్టి యీయఁబడిన దంతయు నమృతంబుం
బోలియుండెను. అది విని రాజిట్లనియె:—'చిలుక! ఇదియంత
యట్లుండనిమ్ము. నీవృత్తాంతంబు విన మాకుఁ గుతూహలము
గలుగుచున్నది. కాన నామూలంబుగఁ దెలుపవలయు. నీవే
దేశంబునఁ బుట్టితివి? ఎవ్వరు నీకుఁ బేరు పెట్టిరి? తల్లి యెవరు? తండ్రి
యెవరు? వేదంబు లెట్లు వచ్చెను? శాస్త్రపరిచయ మెట్లు కలి
గెను? విద్యలన్నిటి నెవ్విధంబున నార్జించితివి? జన్మాంతరంబు
నఁ జదివిన వాని స్మరించెదవా? వరంబున వచ్చెనా! లేక విహ
గవేషంబున దాగియుండిన యొక మహాపురుషుండవా? మున్నె
దుంటివి? నయము స్వతంత్రుఁడవు? పంజరంబున నెట్లు చిక్కువడితివి?
చండాలకన్యచే నెట్లు చిక్కితివి? ఇచ్చటికి వచ్చుటెట్లు?
చెప్పుము.' అనుడు శుకరత్నంబు కొంతదడవు చింతించి రాజు
నాననంబునఁ జూచి యిట్లనియె:—

## వింధ్యాటవీ వర్ణనము.

దేవ! ఇది గొప్పకథ. విన వేడుకయేని నాలింపుము.
పూర్వపశ్చిమ సాగరతీరంబుల వ్యాపించి పుడమికి మొలనూ
లి చందంబున మధ్యదేశాలంకారంబై, ఏనుంగుల మదజలంబు
చేఁ బెరుగుమ్రాఁకులచే నొప్పుచు, తమలపాకుల తీవియలచే
నల్లికొనఁబడిన పోకమ్రాఁకులు గలిగి, వనలక్ష్మీ వాసభవనంబులఁ

బోలు లతామండపములచే భాసిల్లుచు, ఒక్కచోఁ కపికులభజ్య మానతుంగశాలం బయి దశాననగరిం బోలి, వేఱొక్కచోఁ కుశసమిత్కుసుమావృతం బయి వివాహభూమిం బోలి, మఱియొక్కచోఁ దమాలనీలం బయి హరిమూర్తిం బోలి, వేఱొక్కచోఁ గీచకావృతం బయి విరాటనగరిం బోలి, అపరిమితపత్రసంచయయుతం బయ్యు నష్టపర్ణభూషితం బయి, క్రూరసత్త్వం బయ్యు మునిజనసేవితం బయి, పుష్పవతి యయ్యుఁ బవిత్రం బైనవింధ్యారణ్యం బొకండు గలదు.

## అగస్త్యాశ్రమవర్ణనము.

అందు నతిప్రసిద్ధం బగు దండకారణ్యంబున నగస్త్యుని యాశ్రమపదంబు గలదు. ఏమహర్షికులావతంసుఁడు సురప్రార్థనంబున సకలసాగరజలంబులఁ ద్రావెనో, ఏజడదారి మేరుమత్సరంబున శిరస్సహస్రంబుచే సూర్యరథపథంబు నిరోధించినవింధ్యుని నాసవెట్టెనో, ఏతపసి వాతాపిదనుజుం జఠరానలంబున వ్రేల్చెనో, మఱియు నేమునిజనమాననీయుఁడు ఏకహుంకారంబున నహుషునిఁ బదభ్రష్టుఁ గావించెనో, అట్టి భగవంతుఁ డగుమైత్రావరుణికులపతి యు, సతీతిలకంబు నగు లోపాముద్ర తనంతన పాదులు చేసి దోయిలిచే నుదకంబులు వోయుచుఁ బుత్రనిర్విశేషంబుగాఁ బెంచినతరువులచే నొప్పి, తత్పుత్రుండు ను, బ్రహ్మచర్యవ్రతి యు, భస్మత్రిపుండ్రాభర

## ప్రభాతవర్ణనము.

ఇట్లుండ నొకప్పుడు గగనతలంబు సంజకెంజాయ నలరియుండఁగ నుత్తమ్మిపుప్పొడిం గ్రొంబైనఱెక్కలుగలముదిరాయంచం బోలు చందురుండు పడమటిసంద్రపుగట్టు మెట్టియుండఁగను బ్రాభాతికవాతపోతంబు మెల్లమెల్లగ వీచుచుండఁగను, గ్రమంబుగ వేవెలుంగు బ్రొద్దునాలుగుగడియలకాలంబు నతిక్రమించి భాసిలుచుండఁగను, శుకకులంబులు పలుదెసల కరిగి యుండఁగను, నాతండ్రి తనతోఁబాటయుండఁగను, వచ్చుచున్నఱెక్కలు గలయేను బాల్యంబున నాతండ్రిచేరువ నుంటిని.

### మాతంగుఁడు మృగయావేఁటకు వచ్చుట.

అంత నక్కాఱడవియందు సకలవనచరంబుల భీతిగొల్పుచు, వేగంబున నెగయు పక్షికులంబుల ఱెక్కలచప్పుడులతో నొప్పి, మోరలు పైకెత్తుకొని పఱచువనవరాహంబుల ఘుర్ఘురధ్వానంబులచే సంకులంబై, కొండగుహలనిండఁగూయుచు మేల్కన్నసింగంబుల నాదంబులచే భీకరంబయి, భగీరథుండు గొనితెచ్చుగంగాప్రవాహంబుకలకలంబు గలమృగయాకోలాహలధ్వని వెడలెను. ఏను పుట్టిననాటంగోలె విని యెఱుంగని యారావంబు విని వణంకుచు ఏనులుబ్రద్దలగుచు, నెఱసిపడి చేరువ నున్ననాతండ్రి ఱెక్కలలోనం దాఁగి నటించుచుంటిని. అంత రభసంబున “ ఓరి, ఇదిగో గజయూథపతిచే మథింపఁబ

డినసరసిజవనంబుపరిమళము. అదిగో వరాహకులంబు గొఱికిన తుంగముస్తలసుగంధము. ఇదె లేడిగుంపు. అదె అడవియేనుఁగులదండు. ఓహోరి, ఇవ్వనంబునం బ్రవేశింపుఁడు. ఈచెట్టు కొన నెక్కుఁడు. ఈదెసఁ జూడుఁడు, ఈచప్పుడు వినుఁడు. విండ్లఁ గైకొనుఁడు. ఏకాగ్రచిత్తులరై యుండుఁడు. కుక్కల విడువుఁడు,,, అని యొండొరులతోఁ జెప్పికొనుచు నాఖేటకేచ్ఛం జనుదెంచిన జనులకోలాహలంబు నాకర్ణించితి. అంత నావేఁటకాండ్రు వింటు లెక్కిడి యొక్కమొగి నుక్కుములుకులఁ బఱప గిరిగుహలఁ బ్రతిధ్వని వెడలునట్లఱచెడుసింగఁబులనినదంబులచేతను, ఆయఱపులకు వెఱచి యొంటిగఁ బఱచి ఘీంకరించునేనుంగుల బృంహితధ్వనులచేతను, కుక్కలు పట్టి కొఱుకుచుండ నుక్కు దక్కి దిక్కులం గనుజింకల దీనారావములచేతను, కుక్కలయఱపులచేతను, విండ్లచప్పుడులచేతను, పుడమి వడఁకునటుల పఱచు నెఱుకులయడుగుల యులివుచేతను నయ్యరణ్యంబు గ్రక్కదలినట్లయ్యె.

అంతఁ గొంతసేపునకు నక్కలకలం బడఁగి, వర్షించి నిశ్శబ్దంబైన మొగిలు ననుకరించుచు; చిలికినపిదప నుపశాంత జలంబైన పాలవెల్లి వడువున నయ్యడవి స్తిమితపడియుండ నేన భయంబు దక్కి కౌతుకంబునఁ దంష్ట్రితోడ నుండి కొంచెము లేచి, తొఱ్ఱయం దుండియే మెడ సాఁచి యేమి యదియ

విస్తంబున నాదెస దృష్టి నిగిడించితిని. అంతలోఁగార్తవీర్యా
ర్జునుని బాహాసహస్రంబున నడ్డగింపఁబడిన నర్మదాప్రవా
హం బో, రవికిరణాకులితంబగు నంధకారపూరం బో, పరిభ్ర
మించుజమపరివారం బో, భూతలంబు భేదించుకొనివచ్చిన దా
నవలోకం బో, ఒక్కెడం గూడినపాపకర్మపుంజం బో, నీరం
బున మునింగి యందుండి వెడలినవనమహిషబృందం బో,
సకలలోకనాశనంబునకై పొడమినధూమకేతుజాలం బో య
నఁ గానన మెల్లఁ జీఁకటి వించుచు నుత్పాతవేతాళ వ్రాతం
బుం బోలి భయజనకం బయి, యనేకసహస్రసంఖ్యం
బైనకిరాతసైన్యంబుం గాంచితి. ఆసైన్యంబునడుమ ప్రథమ
వయస్సున నుండువాఁడై యతికఠినుండగుట నక్కచే నిర్మిం
పఁబడినవాఁడో, జన్మాంతరగతుం డగు నేకలవ్యుండో యనఁదన
రి, మొలకమీసలు వచ్చుచున్నవాఁ డగుట మదరేఖామం
డిత గండభాగంబుగల గజపతికుమారుండో యన నొప్పుచు, అల్ప
కాయంబులైనను మహాశక్తిగలవి యగుటఁ గేసరంబులు వొడ
మని కేసరికిశోరకంబులం బోలి, మృగవధూవైధవ్యదీక్షాదానద
క్షంబులైనసారమేయంబులతోడను, మృగపతులవలె గజకుం
భముక్తాఫలహస్తులును, యాతుధానులవలె గృహీతపిశితా
హారులు నగుజనులతోడ నుంగూడి, బకాసురునివలె గృహీ
తైకచక్రుండు ను, ఘటోత్కచునివలె భీమరూపధారి యు నై
వింధ్యునికొమరుఁడో, కృతాంతునియంశావతార మో, పాపం

బుతమ్ము డో, కల్మికాళంబునారథి యో యన నెల్లుమాతంగనా
ముం డగుశబరసేనాపతిరో గాంచితిని. అప్పుడిట్లని మనంబునఁ వి
తర్కించితి. "వీరిచరిత మెంతనింద్య మైనది! ఏమన, దేవతకు నర
బలియొసంగుటయందు ధర్మబుద్ధి యు, సజ్జననిందిత మగుమాం
సాదిక మాహారంబు ను, శ్రమము వేఁటయందు ను, శాస్త్రము
నక్కకూతలు ను, గూబలు మేలుకీఁడుల నుపదేశించుగురువులు
ను, పరిచితులు శునకంబులు ను, రాజ్యము శూన్యారణ్యంబు ను,
క్రూరకర్మంబులు మిత్రంబులును, ధనువులు ధనంబులు ను, విషది
గ్ధముఖంబు లై భుజగంబులం బోలుసాయకంబులు సహాయంబు
లు ను, మూఢమృగవినాశకరంబు గీతంబు ను, క్రూరంబు లగు
వ్యాఘ్రంబులతో సహవాసంబును, పశురుధిరంబుతో దేవతా
ర్చనంబు ను, మాంసంబుతో నివేదనంబు ను, చౌర్యంబుచే జీవ
నంబు ను, పాముపడగ నుంకురతనంబులు తొడవులు ను నై
యుండ వీరల కేయడవి వాసం బయ్యెయుండు నో, దాని నె వీరు
నిర్మూలము చేయుచుందురు,, అనియాలోచించుచుండ నమ్మా
తంగుం డడవియందుఁ భరిభ్రమించుటం బొడమినబడలిక నపన
యించుకొన నెంచి వచ్చి యాశాల్మలివృక్షంబు డిగువఁ దన
కోదండం బునిచి త్వరితంబుగఁ బరిజనులచేఁ బఱువఁబడినతలి
రుటాసనంబునఁ గూర్చుండెను.

అంత నొకబోయండు పంపాసరోవరంబునకుం జని
యందుఁ బ్రవేశించి తామరాకుదొన్నతో జలంబు ను, తమ్మి

తూండ్లనుం గొనివచ్చిన సామాత్యంగుండ ఘాజలముం గ్రోలి రావాఖవు ఛంద్రకలలంబలె మృణాళంబుల మెసవి బడలికఁ దీర్చికొని యెఱుకగుంపుతో, నిచ్చవచ్చిన చోటికిం జనియెను. అంతదాఁక ముసలిబోయుండు వారివలనఁ దనకు లేడిమాంసముల భింపమి దానినార్జింప నెంచి కొంతసే పాచెట్టుమొదటఁ దడసెను.

### శుకశిశువులకుఁ గష్టదశ ప్రాప్తించుట.

ఆబోయదండు మఱుఁగైనపిదప నాముసలికంటు మాయాయువులం గ్రోలువానివలెను, చిలుకగూళ్లు లెక్కించువాని వలెను, ఆచెట్టు నెక్కనెంచి క్రూరదృష్టితో నాపాదపంబు మొదటనుండి చూచెను. అట్టియెడఁ జిలుకల ప్రాణంబులు పైకిఁబోవుచున్నవో, యనునటు లుండెను. రాజచంద్రమా, నిష్కరుణులకు దుష్కర మేమి కలదు? ఆతరువు దురారోహం బైనను వాఁడు మెట్లతో నెక్కువగిది నయత్నంబుగ నెక్కి యందుఁ గొన్ని కొన్నాళ్లకుమ్ముందె పుట్టియుంట నెత్తురుచాయతో నొప్పి బ్బూరుగపూవులో యనుశంకఁ గలిగించునవియు, గొన్ని జిల్లేడుకాయలం బోలునవియు, ఇట్లు రెక్కలురాక నెగయుటకు శక్తిలేక యుండినచిలుకపిల్లలఁ దొమ్మలసందులనుండియు, తొఱ్ఱలనుండియు, నొక్కొక్కదానిఁ బట్టి బిలుకుమార్చి నేలం బడవైచుచుండెను.

అట్టియెడ నాతండ్రియు నాకాలంబున నే ప్రాణహారంబును, అప్రతీకారంబును గా వచ్చిన యయ్యుపద్రవంబు నవలోకించి వడవడ వడంకుచు మరణభయంబున, గన్నీరు నించుచు దిక్కులం గనుచు నాలుక తడియాఱి చేయునది లేక యక్కాలంబునకది యె ప్రతిక్రియ గా నెంచి నన్ను ఱెక్కలసందున నునిచికొని యుండెను. ఆపాపుఁడును క్రమంబుగ మాతొఱటయొద్దకు వచ్చి ముదిత్రాఁచుపడగవలె భయంకరంబై యమదండంబు ననుకరించు డాచేతిని జాఁచి ముక్కుచేఁ గొఱుకుచు నఱచుచున్న నాతండ్రినిఁ బట్టి చంపెను. అల్పశరీరుండ నగుటను, ఆయువు శేషించి యుండుటను, తండ్రిఱెక్కలలోనం డాగియున్న నన్నుఁ గనుంగొనఁడాయెను, ఆనృశంసుండు గతప్రాణుం డగునాతండ్రిం దలక్రిందుఁ గ క్రిందఁ బడవైచెను. తండ్రితనువుతోడ నేను నుఁ బడుచు నాయువు మిగిలియుంటం జేసి గాలికిం గూడి యుండిన యెండాకులపైఁ బడితిని. దానం జేసి నాయంగంబులు భంగంబు నొందవయ్యెను. వాఁడుచెట్టు నుండి దిగివచ్చునంతలో రాలినయాకులం బోలు ఛాయగలవాఁడ నగుటం జేసి వానికిం గనఁబడక ప్రాణత్యాగంబునకు యోగ్యం బయినయక్కాలంబున ను బాలుండ నగుటం జేసి కాలాంతరంబునఁ గల్గు స్నేహరసంబు నెఱుంగక పుట్టువుతోఁ బుట్టినభయంబునకు లోనై నృశంసునివలెఁ దండ్రిని విడిచి కొంచెము వచ్చుచున్న ఱెక్కలతో నిటునటుఁ బొరలుచు

వెడలి యమునివాతనుండి తప్పించుకొనివచ్చినవానిఁ గానెం చుచు సమీపమున నున్న కానుగు చెట్టుమొదటికిఁ జేరితిని. పిదప నాయెఱుకువాఁ డాచెట్టు దిగి క్రింద పడిచినట్లు చచ్చిప డియున్న పక్షికూనల నాకులలో నునిచి తీవియలం గట్టి తీసి కొని త్వరితంబుగ నెఱుకుఁజేఁదు పోయినత్రోవం బోయెను.

అనంతరము బ్రదుకు నం దాసగొని పితృశోకంబునఁ బొక్కుచు దూరముననుండి పడుటం జేసి యాయాస మొందియు న్న నాకు మిక్కుట మైనదప్పి కలిగెను. అయిన నేనాపాపి ష్ఠుండు పోయెనో? లేదో? యని మెడ సాఁచి దిక్కులం గనుచు గడ్డి గఱుక్కు మనిన ను నాబోయండు వచ్చునో యనియెం చుచు నందుండి వెడలి జలమీపంబునకుఁ బోవ యత్నించితిని. ఱె క్కలురామిని, స్థిరంబుగ నడుగుబెట్టలేమిని పలుమాఱు బో రగిలంబడుచు లేచుచు మొగుడ నడ్డంబు గఁ బడుచుఁ బుడమిం బొరలుచు నలవుగొని మోరపైకెత్తి బెట్టునిట్టూర్పులు వి డుచువాఁడనై మనమున నిట్లు చింతించితి. జగమునం బ్రాణు లెట్టి కష్టదశయందు ను ప్రాణముఁ నం దపేక్ష విడువనేరరుగదా! జంతువులకుఁ బ్రదుకుకంటె మిగుల నిష్టమగువస్తు విం కొక టిలేదు. నుగృహీతుఁడను నాతండ్రి గతించిన ను నే నింద్రియ వైకల్యంబు నొందక బ్రదుకుచున్నవాఁడను. ఇట్లు నిర్ద యుండనై పితృమరణశోకంబు నోర్చిన నన్నేమనుకొనవ

లయుగ? ఏమన, నుపకారంబు ను మఱచి యే జీవించుచున్న వాఁడ. నాజన్మం బెంతనీచం బైనది! నాతల్లిచనిపోవ నాతం డ్రి శోకవేగంబు ను గూడఁ లోన నిముడ్చికొని వృద్ధుం డయ్యె. పెక్కు లగచాట్లుపడి నన్నుఁ బెనుచుచుండ నదియంత యు నేనొక్కట మఱచితి. ఇట్టియవస్థలో నున్నను నన్ను డప్పి కుప్ప గూల్చుచున్నది. ఇప్పటికిని కొలను దవ్వైన నెక లదు. జలదేవతలయందియలయులివ్వుం దలపించుగాయంచలప లు కులు దూరంబున వినంబడుచున్నవి. ఇప్పుడు వేవెలుంగు త నకిరణంబులచే మిడుంగుఱులఁ గ్రుమ్మరించుచున్నాఁడో య న దప్పిం గొప్పఁ జేయుచున్నవాఁడు. నేల కాలుచున్నది. కా లు తడబడుచున్నది. కన్నులు చీఁకట్లు గట్టుచున్నవి. ఆహా! నే నొప్పకున్న నప్పావువిధి నాకు ముప్పే తప్పక యిప్పుడ చొప్ప డఁ జేయునో యెఱుంగ,, అని చింతించుచుండ నాసరోవరంబు నకుఁ గొంతదూరంబున నున్న జాబాల్యాశ్రమమునుండి య తనిర్మలుం డగుహారీతుండు సమానవయస్కు లగుకొందఱు మునిపుత్రులతో పంపాసరోవరంబునకు స్నానార్థియై పోవుచు నామార్గమున వచ్చెను.

హారీతముని చిలుక నాదరించి యాశ్రమంబునకు గొనిపోవుట.

తెలుచు గ సజ్జనులమనంబు లకారణమిత్రంబులు, నతి దయార్ద్రంబులు నగు. ఆహారీతముని యట్టియవస్థలో నున్నన

న్నుఁ గాంచి సమీపవర్తి యగు నొకమునికొమరునితో "ఓయి, ఈచిలుకపిల్లం గంటివా? ఇది ఱెక్కలు రానిదే యీచెట్టుతొఱనుండి క్రిందఁబడినది. లేకున్న శ్యేనముఖమునుండి జాఱియైనఁ గ్రిందం బడియుండవలయును. ఇద్దానియాయువు కొంచెమునే వులో నున్నది. కనులు మూయుచున్నది. బెట్టు నిట్టూర్పులు విడుచుచున్నది. నోఱు దెఱచుచున్నది. మెడ నిలుపలేకున్నది. కావునఁ బ్రాణంబు పోకమున్న దీనిం గొనిరమ్ము. నీటిచెంత నిలుపుము." అని పలికి, నన్నుఁ గొలనికి దెప్పించి, నీటిచేరువం గూర్చుండి, యొక్కచోఁ గమండలు వునిచి, నన్నుఁ బట్టుకొని, యప్రయత్నంబున నోఱుఁ బైని కెత్తిన నన్ను, దనవ్రేలితోఁ గొన్ని జలబిందువులఁ ద్రావించెను. పిదప నీటఁ దడిపి తెలివివచ్చిన నన్నుఁ జల్లని యొక్క తామరాకుమీఁద నునిచి తాను స్నానము చేసి ప్రాణాయామముచేఁ బవిత్రుం డై యఘమర్షణ మంత్రము లుగ్గడించుచు సూర్యున కర్ఘ్యం బిడి వెలినారచీరం గట్టి కమండలువున జలంబు నించికొని మునికొమారులతోడ నన్నుం గొని తపోవనంబునకు నల్లనఁ జనియె.

### జాబాల్యాశ్రమ వర్ణనము.

అచ్చట దెసదెసను గుసుమవిసరంబులతోను, ఫలసంతానంబులతోను భాసిల్లు వివిధమహీజరాజంబుల నలరి, గాలికిఁ దలలు వాంచుతీవియలచే నమస్కరింపఁబడుచున్నదో యనఁ గ

ను గనరి, అగ్నుల వ్రేల్చువారు ను, హరిహరుల నర్చించువా రు ను, ధర్మశాస్త్రముల నాలోచించువారు ను, సకలశాస్త్ర ముల ను విచారించువారు ను, జపమాలికల ద్రిప్పువారు ను, మంత్రముల సాధించువారు ను, యోగము నభ్యసించువారు ను నగుమునివరులతో నొప్పి, కలికాలమును జూడక యు, అసత్యంబుపరిచయములేక యు, అనంగునివార్తవినక యు రెం డవబ్రహ్మలోకంబుబోలు నాశ్రమంబు గాంచితి. ఆపుణ్యా శ్రమమునందు మాలిన్యము హవిర్ధూమములందు కాని చారి త్రములయందు లేదు. మోము మెఱ్ఱనగుట చిలుకలయందు కాని కోపములయందు లేదు. చాంచల్య మనంటియాకులయందు కాని మనంబులయందు లేదు. కన్నెఱ్ఱనగుట కోకిలలయందు కాని పరకళత్రంబులందుఁ గన్పట్టదు. పక్షపాతము పక్షులయం దు కాని వివాదములయందుఁ జూపట్టదు. లెక్క రుద్రాక్షమా లికలయందు కాని శరీరములయందుఁ గానంబడదు. మఱి యు నందు శకునివధ మహాభారతమునందు ను, ద్విజపతనము వార్ధకమునందు ను, నృత్యపక్షపాతము నెమ్ములకు ను, భోగము సర్పములకు ను, శ్రీఫలవాంఛ వానరములకు ను, అధోగతి మూలంబులకు ను గలిగియుండెను. అట్టియాశ్చర్యంబుల కాట పట్టైనయాదివ్యాశ్రమంబునందుమ నశోకతరుతలంబునం గూ ర్చుండి యత్యుగ్రతపశ్శాలు లగుమహర్షులతోఁ గూడి సాగరం

బులతోఁగూడినభువనం బో, కులాచలంబులతోఁగూడిన కనక శైలం బో, అగ్నులతోఁగూడినక్రతువో, భాస్కరులతోఁ గూడినకల్పాంతదివసం బో యనఁదగు, ఉగ్రశాపమునకు భీతిల్లె నన శరీరమును గదల్చుచు, ప్రణయంబు గలది యో యనఁ గేశంబులం గ్రహించి, కుపిత యో యన జాముముడి దాల్చి వ్రతంబు వూనెనన భస్మధవళ మైనముదిమిచే వెన్నైనశరీరంబు గలవాఁడు, అడ్డంబు గం బ్రవహించు గంగా స్రోతస్త్రయంబు గలహిమగిరిశిలాతలం బో యనఁదగు భస్మ త్రిపుండ్రశోభితం బగులలాటపట్టంబుతో రాజిల్లుచు, ఎల్లప్పుడు మంత్రాభ్యాసంబుచేఁ బెదవులఁ గదలించువాఁ డగుట వెడలు సత్త్వప్రరోహంబు లో, స్వచ్ఛేంద్రియప్రవృత్తు లో, విద్యాగుణంబు లో, ధర్మప్రవాహంబు లో, కరుణారసపూరంబు లో యన నొప్పుదంతకాంతులచేఁ దెల్ల నగుపురోభాగంబు గలిగి యాజన్మసంవర్ధితకమండలుండై బృహస్పతిం బోలి, దేవవ్రత ప్రియుండై శంతనుబోలి యున్న భగవంతుఁ డగుజాబాలిం గాంచి మనంబున నిట్లు వితర్కించితి.

"ఆహా! తపంబులప్రభావం బేమి? ఈయాశ్రమంబు శాంతం బయ్యెఁ, బుటపాకశోభితం బగుబంగరుతీరునఁ బ్రకాశించుచు, మెఱుంగుఛాయఁ గన్నుల మిఱుమిట్లు గొల్పుచున్నది. మహామునులనామగ్రహణంబు లె పాపక్షయకారణంబు లగు

ననుచో నీక వారిదర్శనంబునకు ఫలం బేమి చెప్పవలయు? భూతలచతుర్ముఖుం డగుసీమ్మహామహుం డు వసించుటచే నీయా శ్రమంబ కాదు. పుడమి యెల్ల ధన్య యనిచెప్పవలయు. ఇ మ్మహాత్మునిచే నధిష్ఠిత మగుధరణీతలంబుం గాంచి ఇప్పు డం బరతలంబు తాను సప్తర్షిమండలంబునకు నావాసంబ యనునభి మానమును నిక్కంబుగ వహింపదు. ఈయనఘుండు కరుణా రసంబునకుఁ బ్రవాహంబును, సంసారసాగరమునకు సేతువును, క్షమకాధారంబును, తృష్ణాలతకు గొడ్డలియు, సంతోషా మృతంబునకు సాగరంబును, సిద్ధిమార్గమున కుపదేష్టయు, ఉపశ మతరువునకు మూలంబును, ప్రజ్ఞాచక్రంబునకు నాభియు, ధర్మధ్వజంబునకుఁ బ్రాసాదంబును, సకలవిద్యలకు దీర్థంబును, లోభార్ణవంబునకు బడబాగ్నియు, శాస్త్రరత్నంబుల కొఱగ ల్లును, రాగపల్లవంబునకు దావానలంబును, క్రోధభుజంగమ మునకు మహామంత్రంబును, మోహాంధకారమునకు సూర్యుం డును, ఆచారంబులకు వాసభవనంబును, మంగళమునకు నెల వును, మదవికారంబుల కస్థానంబును, సన్మార్గంబులకు దర్శ కుండును, సాధుత్వమున కుత్పత్తియు, సత్త్వమునకాశ్రయం బును, కలికాలంబునకు వైరియు, తపంబులకు నిక్కయు, స త్యంబునకు సఖుండును, విషయంబున కనవకాశుండును, సుఖం బుల కనభిముఖుండును నయి యున్నవాఁడు. ఇమ్మహాత్ముని ప్రభావంబుననే తిర్యగ్జంతువులు ను సహజసిద్ధం బగువైరంబుం

ద్యజించి తపోవనవాస సుఖము ననుభవించుచున్నవి. ఆహా! ఆచట సర్పము ఎండకుఁ దలఁకి నెమ్మిపింఛమునీడ వసించుచున్నది. ఇచటఁ గపికులంబు సహజచాపలంబు విడిచి స్నానము చేసినమునికుమారులకు ఫలములు గొనివచ్చి యిచ్చుచున్నది.'' అని యేను చింతించుచుండ హారీతుండు నన్ను రక్తాశోకతరువునీడ నునిచి తండ్రిపాదారవిందంబులకు వందనం బాచరించి సమీపమున నున్నకుశాసనమునం గూర్చుండెను.

అచ్చటిమును లందఱు నన్నుఁ గాంచి దీని నెచ్చటఁ గొనివచ్చితి వనిహారీతు నడిగిరి. ఇతండును వారల నవలోకించి యీచిలుకకూన చెట్టుమీఁదనుండి క్రిందఁబడి యెండకు డస్సియుండఁ గాంచి దానిం గూటిలో నునుచుట కాచెట్టు ఎక్కరాని దగుటం జేసి కనికరంబున నిటకుం గొనివచ్చితి, కావున ఱెక్కలు వచ్చి యాకసమున నెగయుశక్తి కలుగునందాఁక నీయాశ్రమమందలివృక్షకోటరముననుండి మునికుమారు లొసఁగుఫలరసంబులచేఁ బ్రాణంబుల ధరించుగాక. అనాథపరిపాలనం బె మనబోంట్లకు ధర్మముకదా? ఱెక్కలు వచ్చి గగనతలంబునం జరించు శక్తిగలిగినపిదప దానియిచ్చవచ్చినయిక్కకుం బోవఁగలదు. లేకున్నఁ బరిచయంబుగలుగుట నిచటన యుండగలదు.,, అని నావృత్తాంతంబుం జెప్పుచుండ నాలించి జాబాలిమునీంద్రుండు కుతూహలంబునఁ బుణ్యజలంబులచేఁ గడుగనో

యన నన్నుఁ బ్రశాంతదృష్టిచేఁ గాంచి 'ఇది తనయవినయంబు ఫలంబు ననుభవించుచున్నది, అని వచించెను. కాలత్రయవేది యగు నమ్మునిచంద్రుండు తపఃప్రభావంబునం గలిగినదివ్యదృష్టిచే సకలంబు నెఱుంగువాఁ డగుట నమ్మాటవిని తాపససంఘంబం తయు "ఈచిలుక యెట్టియవినయము నాచరించెను? ఎందులకుఁ జేసెను? ఈజన్మమం దా? పూర్వజన్మమం దా? అని తెలిసికొనుకుతూహలంబున జాబాలిం గాంచి "ఈచిలుక యేవిధమగునవినయంబుఫలం బనుభవించుచున్నది.? ఇది జన్మాంతరమున నేది గా నుండెను? పక్షిజాతియం దెట్లు జన్మించెను? దీనిపే రేమి? నీవు సకలాశ్చర్యంబులకు జన్మక్షేత్రంబవు. కాన మా కుతూహలం బపనయింపుము. ,,అని ప్రార్థింప నమ్మునిసార్వభౌముండు వారల నవలోకించి యిది యాశ్చర్యకరం బగుగొప్ప వృత్తాంతము. మనకు స్నానసమయం బతిక్రమించుచున్నది. కావున లెండు. మాధ్యాహ్నికకృత్యంబుం దీర్చుకొని యనంతరము మీకు మొదటినుండి యిదియేన రో? తొలిపుట్టువున నెట్టియవినయంబు చేసె నో? ఈలోకంబున నెట్లు జన్మించె నో? ఇదంతయుఁ దెలిపెదను. దీనికి నాహారం బొసఁగి బడలిక నపనయింపుఁడు. ఏఁజెప్పుచుండ నియ్యది తనజన్మాంతరవృత్తాంతంబు విని స్వప్నవృత్తాంతంబులె స్మరింపం గలదు. అని చెప్పుచు నె మునులతో లేచి యాహ్నికంబు దీర్చికొనినవాఁ డాయెను.

అంతలో సూర్యుం డస్తాద్రి కేఁగెను. దివసావసానంబునఁ బక్షులవలెఁ రవికిరణంబులు ధరాతలంబు విడిచి కమలినీవనంబుం ద్యజించి తరుశిఖరంబులయందును, పర్వతాగ్రంబులయందును నిలిచెను. పగలెల్ల నెచటనో విహరించి దినాంతంబునకు వచ్చినహోమధేనువుంబలె మునులు సంధ్యం గాంచిరి. సూర్యుండు విదేశగతుం డగుటయుఁ గమలిని కమలముకుళకమండలువుం బూని, హంససితదుకూలంబు గట్టికొని, తమ్మితూండ్లసుయజ్ఞోపవీతంబుతో నొప్పి భర్తృసమాగమవ్రతంబు నొనరించెడి నన నొప్పెను. సూర్యుఁడు పడమటిసంద్రంబునం బడుటను నందుండిలేచిన జలశీకరంబులో యనఁ దనరు తారాగణంబు నంబరంబు ధరించెను. మునివరు లభిముఖులై విడుచునర్ఘ్యజలంబులచేఁ గడుగఁబడియెనో యన సంధ్యారాగం బంతయు గళిత మయ్యెను. చంద్రాభరణంబుం దాల్చి చుక్కలనుగపాలంబులతో నొప్పగగనం బన్నుహరమూర్ధంబుననుండి వెడలుగంగాప్రవాహం బో యన వెన్నెల పుడమిపైఁ బ్రవహించెను. అప్పుడు ప్రదోషవాతంబులు వీచుచుండ నాలుగుగడియలరేయి గడవఁగా హారీతుండు కృతాహారుండ నగుననుం గొని యందఱు మునులతోఁ జంద్రికచే భాసిల్లు నొకవేత్రాసనంబునం గూర్చుండి శిష్యుఁ డగుజాలపాదునిచే వీవఁబడుచు నున్నజనకు నవలోకించి, తండ్రీ, సకల మగుమునిమండలంబును జిలుకవార్త వినుకుతూహలంబున నిరీక్షించుచున్నది. ఈచిలుకకూన విశ్రాం

తి నొందినది. కావున నిది తొల్లిటిజన్మమున నెవఁడై యుండెనో తెలుపు, మని వేఁడిన నమ్ముని యెదుట నున్ననన్నుఁ గాంచి మును లందఱు శ్రవణాసక్తు లగుటం దెలిసి మెల్లగ నిట్లనియె:—

"ఇది గొప్పకథ ఇందుఁ గుతూహలము కలదని నాకర్ణింపుఁడు.

### ఉజ్జయినీపురవర్ణనము.

అవంతిదేశంబున ముల్లోకంబులకు నలంకారం బయి, కృతయుగంబునకుఁ బుట్టినిల్లన నుజ్జయిని యనునగరి శోభిల్లును. అప్పురి ముల్లోకంబుల నుబుట్టింపను, పెంపను, డ్రుంపను గారణుం డగుప్రమథనాథుండు తానుండుటకు రెండవపుడమిం బుట్టించెనో యనన నొప్పుచుండును. మఱియు నియ్యది రెండవపుడమి యనుశంకచే రసాతలగంభీరం బగుజలనిధిచేఁ జుట్టుకొనఁబడియెనో యనన నగడ్తచేఁ గనరుచుండును. ఇందుఁ బశుపతి వసించుచున్నాఁడను ప్రేమంబున నంబరంబు నొఱయుసిగరంబులు గల వెండికొండ చుట్టుకొని యుండునో యనన సుధాసితం బగుప్రాకారం బప్పురంబు జుట్టుకొనియుండును, అప్పురరాజంబు భగవంతుఁ డగుమహాకాలుని శిరంబున నెలకొన్నమిన్నువాఁకం గాంచి యసూయ నొందెనో యనఁ దరంగభ్రుకుటితో నొప్పినశిప్రానదిచేఁ బరిగతప్రాంతం బై యుండును. మఱియు నానగరంబువీరు లయ్యు వినయవంతులును,

ప్రియంవదు లయ్యు సత్యవాదులు న్ను, మహాసత్త్వు లయ్యుఁ బరలోకభీరువులు ను, అభిరూపు లయ్యు స్వదారసంతుష్టులును, కామార్థపరు లయ్యు ధర్మప్రధానులు నగువిలాసిజనుల కావాసంబై మేడలచే కైలాసముతోఁ గూడెనో యనఁగ ను, సత్పురుషులచేఁ గల్పవృక్షములతోఁ గూడెనో యనఁగ ను, చిత్రభిత్తులచే విశ్వరూపమును గనఁ బఱుచునో యనఁగ ను దనరి, యమరావతిని మించి దీపించుచుండును. ఆనగరియందు అవిశ్రాంతి మణిదీపంబులకు ను, తరళత్వము హారలతలకు ను, ద్వంద్వవియోగము చక్రవాకములకు ను, వర్ణపరీక్ష కనకములకు ను, మిత్రద్వేషము కుముదంబులకుం గలదు. పలుమాట లేల? సురాసురబృదవందితచరణారవిందుండు ను, అంధకాదిదుష్టదనుజవిభంజనుండు ను, భగవంతుఁడు నగుహిమగిరితనయాప్రాణవల్లభుండు కైలాసవాసంబునం బేర్మి విడిచి మహాకాలనామంబున నిం దెప్పుడు వసించుచున్నాఁడు.

ఆపుటభేదంబునందు భరతభగీరథప్రతిముండు ను, ఉత్సాహసంపన్నుండు ను, గాంతిని సూర్యచంద్రులకు మూఁడవవాఁడో, యనఁ దనరి, గ్రహగణంబువలె బుధానుగతుండు ను, దశరథునివలె సుమిత్రోపేతుండు న్ను, సతీపతివలె మహాసేనానుగతుండు ను, నర్మదాప్రవాహంబువలె మహావంశప్రభవుండు ను నయి ధర్మంబునవతార మో, పురుషోత్తమునకుఁ

ప్రతినిధి యై యున్న బరీహృతప్రజాపీడుండగు తారాపీడుండను రాజన్యుండు రాజ్యంబు సేయుచుండెను. జను లారాజేంద్రుని చరితంబు ను భాగ్యవృద్ధినింబలె వినిరి. ఉపదేశముంబలె గ్రహించిరి. బహుమంగళముంబలె న్నెంచిరి. మంత్రముంబలె స్మరించిరి. ఆరాజన్యుండు పుడమిం బాలించుచుండ విపక్షత గిరులకు ను, చాపధారణము జలధరంబులకు ను, బంధనస్థితి కుసుమంబులకు ను, నిగ్రహం బింద్రియములకు ను, ధారిప్రవేశము వనకరులకు ను, మలినాంబరత్వము వర్షర్తుదివసములకు ను, గ్రహణాశంక ఉష్ణరశ్మికిని, జ్యేష్ఠాతిక్రమము శీతరశ్మికిని, దుశ్శాసనాపరాధము మహాభారతంబునందు ను, దండగ్రహణము వార్ధకమునందు ను, దానవిచ్ఛిత్తి యేనుంగులందు ను, శూన్యగృహాదర్శనము అక్షక్రీడలయందు ను గాని మ ఱెందు ను గానం బడవు.

ఆరాజన్యునకు నిఖలశాస్త్రపారంగతుండు ను, ధైర్యంబునకు నెలవు ను, స్థైర్యంబునకు నిక్క యు, సత్యంబునకు సాగరంబు ను, గుణంబులకు గురుండు ను, ఆచారంబుల కాచార్యుండు ను, శేషాహివలె సకలమహీభారధారణక్షముండు ను, యుధిష్ఠిరునివలె ధర్మప్రభవుండు ను నగు శుకనాసుం డను విప్రవర్యుండు మహేంద్రునొద్దం బృహస్పతివలె ను, దశరథునకు వసిష్ఠుని చందంబున ను మంత్రిముఖ్యుం డై యుండెను. ఆరాజశశాంకుండు బాల్యంబున నె రాజలక్ష్మీలీలోపధానంబు ను, రణయజ్ఞ

దీక్షాయూపంబు ను, నిఖిలవైరికులప్రళయంబునకు ధూమకే తువు ను నగుతన బాహుదండంబుచే సకలవసుంధరాచక్రంబు జయించి మిత్రునియందుంబలె నాశుకనాసునందు రాజ్యభారం బునిచి ప్రజలను సుస్థితులను గావించి కర్తవ్యశేషంబు గానక యెల్లప్రాయంబు సుఖంబు ననుభవించుచుండెను.

ఒకప్పుడు చందనజలంబులచేతనుంబలె ప్రియురాండ్రచి ఱునగవులచేఁ దడుపఁబడుచు ను, చెవితొవలచేతనుంబలె చూ పులచేఁ గొట్టంబడుచు ను, వెలివలువలచేతనుంబలె వ్రేలిగోళ్ల కాంతులచే నాహతుం డగుచు ను, సంపెఁగపూదండలచేతంబ లె చేఁ దీవియలచేఁ గట్టంబడుచు ను క్రీడించుచుండెను. ఒకప్పుడు వంచిత లగు కామినులచే వకుళకుసుమమాలికలచేఁ గాళులుగట్టం బడి సాపరాధుం డగురిపుని మాడ్కిఁ బూదండచేఁ గొట్టంబడు చుండెను. ఒకయెడనునఁ దేఁటివలెఁ గుసుమశోభితంబు లగుల తాగృహంబులయందు భ్రమించెను. ఒకకాలమున నంతఃపుర సంగీతకము నాలించుచుండెను. చెప్పనేల? అతం డతిరమణీ యంబులు, నభిమతంబులు, నవిరుద్ధంబులు నగు భోగంబుల ననుభవించుచుండెను. ఆమహాపురుషుండు బహుకాలంబునకుఁ దఱుచుగ సకల మగుజీవలోకసుఖంబులఁ గడఁ గాంచెను. కాని పుత్త్రిముఖకమలదర్శనసుఖంబు నెఱుంగఁడయ్యె. అటు ల నుభవింపబడుచు ను, నిష్ఫలపుష్పదర్శనం బగునంతఃపురంబు శరవణంబుఁ బోలియుండెను. జవ్వనం బతిక్రమించుకొలఁది

విఫలమనోరథుఁ డగుచు నాపుడమిఱేనికి నపుత్రతచేఁ గలిగిన గొప్పసంతాపంబు పెంపొందుచుండెను. విషయసుఖవాంఛ చిత్తంబున నత్తమిల్లెను. పెక్కురాజులతోఁ గూడియుండి యు నసహాయునివలెను, కన్నులు గలిగియుండి యు నంధునివలె ను, లోకాధారుం డయ్యు నిరాధారునివలె న్ను నపుత్రికుం డగుటన్నుఁ దా నెంచుచుండెను. ఈరాజేంద్రునకు హరజటాకలాపంబునకుఁ జంద్రరేఖవలె ను, నారాయణుని వక్షస్థలంబునకుఁ గౌస్తుభప్రభవలె ను, సాగరంబునకుఁ జెలియలికట్టవలె ను, దిగ్గజంబునకు మదరేఖవలె ను? చందురునకు వెన్నెలవలె ను, కొలనికిఁ దమ్మివలె ను నలంకారంబై సకలాంతఃపుర యువతులకు ను బ్రధానభూత యైనవిలాసవతి యనువిలాసిని సకలవిలాసంబులకు జనని యో యనఁ బట్టపుదేవి యై యుండెను.

ఒకనాఁ డారాజు విలాసవతీభవనంబున కరిగి యందుఁ జింతాక్రాంతం బైనపరిజనంబుం గూడి, దగ్గఱ నున్నవృద్ధాంగన లూఱడింపఁ గన్నీరు గార్చుచు,సొమ్ములుఁదాల్పక డాచేతిపై మోముదమ్మి నునిచికొని మంచంబుపైఁ గూర్చుండి వగచుచున్నకాంతారత్నంబుం గాంచెను, అంతఁ దనకుఁ బ్రత్యుత్థానంబు చేసినకాంత, నామంచంబుపైఁ గూర్చుండఁ బనిచి తాను ను గూర్చుండి కన్నీరు నించుటకుఁ గతంబు దెలియక వెఱఁగుపడి చెక్కులనుండి జాఱుకన్నీరు తనకరతలంబునం దు

డుచుచు "దేవి, శోకభరంబు నడంచికొని ముత్తియంబులం బలెఁ గన్నీరుబోటలం గ నిశ్శబ్దంబుగ రోదనం బొనర్చుటకుఁ గతం బేమి? కృశోదరి, అలంకరించుకొన వేల? కెందమ్మి మొగ్గలయందు లేయెండంబలె నడుగులయందు లత్తుకఁ బట్టింప వేమి? తుంటవిల్తునిగోలని రాయంచ లగురతనపుటందియలఁ బాదపంకజస్పర్శంబున ననుగ్రహింప వేల? కరభోరూ, కుసుమరహితం బగునీకేశపాశంబు చంద్రలేఖారహితం బగుబహుళపక్షప్రదోషంబుచందంబున నాదృష్టికి ఖేదంబు గలిగించుచున్నది. ప్రసన్న వగుము. శోకనిమిత్తంబు దెల్పుము. నీనిట్టూర్పువెచ్చూరలు సరాగం బగునాడెందముసుఁ దలిరాకునుంబలెఁ గంపింపఁ జేయుచున్నవి. ఏ నేదేని నేరము చేసియుంటి నా? లేక పరిజనం బొనర్చియుండె నా? ఎంత యాలోచించియు నీయెడఁ దప్పొనర్చి నట్లు గానను. నాజీవితము, రాజ్యంబు ను నీయధీన మ కదా? దుఃఖకారణంబు సెప్పుము., అని పలుమఱు వేఁడిన ను నాయమ మాఱు వలుకకున్న నంతఁ బరిజనంబు నడిగెను. అపుడు విలాసవతియడపకత్తె మకరిక యిట్లనియె:—

"దేవ, దేవరవారివలన లోపము లేదు. దేవరవారు సుముఖులై యుండఁ దప్పొనర్పనేరికి శక్తి కలదు? మఱి యేమన, యేలినవారిసమాగమంబు విఫలం బాయె నను గొప్పసంతాపంబున నీదేవి తపించుచు స్నానభోజనాదులయందుఁ బరిజనుల

ప్రేరణంబున నెట్టకేలకు దుఃఖంబుతోడ న ప్రవర్తించునదియై దేవరవారిసొందంబు నోచ్చుంనని యెంచి వికారంబు వెలిపుచ్చకుండెను. నేడు చతుర్దశి యనిమహాకాలదేవునిం బూజింపనరిగి యచట మహాభారతంబు పఠించుచుండ " అపుత్త్రులకుం గతి లేదు, ఉత్తమలోకంబులును లేవు. పున్నామం బగునరకంబుననుండి గాచువాడుగానం బుత్త్రుండనంబడుగు,, నను మాటల విని యింటికి విచ్చేసినది యై తన్నుం బరిజనం బెంత వేడినను నాహారంబు గ్రహింపదు. భూషణంబులం దాల్పదు. మాఱు వల్కదు. ఎల్లప్పుడు ను గన్నీరు నించుచున్నది. ఇది యవృత్తాంతము. , అని చెప్పి యిన్నకుండెను.

అంత నాభూకాంతుండు కొంతదడవు చింతించి నిట్టూర్పు నిగిడించి దేవి, దైవాధీన మగునీవిషయంబున నేమిచేయవలయు? చింతిల్లకుము. మనము దేవతలయనుగ్రహమునకుం బాత్రులము గాము. దాన నె పుత్త్రాలింగనసుఖంబునకు మనడెందంబు పాత్రంబు గా దయ్యెను. తొల్లిటిజన్మంబున శుభకర్మంబు సేయమైతిమి. తొలిజన్మంబునం జేయనికర్మం బీజన్మంబునం బురుషున కెట్లు ను ఫలంబిడ నేరదు కదా? ఎంతవాడైనను దైవంబు మీఱంజాలునే? మనుష్యయత్నం బున నెంతవట్టు సేయ శక్య మగునో, యదియంత యు నొనరింపుము. గురువులయందు భక్తి నధికంబు గ నిలుపుము. దేవపూజ రెండింతలు సేయుము. ఋషిజనంబులపరిచరణయం దాదరంబు

గనఁబఱుపుము. దేవతలను, ఋషులకు యత్నంబున నారాధింపవారు దుర్లభంబు లగువరంబుల నైన నొసంగుదురు. తొల్లి మగధదేశంబునఁ బృహద్రథుండనురాజు చండకౌశికుం డనుమునీంద్రునియనుగ్రహంబున జనార్దనుని జయింపఁజాలుబల పరాక్రమంబులు గలజరాసంధుం డనుపుత్రునిం బడసెను. దశరథుండును ఋశ్యశృంగుని ప్రసాదంబున నారాయణునిభుజంబులంబలె నప్రతిహతు లగునలువురుకొమరులఁ గాంచెను. తక్కుంగలరాజర్షులును మునుల నారాధించి పుత్త్రిదర్శనసుఖంబు నొందిరి. మునిజనసేవ యమోఘంబు. 'ఏనును జంద్రోదయంబుగాఁ బోవుతఱిఁ బున్నమరాతిరి చందంబున వెలవెలఁబాఱు మోమునం దీపించుదేవి నెన్నఁడుచూఁతునో, మఱి యెప్పుడు నాపరిజనంబు పుత్త్రజన్మంబు తెలిపి యుడుగర లొందెడి నో' అని యివిలో నగుమనోరథ శతంబులఁ జింతించుచు లోనఁ గుందుచు నె కాలము గడపుచున్న వాఁడను. అపుత్రతం గలుగు నీశోకంబు నన్నును రేలుంబవళ్లు గాఁడించుచు నే యున్నది. నాకీజగంబు శూన్యంబు గఁ దోచుచున్నది. నాజీవితంబు, రాజ్యంబు ను నిష్ఫలం బని తలంచెద. ప్రతివిధానంబు లేనివిధివిషయంబున నేమి సేయ నగు. శోకంబు విడువుము. ధైర్యంబున ను, ధర్మంబున ను మనంబు నునుపుము. ధర్మపరుల కెల్లసిరులు ను సమీపంబున నుండును., అని నుడివి నిజకరతలంబుచేఁ దలిరుటాకు చేతంబలె నద్దేవిముఖకమలంబున నున్నకన్నీరు సలీలం

బుగం దుడిచి, మగుడ ధర్మోపదేశగర్భంబు లగువచనంబుల నూఱడించి కొంతదడ వుండి యటనుండి వెడలెను.

అంత నవ్విలాసవతి శోకవేగంబు విడిచి యెప్పటియట్ల సొమ్ముల నలంకరించికొని దివసకృత్యంబు నెఱవేర్చెను. అది మొదలుకొని దేవతారాధనములయందు ను, బ్రాహ్మణపూజలయందు ను, గురుజనశుశ్రూషలయందు ను నధిక మగునాదరంబు వహించి యెవరెవరివలన నేయేవ్రతము వినియెనో, పుత్రునియం దాసగొనినది యగుటంజేసి యం దగుకష్టంబు లెక్కింపక యది యెల్లం జేయుచుండెను. పరిశుద్ధ మైనవెలిచీరం గట్టి యుపవసించి చండికాలయంబునం బ్రాణాచారంబు పడియెను. రత్నఖచితంబు లగుహేమపాత్రంబులయందు నూవుల నించి యయ్యవి విప్రుల కొసంగెను. సిద్ధాయతనంబుల సేవించెను. మాతృకాగృహంబుల కరిగెను. ప్రసిద్ధంబు లగుతీర్థంబుల మునింగెను. అశ్వత్థము మున్నగు వనస్పతులకుం బ్రదక్షిణము సేసెను. నిమిత్తజ్ఞుల నుపచరించెను. శకునజ్ఞుల నాదరించెను. వృద్ధపరంపరాగతము లగుపెక్కురహస్యముల నాచరించెను. పుణ్యకథల వినియెను. ఓషధులం గట్టుకొనియెను.

తారాపీడుండు సుస్వప్నంబుం గాంచుట.

ఇట్లు కాలంబు గడచుచుండ నొకనాం డాభూకాంతుండు నిశావసానంబున పిడియేనుంగు నోరం దామరతూంటికడియము ప్రవేశించుచుండుపున మేడమీఁద నున్నవిలాసవతి ముఖంబు

నఁ బూర్ణచంద్రుండు ప్రవేశించు నట్టుల కలఁగాంచి మేల్కాంచి సంతసంబున నప్పుడు శుకనాసుం బిలిపించి యా స్వప్నవృత్తాంతంబు సెప్పెను. ఆమంత్రిపుంగవుండును విని సంతసంబు నొంది దేవ, చిరకాలమునన్నుండి మాకును, బ్రజలకును గలమనోరథంబులు సిద్ధించినవి. కొలఁదిదినములలోననె దేవరవారు పుత్రముఖావలోకనసుఖమ్ము నిస్సంశయముగ నొందఁగలరు. ఇప్పు డేనును స్వప్నంబున నుదికినవెలివలువం గట్టుకొనిన యొకజన్నిగట్టు మరందబిందు సందోహంబును గురియుదెలిదమ్మిం గొనివచ్చి మనోరమతొడపై నునిచినటుల కంటిని. శుభనిమిత్తంబులు రాఁగలయానందముం దెలుపుచున్నవి. పుత్రముఖావలోకనంబు దక్క మన కానందకారణం బొండేమి కలదు? వేకువం గనినకలలు తఱుచుగ సఫలంబు లగు. కావున దేవేరికి మాంధాతవలె సకలరాజర్షిధురంధరుండును, లోకానందకరుండు నగుకొమరుండు పుట్టంగలఁడు" అనినృపుఁ శుకనాసుం జేయి వట్టుకొని రాణివాసంబునకు వచ్చి యిర్వురుం గన్నకలల తెఱంగు విలాసవతికిం దెలిపి యాయమ నానందింపఁ జేసిరి.

## విలాసవతి గర్భంబు ధరించుట.

అంతఁ గొన్నిదినంబులు కడచన దైవతాప్రసాదంబున సరసి చంద్రప్రతిబింబంబుం ధరించునట్లు విలాసవతి గర్భంబు ధరించి పారిజాతంబుచే నందనవనరాజివలెను, కౌస్తుభమణిచే

మధురిపువక్షస్స్థలివలె మిగుల ప్రకాశించెను. అద్దేవి యద్దపుసిరి వలె గర్భచ్ఛలంబున రాజప్రతిబింబంబు వహించెను. నానాఁటికి గర్భంబు వృద్ధినొందినకొలఁది జలపూర్ణం బగుమేఘమాలపగిది మెల్లమెల్లన సంచరించెను. ఆవులింతలతో నాయాసంబుగ నిట్టూర్పు విడుచుచుండెను. పానభోజనంబుల నొల్లకయున్నయమ్మగువం గనియింగితజ్ఞు లగుపరిజనంబు లివ్వి గర్భచిహ్నంబు లని యెఱింగిరి. వారిలోఁ బ్రధానభూత యగుకులవర్ధన యనుదాది శుభదినంబునఁ బ్రదోషవేళ నభ్యంతరాస్థానమండపగతుం డయి దీపికాసహస్రంబునడుమ చుక్కలనడుమ నున్నరిక్కలరాయనిచెల్వున నుండి శుకనాసునితో నిష్టకథాగోష్ఠిం బ్రొద్దుపుచ్చు తారాపీడుం గని రహస్యంబుగ విలాసవతీగర్భవృత్తాంతంబు చెప్పెను. ఎన్నండును విని యుండనియవ్వార్త చెవి సోకినంత నాభూకాంతుం డమృతరసంబున నొడలెల్లఁ దడిసినవడువున రోమంబులు పులకలెత్త చిఱునవ్వు మొలకలెత్త నెడఁద నిండఁగ మిగిలిన హర్షంబు నోయన దంతకాంతిమిషంబున వెలువరించుచు నానందబాష్పమగ్నం బగుదృష్టి శుకనాసునిపై నిగిడించెను.

### తారాపీడుండు విలాసవతిని జూడవచ్చుట.

శుకనాసుండును రాజుమొగంబున నెన్నండును జూడని హర్షప్రకర్షముం గని, నగుమోముతో వచ్చినకులవర్ధనం గని యు, నక్కాలంబున నింకొక హర్షాతిశయకారణంబుం

గానక, తా నిది యే యని యూహించి, సమీపమునకు వచ్చి మెల్లన నిట్లనియె:—"దేవ, స్వప్నవృత్తాంతంబు నిక్కమయ్యె నా? కులవర్ధనకనుంగవ విస్ఫారియైయున్నది. దేవరవారిలోచన యుగళంబును నానందజలప్లుతంబయి గొప్పది యగుహర్ష కారణముం దెలుపుచున్నది. ఆమహోత్సవంబువార్త నాలింప నాడెందము వేగిరపడుచున్నది. ఇది యే మో యేలినవారు తెలుపుదురుగాక,, అనిన విని యారాజు నవ్వి "ఇది చెప్పినది నిక్కమేని నాకల నిక్కమే యగు. ఏను విశ్వసింపను. ఇట్టి భాగ్యసంపద మా కెట్లు కలుగును? ఇట్టివార్త నాలింప నేము పాత్రుల మగుదు మా? కులవర్ధన నిజముచెప్పినది యైన నే నిట్టి కల్యాణంబులు మాకు సంభవింపనేర వని తలంచినవాఁడనగుట నిది యసత్య మని యెంచుచున్నాఁడ. కావున లెమ్ము, ఏన యచటికిఁ జని దేవిని గని యిదెంతనిజ మో తెలిసికొనియెద,, అని పలికి రాజుల నందఱ ననిచి తనయొడలి తొడవులఁ దీసి కులవర్ధన కొసఁగి శుకనాసునితోడఁ గదలి హర్షనిర్భరంబగుమనంబు వేగిరపెట్టుచుండఁ గరదీపికల వెలుంగున నంతఃపురంబు ప్రవేశించి వాసగృహంబున గర్భోచిత మగుశయనీయమునందు నుదయగిరిమస్తకంబున నున్న చంద్రమండలంబు గల రాత్రివలె వెలుఁగువిలాసవతిం గాంచెను. అంత నద్దేవి యునొక చేతఁ బరిజనంబు చేయి పట్టుకొని భూషణారవంబులు వెలయ లేచుచుండ "నత్యాదరంబు చాలుఁ జాలు లేవకుము,, అని పలికి యాయమతో నాశయనీయంబునం గూర్చుండెను.

అప్పు డప్పుడమిఱేఁడు గర్భచిహ్నంబుల నొప్పు నప్పొలఁతిం గని యుప్పొంగి హర్షవివశం బగుమనంబునఁ బరిహాసభావంబున "దేవి, కులవర్ధన పలికెడుపలుకు నిక్కమా? యని శుకనాసుం డడుగుచున్నాఁడు," అని పలుక నక్కాంతామణి చిఱునగ వాలయు లజ్జచే దంతకాంతిమిషం బగు నంశుకంబున మోముదమ్మిం గప్పికొనుచు నధోముఖి యై యుండెను. రాజు తన్ను వేమాఱు అడుగుచుండ నే నేమి యు నెఱుంగ నని మోము వాంచి కుపిత యో యన దేవిం గాంచెను. అంత భూకాంతుండు మఱి యు నిట్లనియె:—"సుతనూ, నావచనంబున నీకు లజ్జ కలుగునేడ నే నిశ్చలంబుగ నుండువాఁడ. ఇంక వికసించు సంపెఁగమొగ్గకు సవర్ణం బై పాండురత్వము నొందునీ వన్నె కేమి ప్రతివిధానంబు నాచరించెదవు? మఱి యు నా నాఁటికి బిగువగు మొలనూలిచే బాధనొందుచుఁ గార్శ్యంబు విడుచు నీ నడుము నెట్లు డాఁతువు?" అని యడుగుచుండ శుకనాసుండు రాజుం గాంచి, "దేవ, దేవి నేల శ్రమపెట్టెదవు? ఇవ్వార్తచే దేవేరి లజ్జించుచున్నది. ఈయాలాపంబు విడువుము," అని పల్కి నిజసదనంబునకుం జనియెను. నరనాథుం డవ్వాసగృహంబున నే యారాత్రి గడపెను. అంతఁ గ్రమంబుగఁ బ్రసవసమయంబు పూర్ణం బగుడు శుభదినంబున జ్యౌతిషికులు పాదచ్ఛాయలచేఁ గడచినగడియలు లెక్కించుచుండ మంచి లగ్నంబున విలాసవతి సకలలోకానందకరుం డగుపుత్రునిం

గనియెను. అ త్తఱి వేగంబు గఁ బరిక్షిణం బిటునటుఁ బరుగిడు చుండఁ గను, రాజునొద్దకుఁ గంచుకిగణంబు పఱచుచుండఁ గను గొప్పసందడి ప్రవర్తిల్లెను. తరువాత మందరంబుచే మథింపంబడుజలనిధిఘోషంబు ననుకరించుదుందుభిధ్వానం బుం బురస్కరించుకొని మృదంగశంఖకాహళనినాదంబులచే నిబిడంబయినయుత్సవకోలాహలంబుచే సామంతులు, ప్రజలు ను హర్షాతిశయంబున నర్తనంబు చేసిరి. చంద్రోదయంబునఁ గడలి వృద్ధి నొందునట్లు రాజసూనునిజన్మంబున నుత్సవంబు వృద్ధిఁ గాంచెను.

తారాపీడుండు కుమారుం గాంచుట.

అంత నవ్వాక్షీవుండు పుత్రముఖదర్శనంబునకు నెంద ముత్తలపాటొందుచున్నను, జ్యోతిషికులచే నుపదిష్టంబగుప్ర శస్తముహూర్తంబునఁ బరిజనుల నెల్ల వారించి శుకనాసుండు మాత్రము తోడరా, మణిమయమంగళకలశంబులతో నొప్పిన ద్వారదేశంబుచే రాజిల్లుచు, ప్రసవగృహమండనమంగళం బుల సంపాదించుపురంధ్రీవర్గంబుతోఁగూడి రక్షార్థమన్నియుం దుంపఁబడినపాముకుప్పసంబు లోనగువానిపొగచేతను, విప్రు లచేఁ జల్లఁబడుశాంత్యుదకముచేతను దనరి, లోన శుభశతంబుల ధ్యానించునట్లు నిశ్చలశిఖంబులైనమంగళదీపంబులచే దీపిం చుచున్నపురిటిల్లుం గాంచి, జలము నగ్గిని స్పృశించి లోనఁ బ్ర వేశించెను. అంత నచటఁ బ్రసవవశంబునఁ గృశించి యున్న విలాసవతితోడమీఁదఁ దనకాంతిపుంజంబున దీపకాంతుల నిర

సించుచు, గర్భరాగంబుల విడువమింజేసి "ఉదయకాలంబున నెఱ్ఱనైన సూర్యబింబం బో? సంధ్యాసమయంబున లోహితం బయినచంద్రబింబం బో? వికసించినశోదమ్మిమొత్త మో? పుడమిం జ్యాడనే తెంచినయంగారకుం డో? సురవనితలకరంబుల నుండి జాఱిపడినయింద్రకుమారుం డో?,, యనందనరి, సహజ భూషణంబు లో యన నొప్పారుమహాపురుషలక్షణంబులతో భాసిల్లుచు నాహ్లాదజనకుం డైనతనయుం గాంచెను. మఱియు నారాజన్యుం డానందబాష్పంబులు గ్రమ్మం బుత్రముఖంబుం గనుఱెప్పవ్రేయక కాంచి సంతసించుచుం దన్నుం గృతకృత్యునిం గా నెంచెను. అప్పుడు శుకనాసుండు బాలకు నంగోపాంగంబులం గనంబఱచుచు భూపాలునితో ని ట్లనియె:— దేవ, ఇక్కుమారుని చక్రవర్తిచిహ్నంబులం గంటివా? సంజెకెంజాయ రంజిలుబాలచంద్రకలం దలపించునితనిఫాలంబు నం దామరతూండ్లచందమున నూర్ణాచిహ్నంబు ప్రకాశించుచున్నది. వికచపుండరీకధవళం బయి, కర్ణాంతాయతం బైనకనుంగవ వాసగృహంబును వెలింగించుచున్నది. కరతలంబులు శంఖచక్రచిహ్నాతంబు లై విష్ణుకరంబులవలెం గరంబు మెఱయుచున్నవి. చరణంబులు ను వేల్పుప్రమాని క్రొంజివురులవలెం గోమలంబు లై ధ్వజరథాదిలేఖలు వెలయ రాజసహస్రంబుల కిరీటగతంబులగురత్నంబులచే ముద్దుం బెట్టుకొనం దగియున్నవి. మఱియు నేడ్చుచుండ నిబ్బాలకు స్వరంబును దుందుభిరావంబువలె గం

భీరం బై వినంబడుచున్నది.,, అని నుడువుచుండఁగ నె పరిమ
ళకుఁ డన్నునొక్క పరిచరుండు త్వరితగతి నేతెంచి రాజునకు
మ్రొక్కి "దేవ, అదృష్టము ఫలించినది. శత్రువులు నిహతు
లైరి. చిరకాలము జీవింపుము. పుడమి జయింపుము. పూజ్యుఁ
డగుశుకనాసుని జ్యేష్ఠపత్నియందు రేణుకయందుఁ బరశురా
మునివలెఁ గొమరుం డుదయించెను.,, అని విన్నవించిన నర
పతి యమృతంపుసోనం బోలు నవ్వార్త నాలించి,, ఏమి యీ
కల్యాణపరంపర? కీడు కీడును మేలు మేలును ననుబంధించు
ననులోకప్రవాదము సత్య మైనది.,, అని పలికి మోముదమ్మి
వికసింప శుకనాసుం గౌఁగిలించికొని నవ్వుచుఁ దాన శుకనాసు
నుత్తరీయమునుఁ బూర్ణపాత్రము గా గ్రహించి మంగళకున
కపరిమిత మగు పారితోషికము నొసంగెను.

పదంపడి యటనుండి లేచి వివిధవాద్యంబులు మెఱయ,
ప్రకృతులు, సామంతులు ను దోడరా శుకనాసునిభవనంబున క
రిగియం దుత్సవము రెండింతలు నెఱపెను. అనంతరమారాజు ప
దియవదినము ప్రాప్తింప శుభముహూర్తంబున గోవుల ను, సు
వర్ణమ్ము న్ను, కోట్లకొలఁది విప్రుల కొసఁగి స్వప్నంబున నితనిత
ల్లి నోరఁ జంద్రబింబంబు ప్రవేశించుచుండఁ గాంచితి, నని తద
నుగుణంబు గఁ బుత్రునకుఁ జంద్రాపీడుం డని నామకరణంబు గా
వించెను. మఱునాఁడు శుకనాసుండు ను బ్రాహ్మణులకుఁ దగు
సకలకృత్యములను నెఱపి కొమరునకు బ్రాహ్మణులకుఁ దగిన

విధంబున వైశంపాయనుఁ డని నామకరణంబు నొనరించెను. క్రమంబునఁ జౌలాదిసంస్కారంబులఁ బడసి చంద్రాపీడుండు బాల్యంబు నతిక్రమించెను.

చంద్రాపీడుని విద్యాభ్యాసము.

అత్తఱిఁ దారాపీడుండు సుతునకుఁ గ్రీడావ్యాసంగం బంతరింపఁ జేయఁ దలంచి వీటివెలుపల శిప్రానదీతీరంబున నర్ధక్రోశము విస్తారంబున స్వర్గభవనంబు ననుకరించు నొకవిద్యామందిరంబు గట్టించెను. మఱియు సర్వవిద్యలను నేర్పఁజాలునాచార్యుల మహాయత్నంబున సంగ్రహించి వారిసన్నిధి శుభదినంబునఁ జంద్రాపీడుని వైశంపాయనునితోడ నర్పించెను. అచ్చట నొరులు ప్రవేశింపరాము గురుపుత్రమాత్రసహాయుం డై పంజరమున నున్న సింగపుగొదమచందమున శిశుజనక్రీడావ్యాసంగంబు విడిచి యనన్యమనస్కుం డై యాచార్యులవలన నఖిలవిద్యల నభ్యసించుచుండెను. ప్రతిదినంబును భూమిపతి విలాసవతితోడ నచ్చటికి వచ్చి కుమారుం గని పోవుచుండెను. చంద్రాపీడుండును రాజుచే నియుక్తుం డయి యేకాగ్రచిత్తంబునఁ జదువుచు నాచార్యుల కుత్సాహంబు గలిగించుచుఁ గొంతకాలమున నె సకలవిద్యలను గ్రహించెను. అతినిర్మలం బగు మణిదర్పణంబునఁ బ్రతిఫలించువిధంబున సకలకలాకలాపంబును నతనియందు సంక్రమించెను. పదవాక్యప్రమాణములయందును, ధర్మశాస్త్రములయందును, రాజనీతులయందును, చాపచక్రకృపాణాదిసాధనములయందును, రథచర్య

లయందు ను, గజతురగారోహణములయందు ను, గాంధర్వ వేదమునందు ను, హస్తిశిక్షయందు ను, అశ్వహృదయమం దు ను, చిత్రకర్మమునందు ను, ద్యూతకళలయందు ను, రత్న పరీక్షలందు ను, ఆయుర్వేదమునందు ను, మంత్రప్రయోగము నందు ను, విషాపహరణమునందు ను, కావ్యనాటకాదులయం దు ను, పురాణేతిహాసములయందు ను, సర్వలిపులయందు ను, సకలదేశభాషలయందు ను, శిల్పమునందు ను, తక్కుంగలక లావిశేషములయందు ను మిక్కిలి కౌశలంబు గాంచెను.

మఱి యు శ్రమము నభ్యసించుచున్న రాకొమరునకు బా ల్యంబున నె భీమున కట్లు సకలజనుల కాశ్చర్యమ్ముం గలిగించుమ హాబలంబు గలిగియుండెను. అతం డేనుంగుగున్నలం గని చెవిఁ బట్టినంత నే యవి సింహకిశోరంబునకుం జిక్కినట్లు కదలఁజాల కుండెను. ఇతండు బాల్యంబున నె యొకకత్తివ్రేటున దాటి మ్రాఁకులఁ దమ్మితూఁడ్లంబలె ఛేదించుచుండెను. సకలనృపకు లవనదావానలుం డగుపరశురాముని బాణంబులవలె నితని బా ణంబులు భూధరంబుల నుం భేదించుచుండెను. ఈరాజనంద నుండు పదుగు రెత్తఁజాలినయినుపగుదియతో సాధనము చే యుచుండెను. వైశంపాయనుం డొక్కబలంబునం దక్కఁ ద క్కుంగలకళలయందు నతని ననుకరించి యుండెను. చంద్రా పీడునకు వైశంపాయనుండు విశ్వాసపాత్రం బగుపరమమిత్రం బయి యుండెను. వా రిరువురు నొండొకరి విడిచి నిమిషమై

న నొంటిమెయి నుండఁజాలకుండిరి. ఇట్లుండ సాగరమున కమృతరసంబురీతిని, కల్పవృక్షంబునకుఁ గుసుమోద్గమంబుచందంబునను, కమలవనంబునకు సూర్యోదయంబుపగిదిని, నాచంద్రాపీడునకు యౌవనారంభంబు ప్రాదుర్భవించెను. సమయ మెఱింగిన సేవకునివిధంబున మారుం డితనిసమీపమున నుండెను. లక్ష్మితోడ వక్షంబు విస్తరించెను. వైరిజనంబుతోడ నడుము కార్శ్యము నొందెను. ప్రతాపంబుతోడ రోమరాజి యంకురించెను. చరితంబుతోడ లోచనయుగంబు ధావళ్యము నొందెను. ఇతనికి స్వరంబుతోడ హృదయంబు గంభీరంబాయెను. ఇట్లు నవయౌవనాభిరాముం డై పరిసమాప్తసకలకలాకలాపుం డైనకుమారుఁ దోడ్కొని వచ్చుటకుఁ దారాపీడుండు శుభదినంబున సేనాధిపతి యగు వలాహకుని బహుతురంగబలంబుతోఁ బుత్తెంచెను. ఆబలాహకుండును విద్యామందిరంబున కేగి తనరాక ద్వారపాలకులచేఁ దెలిపి ప్రవేశించి ప్రణమిల్లి రాజపుత్రుననుమతి వినయంబునఁ గూర్చుండెను. ఇట్లు ముహూర్తమాత్రం బుండి రాకొమరుని సమీపించి వినయంబున నిట్లు విన్నవించెను:—

వలాహకుండు రాజునానతి రాకొమరున కెఱింగించుట.

“కుమారా, మామనోరథంబులు పూర్ణములయ్యె. శాస్త్రంబులఁ జదివితివి. ఎల్లకళల నేర్చితివి. ఆయుధవిద్యలయందెల్లఁ బ్రతిష్ఠఁ గాంచితివి. విద్యాగృహంబు వెలువడ నాచా

ర్యాలందఱు నంగీకరించిరి. నిన్నుం జూడ సకలాంతఃపురజనం బులును నుత్కంఠితులై యున్నవారు. నీవు విద్యాలయం బునం బ్రవేశించినంతనుండి పదినంవత్సరము లయ్యెను. ఆఱ వయేంట నిటం బ్రవేశించితివి. ఇప్పుడు నీకుం బదియాఱవసం వత్సరంబు. కావున నిప్పుడు వచ్చి తల్లులకు దర్శన మొసంగి గు రువులకు వందనము చేసి నిర్బంధములేక సుఖంబుగ రాజ్యసు ఖంబుల ననుభవింపుము. రాజలోకమును సమ్మానింపుము. ద్వి జులం బూజింపుము. ప్రజలం బాలింపుము. బంధువులం దను పుము.,, అని మహారాజువా రాజ్ఞాపించుచున్నారు. నీకయి యేలినవా రంపినయింద్రాయుధం బనువారువంబు వాకిట ను న్నది. 'ఇది సముద్రంబునం బుట్టి యుచ్చైశ్శ్రవంబుతో సమా నలక్షణం బైనది. దేవర వారికి యోగ్యంబు, అనిపారసీకాధిపతి పనిచెను. కావున దీని నధిష్ఠించి యనుగ్రహింతువుగాక.' అ నిపల్కి మిన్నకుండెను.

అంతం జంద్రాపీడుండు తండ్రియానతి శిరంబునం బూని రాందలంచి 'యింద్రాయుధంబుంగొని రమ్ము; అని గంభీరస్వ రంబునం బలికెను. పదంపడి యిర్వురుపురుషులు గొనివచ్చు టయు వేగంబున గరుత్మంతునకుం బ్రతిపక్షియో, వాయువు నకుం ద్రైలోక్యసంచరణసహాయుమో, ఉచ్చైశ్శ్రవంబునంశా వతారమో యన నొప్పునింద్రాయుధంబుజూడనె ధీటుం బైన నాచంద్రాపీడునకు విస్మయంబు గలుగుటయు నంత నతండి

ట్లు మనంబున వితర్కించెను. 'పూర్వము దేవాసురులు ఘం గరమునకు వాసుకినిఁ జుట్టి సాగరంబుం ద్రచ్చి యాయశ్వర త్నంబు నుద్ధరింపక యింకేర్రత్నంబు నుద్ధరించిరి. ఇంద్రుం డి ద్దాని సద్ధిష్ఠింపక త్రైలోక్యరాజ్యఫలంబు నేమి యనుభవిం చెను? సాగరుం డుచ్చైశ్శ్రవంబున విస్మయంబు గలిగించి యింద్రుని వంచించెఁగదా? ఇందాఁక నీయశ్వరత్నంబు నారా యణున కగపడ దయ్యె. దానంజేసి యిప్పటికిని గరుడారో హణాన్యసనంబు విడువఁడు. ముల్లోకములందును దుర్లభంబు లగునస్తువులు లభించుటచే మాతంద్రిరాజ్యలక్ష్మి యింద్రుని సిరిని మించుచున్నది యని యెంచెద. ఈతేజి యతితేజోవం తంబును, మహాప్రాణంబును నగుటంజేసి దేవతంబోలి యె క్కుటకును సంశయము గలిగించుచున్నది. సామాన్యతురంగ మంబుల కిట్టియాకారంబులు గలుగునే? దేవతలును మునిశా పంబున నిజశరీరంబుల విడిచి యిట్టిశరీరాంతరములఁ బొందు చునే యున్నారు. తొల్లి స్థూలశిరుం డనుముని రంభను శపిం ప నది గోడిగ యయి మృత్తికావతియందు శతధన్వుని సేవిం చుచుఁ బెక్కుకాల ముండెను. అవ్విధమున నివ్వాజియు శాపంబువలనఁ బుట్టినమహాత్ముఁ డొకం డని తోఁచెడి.' అని చింతించుచు నయ్యశ్వంబు నెక్కనెంచి తేచి యాగుఱ్ఱంబునకు ఎంగట నిలిచి 'మహాత్మా, నీ వెవ్వండవో నీకు నమస్కారము నాయారోహణాతిక్రమంబు సహింపుము.' అని యింద్రాయు ధంబు నధిష్ఠించెను.

చంద్రాపీడుండు తురగారూఢుం డయి రాజమార్గంబున వచ్చుట.

అట్లు రాజనందనుండు వారువంబు నెక్కి వెలువడి యప్రమేయ మగునశ్వసైన్యమ్ముఁ గాంచి తన్ను బలసి ప్రణమిల్లు రాజపుత్రుల నాదరించి వైశంపాయనునితోఁ గదలి వంది మాగధులకై వారంబులు వెలయ నగరంబు ప్రవేశించెను. అంత నప్పౌరులు రాకుమారు నాలోకించి 'నేఁడు ధన్యుల మైతిమి. మాజన్మంబు సాఫల్యంబు నొందెను. చంద్రాపీడమిషంబున రూపాంతర మొందినపుండరీకాక్షునకు నమస్కారము.' అని నుడువుచుఁ బ్రణమిల్లిరి. నగరంబును జంద్రాపీడుం దర్శించు కుతూహలంబునఁ గన్నులు దెఱచెనో యనఁ దెఱనంబడిన కవాటంబులు, వాతాయనంబులును గలదయ్యెను. అప్పుడు 'చంద్రాపీడుండు విద్యాగృహంబుననుండి వచ్చెడి' నని విని దర్శించుకుతుకంబున నవ్వీటిబోటు లందఱును సంభ్రమంబున నఱయఱగాఁ జేసికొనినయలంకారములతో వెలుఁగడి కొందఱు డాకేల నద్దంబు బట్టికొని పూర్ణేందుబింబంబుతో మెలంగుపూర్ణి మారాత్రులచెలువునను, కొందఱు త్వరితగతి నరుదెంచుటఁ మొలనూలు వీడి కాళ్లుల కడ్డంబు నడినకతన కాలి గొలుసుల మెల్లమెల్ల నేతెంచు పిడియేనుంగులచందమునను సౌధంబుల నెక్కి నిక్కి నిక్కి చూచుచుండిరి. అత్తఱి మేడల యందుఁ బరస్పరసంఘట్టనమునం జేసి హారమణులు గలరమణులభూషణనినాదంబు మకరధ్వజునివిజయఘోషణంబు నను

కరించెను. ముహూర్తమాత్రంబున యువతిజనంబులు నిండి యుండ సౌధంబులు నారీమయంబులో, వారిపదకమల విన్యాసంబున భూతలంబు పల్లవమయంబో, వారలయంగకాంతిచే నగరము లావణ్యమయంబో, వారిముఖాననజాతంబుచే గగనంబు చంద్రబింబమయంబో యనఁ దనరి యుండెను. కౌతుకంబున నమ్మదవతులు కనుఱెప్ప వ్రేయక యట్టె చూచుచుండ నాదర్శమయంబులో, స్ఫటికమయంబులో, సలిలమయంబులో యనఁదగువారల డెందములలోనఁ జంద్రాపీడునాకృతి ప్రవేశించెను.

పౌరాంగనలు చంద్రాపీడుని గాంచి తమలోఁ జిత్రంబుగ సంభాషించుట.

అంత నక్కాంతలు మదనవివశస్వాంత లై తమలో నొకరి నొకరు త్వరితగమనా, నన్నును రానిమ్ము. దర్శనోన్మత్తా, ఉత్తరీయము సవరించికొనుము. మూఢా, చంద్రలేఖం గైకొనుము. మదనిశ్చేతనా, ధమ్మిల్లము ముడివేసికొనుము. చంద్రాపీడదర్శనవ్యసనిని, కాంచీదామము పట్టుకొనుము. మతిహీనా, పడిపోయిన దంతపత్రమును గ్రహించుము. తుష్టిహీనా, ఎంతసేపు చూచెదవే? పిశాచి, పయ్యెద జారుటం జేసి నిన్నుఁ జూచి జనులు నవ్వుచున్నారు. మిథ్యావినీతా, కపటదృష్టులతో నేమిఁ బాగుగాఁ జూడుము. అతికోపనా, నీవ ముందు నిలువుము. మత్సరవతి, ఒకర్తుకవె వాతాయనంబు నడికొట్టెదవా? అనంగపరవశా, నాపయ్యెదం గొని

పయ్యెద వేసికొనియెద వేల? అధీరా! పెద్దవారలయెదుటం బఱవ నగునా? ముగ్ధా! మదనజ్వరంబునం గలిగినపులకజాలంబు దాంచికొనుము. కౌతుకావిష్టా, నిట్టూర్పు విడువను మఱచితివి. అనంగశరప్రహారమూర్ఛితా, ఆతపనివారణంబు నకయి శిరంబునం బయ్యెదకొంగు నునిచికొనుము. సతీవ్రత గ్రహాగృహీతా, చూడవలసినదానిం జూడక కనుంగవను వంచింప నేల, పరపురుషదర్శన పరిహారవ్రతా, చెడితివి. లెమ్ము. రతివిరహితుండగుమారుండు బోలు నిక్కుమారు నాలోకింపుము., అని యిట్లు సపరిహాసంబులును, ససంభ్రమంబులును, సాసూయంబులును, సవిలాసంబులును, సానురాగంబులును నై యతిరమణీయంబు లై నయాలాపంబులు విననయ్యెను.

చంద్రాపీడుండు రాజమందిరంబు జొచ్చుట.

అంతం జంద్రాపీడుండును పెక్కుభంగుల ముచ్చటించున విప్పించుబోములకనుంగవలచేం బానము చేయంబడువానివలెను, భూషణరవంబులచేం బిలువంబడువానివలెను, హృదయంబులచే ననుగమింపంబడువానివలెను, ఆభరణరత్న కాంతులచేం బంధింపంబడువానివలెను, రాజమందిరద్వారంబు చేరి యింద్రాయుధంబు దిగి వైశంపాయనునికరంబు పట్టికొని వలాహకుండు ముందు త్రోవం జూపుచుండం గృతయుగపురుషుల వలె మహాప్రమాణులగుద్వారపాలురతో నొప్పుద్వారదేశంబు దాంటి మహాద్వారం బయ్యు దుష్ప్రవేశంబును,

అవంతిదేశగతంబయ్యు ! మాగధజనాధిష్ఠితంబు నగురాజ
కులంబు ప్రవేశించి రాజలోకంబు ప్రొక్కుచుండ గైకొనుచుఁ
జనిచని మహాప్రమాణములును, నతికర్కశులును నగుటంజేసి
రక్కసులవలె నున్న రక్షాధికారనియుక్తపురుషులచేఁ బరివృ
తుండై వారవిలాసినులు వింజామరలు వీచుచుండ. మందా
కినీజలంబున నున్న సురకుంజరంబుచాడ్పున హంసధవళం బగు
శయనతలంబునం గూర్చుండి యున్నతండ్రినిం గాంచెను.

### తారాపీడుండు పుత్త్రుంగని సంతసించుట.

'కనుఁగొను,' మని ప్రతీహారుండు పల్కినపిదప దూ
రంబుననె శిరంబుచేఁ బ్రణమిల్లినకుమారుని 'రమ్ము ర,
మ్మని పల్కుచుఁ దారాపీడుండు దూరంబుననుండియె కరంబు
లుసాఁచి యానందాశ్రువులొలుక నొక్కటిగఁ జేసికొనువాని
వలె నక్కునఁ జేర్చుకొనియెను. కౌఁగిలించికొనివిడిచినంత జన
కుని పాదపీఠంబుసమీపంబున నడపకత్తె యుత్తరీయముం బఱ
చినను మీఁగాలం ద్రోసివైచి నేలపైఁ గూర్చుండెను. అంత
భూకాంతుండు వైశంపాయనునిం బుత్త్రునిర్విశేషంబుగాఁ
గౌఁగిలించికొనిన నతఁడును నుచితాసనంబున నుపవిష్టుం
డాయెను. అంతఁ దారాపీడుండు కొంతదడ వానందపరవశుఁ
డై యుండి 'వత్స! పొమ్ము. పుత్త్రవత్సల యగుతల్లిం గని
ప్రణమిల్లి క్రమంబుగఁ దల్లుల నందఱ నానందింపఁ జేయు
ము,' అనియాదేశింప 'వల్లె,' యని లేచి చంద్రాపీడుండు

పరిజనంబుల నిలిపి వైశంపాయనద్వితీయుఁడై యంతఃపురంబు ప్రవేశించెను. అందు సంధ్యలవలె సకలలోకవంద్యలై పూర్వకథలఁ జెప్పుచు నితిహాసంబులఁ జదువుచు ధర్మోపదేశంబులఁ జేయుచు నున్నజరత్ప్రవ్రాజికలతోఁ బ్రొద్దుపుచ్చుకొనుచు నంగనాజనంబుచే సేవింపఁబడుచున్నతల్లిం డగ్గఱి ప్రణమిల్లెను. ఆయమయుఁ బరిజనం బుండినను తాన యాఁగ నెత్తి హృదయంబు స్నేహాకులంబై ద్రవీభావంబు నొంది స్తన్యంబుమిషంబున స్రవించెడినో యన శిరంబు మూర్కొని చిరకాలము నక్కునఁ జేర్చికొనియెను. పదంపడి వైశంపాయను నాదరించి చంద్రాపీడుని బలాత్కారంబునఁ దనతొడపైఁ గూర్చుండఁబెట్టుకొనియెను, పరిచరులు దెచ్చినయుచితాసనంబున వైశంపాయనుండు కూర్చుండఁ జంద్రాపీడుని వేమాఱు నక్కునఁ జేర్చి లలాటంబునను, భుజశిరంబులను దడవుచు నిట్లనియె:—‘ వత్స! త్రిభువనలాలనీయం బగుపట్టియాకారంబు గలనిన్ను నిందాఁక మిగుల నాయాసపెట్టిన నీతండ్రి యెంతకఠినహృదయుం డనవలయు? ఇంతకాల మీగురునిర్బంధము నెట్లు సహించితివి? బాలుండవైనను గఠినునకుంబలె నీకు ధైర్య మేమి? గురుజనంబులదెస నీకుఁ గలభక్తి యెంతనిరుపమాన మైనది; తండ్రియనుగ్రహంబున సకలవిద్యల సాధించిననిన్నుఁ గాంచితి. ఇట్లు శీఘ్రకాలముననె యిల్లాండ్రతోఁ గూడినవానిం జూడఁగలను. అనుచు లజ్జావనతుం డగుసుతుని ముద్దాడెను. అట్లు గొంత

దడ వచ్చుటనుండి చంద్రాపీడుండు క్రమంబుగఁ దల్లుల నెల్ల దర్శించి యానందింపఁ జేసెను. రాజమందిరద్వారముననున్న యింద్రాయుధము నెక్కి రాజపుత్త్రులు దోడరా శుకనాసుం జూడ నరిగి బాహ్యాంగణంబున నె, వారువంబు డిగి రెండవ రాజమందిరంబో యన నొప్పు శుకనాసభవనంబు ప్రవేశించి యనేకరాజసహస్రంబుమధ్యంబున నున్నశుకనాసునకు విన యంబునఁ బ్రణమిల్లెను. శుకనాసుండును సంభ్రమంబున లేచి హర్షాతిశయంబునఁ గనుఁగవ నానందాశ్రువు లురులఁ జంద్రా పీడుని వైశంపాయనునితోడ బిగికౌఁగిటఁ జేర్చుకొనియెను. అంత నాదరంబున నొసఁగినసింహాసనంబు విడిచి రాజపుత్త్రుం డు వైశంపాయనసహితంబుగ నేలపైఁ గూర్చుండెను. రాజ పుత్త్రుండు గూర్చుండ శుకనాసుండు పక్కఁ దక్కటిరాజ లోకంబు సింహాసనంబుల విడిచి పుడమిపైఁ గూర్చుండిరి. అత్తఱి శుకనాసుండు క్షణము సేపూరకుండి పులకాంకురమ్ము లచే సంతస్గత మగుహర్షాతిరేకముం దెలుపుచు నిట్లనియె:—

‹తండ్రీ, చంద్రాపీడ, సంపూర్ణవిద్యుండవు, సంప్రాప్తయౌవ నుండవు నగునిన్నుఁ జూడఁ దారాపీడమహారాజునకు నిపుడ కదా రాజ్యఫలప్రాప్తి కలిగెను. సకల మగుగురుజనాశీర్వాదం బులును నిప్పుడు ఫలించెను. అనేకజన్మాంతరార్జితం బగుపుణ్య రాశి యిప్పుడు పరిపక్వం బాయెను. కులదేవత లిప్పుడు ప్రస న్నులైరి. అపుణ్యులకుఁ ద్రిభువనాశ్చర్యకరు లగుమిము

బోఁటివారు పుత్త్రులై జన్మింతు రా? ఈప్రాయ మెక్కడ? ఈ యమానుషం బగుశక్తి యెక్కడ? ఈసకలవిద్యాగ్రహణ సామర్థ్యంబు నెక్కడ? ప్రజలకు భరతభగీరథప్రతిముండ వగు నీవు పాలకుండవుగాన వారు ధన్యులు. నిన్ను భర్తను గాఁ బడయ నిప్పుడమి యేమి తపము చేసెనో? మహావరాహంబు దంష్ట్రావలయంబున ధరించినట్లు తండ్రితోడ నిజబాహువున భూభారంబు వహింపుము.' అనిపల్కి తాన వసనకుసుమాదులచే గారవించి యనిచెను. పదంపడి చంద్రాపీడుం డటనుండి వెడలి యంతఃపురము ప్రవేశించి వైశంపాయనునితల్లిని మనోరమం దర్శించి యటనుండి కదలి యింద్రాయుధంబు నెక్కి కుమారభవనంబునకు విచ్చేసెను. అందుఁ స్నానాదిభోజనాంతం బగుదివసకృత్యంబు నెఱపి తనశయనీయగృహంబున నె యింద్రాయుధంబునకు నిరవు గల్పించెను. ఇటు లాదివసంబు గడపి మఱునాఁడు జనకుననుమతి వడసి ప్రభాతంబున వేఁటకయి యడవి కరిగెను. అందుఁ జంద్రాపీడుండు మృగయావినోదంబునఁ బెక్కుమృగములఁ జెండాడి మహాప్రాణుం డగుటం జేసి కొన్నింటి సజీవంబుగఁ బట్టుకొని మరలివచ్చి సుస్నాతుం డయి రాజపుత్త్రులతోడ మిష్టాన్నంబు నారగించి తాంబూలంబు గ్రహించి యింద్రాయుధంబు నాదరించి రాజుం దర్శించి యారాత్రిఁ గడపెను.

### కైలాసుండు పత్రలేఖం దోడ్కొని వచ్చి చంద్రాపీడున కొప్పగించుట.

మఱుచటినాఁడు కైలాసుం డనుకంచుకి కన్యక నొక్కతం గొనివచ్చి చంద్రాపీడునకుఁ బ్రణమిల్లి యిట్లనియె:— 'కుమార! మహాదేవి విలాసవతి యానతిచ్చెను. 'ఈకన్యక కులూతాధీశుని కూఁతురు. పత్రలేఖయనునది. మహారాజు కులూతాధీశుని జయించి యతనిపుత్త్రి యగునిక్కన్యను గొని వచ్చి యంతఃపురపరిచారికామధ్యంబున నునిచెను. 'ఇది రాజపుత్త్రి దిక్కులేని,' దని యేను దీనిం బుత్త్రికాభావంబున నిందాఁక పెనిచితిని. ఇక్కన్నియ నీకు నడపకత్తె కాఁ దగు నని యనిచితి. నీ విద్దానియందుఁ బరిజనసామాన్యదృష్టి నుంపఁదగదు. బాలనుంబలె లాలింపవలయు. సఖినింబలె రహస్యకృత్యంబులయందు విశ్వసింపవలయు. చిరకాలంబుగఁ బెనుచుటం జేసి యీకన్నియపై నాకు మిక్కుటంబగు ప్రేమంబు కలదు. దీనిశీలం బెఱుంగ నని చెప్పి యనిచితి;' అనిన విని చంద్రాపీడుండు 'అంబయానతిచొప్పున మెలఁగువాఁడ,' నని పల్కి కైలాసుని ననిచెను. పత్రలేఖయుఁ జంద్రాపీడునకు మ్రొక్కి తదనుమతి యెల్లప్పుడును తోడునీడవలె నెడబాయక సేవించుచుండెను. ఇట్లు కొంతకాలము కడచిన పిదపఁ దారాపీడుండు నందనునకు యౌవరాజ్యపట్టాభిషేకము సేయ నెంచి సంభారంబులం గూర్పఁ బ్రతీహారుల నియోగించెను. యౌవరాజ్యాభిషేకంబు సమీపింప నొకనాఁడు చంద్రాపీడుండు శు

కనాసుని దర్శింపఁ బోయిన నామంత్రిముఖ్యుం డతనికి నీతి నింకను గఱపఁ దలంచి యాదరంబున నిట్లనియె:—

శుకనాసుఁడు చంద్రాపీడునకు నీతి నుపదేశించుట.

'తండ్రీ! చంద్రాపీడ, సకలశాస్త్రంబుల నభ్యసించి, యెల్లవిషయంబులఁ దెలిసికొని యున్ననీకు నిపు డుపదేశింపఁదగిన దేమియుఁ గన్పట్టదు. ఐనను యౌవనంబునం బొడము తమము స్వభావగుణంబున సూర్యునిచే భేదింపఁబడనియు, రత్నకాంతులచే ఛేదింపబడకయు, దీపప్రభలచే వారింపఁబడకయుఁ గేవల మతిగహనంబయి యుండును. లక్ష్మీవలనం గలుగుమదంబు ముదిమియందును నణఁగనేరదు. ఐశ్వర్యతిమిరాంధత్వ మింకొకండు కలదు. ఇది యేకాటుకకును సాధ్యంబు గాదు. మదనజ్వరతాపంబు శైత్యోపచారంబులకు నణఁగనేరదు. విషయంబులవిషంబులఁ జవిగొంటం గలిగిన మోహంబు మంత్రంబులచేఁ దొలఁగదు. రాజ్యమలావలేపంబు స్నానశౌచంబులవలనఁ దలఁగునది కాదు. రాజ్యసుఖనిద్ర వేకువ మెలఁకువనొందనేరదు. కాన విస్తరంబుగఁ జెప్పవలసె, లోకంబున నాగర్భశ్రీమత్త్వము, నవయౌవనము, నిరుపమాన సౌందర్యము, అమానుషశక్తియనునది యనర్థములపరంపర. ఇందొక్కొక్కఁడే సకలదుర్నయంబులకు నిరవు. ఇన్నియుఁ గూడినచో నేమి చెప్పవలయు? శాస్త్రజ్ఞానం బనుజలంబునఁ గడుగఁబడి నిర్మలం బయి యున్నను బుద్ధి

యౌవనారంభమునఁ గాలుష్యము నొందక మానదు. యౌవనవంతుని దృష్టి ధావళ్యమున్ను విశుపేకయ సరాగంబ యగుచుండును. సుడిగాలి యెండుటాకును గొని చనునట్లు యౌవనసమయంబున రజోభ్రాంతినొందిన ప్రకృతి పురుషునిఁ దనయిచ్ఛం గొనిచనును. ఇంద్రియంబుల పేరి హరిణంబుల కాశపెట్టు నుపభోగంబు పేరి మృగమరీచిక దుర్గంతం బగు. నవయౌవనంబునం గ్రాఁగి యున్న చిత్తంబునకు జలంబులుఁబోలె ననుభవించుకొలఁది విషయంబు లతిమధురంబులై తోఁచుచుండును. విషయాసంగము దిఙ్మోహంబువలెఁ బురుషుని నుత్పథంబున నడిపించెడిని. నీవంటివారలె యుపదేశంబునకుఁ బాత్రులు. చంద్రకిరణంబులు స్ఫటికమణియందుఁ బ్రతిబింబించునట్లు లుపదేశగుణంబులు నిర్మల మగు చిత్తంబున సుఖంబుగఁ బ్రవేశించుఁగదా? గురువచనము నిర్మలమయ్యుఁ జెవిసొచ్చినంత నభాగ్యునకు జలమునలె గొప్ప చెవిపోటు పుట్టించును. అదియె ధీమంతునకు నేనుంగునకు శంఖాభరణంబునలె నధికమగు ముఖశోభ నావహింపఁజేయును. ప్రదోషసమయంబున నిశాకరుండంధకారము నడఁచునట్లు గురూపదేశము సకల మనుష్యదోషజాతము నడంచును. శాంతిహేతు వగుమదిమి నల్లని వెంట్రుకలఁ దెల్లనివానిఁగాఁ బరిణామింపఁజేయునట్లు గురూపదేశం బాదోషజాతంబును గుణరూపంబుగఁ బరిణమింపఁజేసెడి. ఈవు విషయరసంబు చవిఁ జూడకుంట నుపదేశ మొంద నీకిది యు

క్తకాలము. కుసుమశరప్రహారంబునఁ జిల్లులువడినచిత్తంబున
జలమువోలె నుపదిష్టంబు నిర్గళితమగును. దుస్స్వభావునకు స
ద్వంశము వినయప్రదాయికము కాదు. చందనవృక్షంబునఁ
బొడమినంతనె యగ్ని కాల్పకుండునె? అవినీతునకు శాస్త్రం
బును వినయసాధకము కానోపదు. దాని నశించుటకు హే
తు వగునీటిచేతనే బడబాగ్ని ప్రజ్వలింపదా? గురూపదేశ మన
మనుజులకు నఖిలమలంబులఁ గడుగఁజాలినస్నానంబును, ముదిమి
లేనివృద్ధత్వంబును, మేదోదోషంబు లేనిగురుత్వంబును, సు
వర్ణమున రచింపఁబడనికర్ణాభరణంబును, జ్యోతిస్సు లేనిప్ర
కాశంబును, ఉద్వేగంబు నిడనిజాగరణంబు ను నగు. విశే
షించి రాజులకు నుపదేశకులు లేరు. జనులు భయంబునఁ బ్ర
తిశబ్దంబువలె రాజవచనంబు ననుసరించుచుందురు. ఆరాజులు
గర్వంబనుబధిరత్వంబుచే మూసికొనిపోయినవీనులు గలవార
లగుటం జేసి యుపదేశింపఁబడువచనంబు విననేరరు. ఒకప్పు
డు వినిరేని గజనిమీలితంబున నలక్ష్యముచేసి యుపదే
శించుగురువుల కుమ్మలికంబు గలిగింతురు. రాజులప్రకృతి య
హంకారమహాదాహజ్వరంబునం గలిగిన మూర్ఛచే నంధీకృతం
బయి వివశంబయి యుండుం గదా? ధనంబులు వృథాభిమా
నం బనునున్మాదంబు గలిగించుచున్నవి. రాజ్యలక్ష్మి రాజ్య
విషవికారం బనుమాంద్యంబు నొసంగును. కల్యాణకాముండ
వగునీవు తొలుత లక్ష్మినే కనుఁగొనియెదుగాక.

సుభటుల ఖడ్గఖండలంబు పేరియుత్పలవనంబునం భ్రమించు దేంటి యగునీలక్ష్మీ క్షీరసాగరంబుననుండి వెడలునపుడు సహవాసపరిచయవశంబునఁ బారిజాతపల్లవంబులవలన రాగంబును, నిందుశకలంబువలన వక్రగుణమును, నుచ్చైశ్శ్రవంబువలనఁ జాంచల్యమును, కాలకూటంబువలన మోహనశక్తిని, మదిరవలన మదమును, కౌస్తుభమణివలన కాఠిన్యమును నిట్లు విరహవినోదచిహ్నంబులు గ్రహించెనో యన నొప్పును. లోకంబున నిట్టివస్తు వింకొక్కటి కన్పట్టదు. ఏలన, ఈలక్ష్మి కష్టంబున లభించి యు దుఃఖంబునఁ బాలింపఁబడుచుండు. గట్టిత్రాళ్లం గట్టి కదలకుండ నునిచినను వదలిపోవును. వీరభటసహస్రంబు బట్టినయసిలతాపంజరమున నునిచినను దప్పించుకొనును. మదజలంబు వర్షించుకుంజరపుంజంబులచేఁ బాలింపంబడియుఁ బరుగిడును. పరిచయమును రక్షింపదు. కులముం జూడదు. రూపము నాలోకింపదు. కులక్రమము ననువర్తింపదు. శీలముం గనుఁగొనదు. వైదగ్ధ్యమును గణింపదు. శాస్త్రము నాకర్ణింపదు. ధర్మము ననురోధింపదు. త్యాగము నాదరింపదు. విశేషజ్ఞతను విచారింపదు. ఆచారమును బాలింపదు. సత్యమును దెలిసికొనదు. లక్షణమును బ్రమాణీకరింపదు. గంధర్వనగరలేఖయుంబోలె చూచుచుండనె నశించును. మందరము తిరుగునప్పుడు వాడమినభ్రాంతిసంస్కారంబు నిప్పుడును దాల్చినదియుంబోలె నుండినచో

నుండక తిరుగుచునుండును. పంకజవనంబున సంచరించునప్పు డరికాలఁ దన్మిత్రూఁటిముల్లు నాటెనో యన నొక్కచో నడుగుఁ జక్కగా మోపదు. రాజగృహంబులయం దతియత్నంబున ధరింపఁబడియు గంధగజంబులగండతలమధువు గ్రోలి మత్తిల్లెనో యనఁ దొట్రువడుచుండును. తైక్ష్ణ్యము నభ్యసింపనో యన నసిధారలయందు వసించును. విశ్వరూపత్వమును గ్రహింపనో యన నారాయణమూర్తి నాశ్రయించును, లతవలె విటపకుల నధిష్ఠించును. గంగవలె వసుజనని యయ్యుఁ దరంగబుద్బుదచంచల యగు. దివసకరునిగతివలె వివిధసంక్రమణంబుగలదియు, పాతాళగుహావలెఁ దమోబహుళయు, వర్షర్తువువలె నచిరద్యుతికారిణియు నై యల్పసత్త్వుని నున్మత్తునిఁ గావించును. సరస్వతీపరిగృహీతుఁ డగుజనుని నీర్ష్యచేతనో యన నాశ్లేషింపదు. గుణవంతుని నపవిత్రునింబలె స్పృశింపదు. ఉదారసత్త్వుని నమంగళునింబలె బహుమానింపదు. సుజనుని ననిమిత్తునివలెఁ జూడదు. సత్కులప్రసూతుని సర్పమునుంబలె నతిక్రమించును. శూరుని కంటకునింబలెఁ బరిహరించును, దాతను దుస్స్వప్నముంబలె స్మరింపదు. వినీతునిఁ బాతకినింబలె సమీపింపదు. మానవంతుని నున్మత్తునింబలెఁ జూచి నవ్వుచుండును. తనచారిత్రము నింద్రజాలమునట్లు బరస్పరవిరుద్ధము గాఁ గనంబఱచును. ఎట్లన, దాపము నారోపించుచు జాడ్యమును గలిగించును. ఉన్నతి నొసంగుచు నీచస్వ

భావమును బ్రకటించును. సాగరమునం బోడమియుం దృష్ణను బెంపు సేయును. ఈశ్వరత్వమును దొల్చియు నశివప్రకృతిత్వమును విస్తరించును. ఖలవృద్ధి నొసంగుచును లాఘవమును గలిగించును. అమృతసహోదరి యయ్యుం గటువిపాకయు, బహుపోత్తమరత యయ్యు ఖలజనప్రియ యునై ధూళివలె స్వచ్ఛమైన వానిం గలుషునిం గావించును. ఈచపల ప్రకాశించుకొలందిఁ దీపశిఖవలెం గజ్జలమలినం బగుకర్మంబునె వెలార్చును. మఱియు నియ్యది తృష్ణ యనువిషలతలకు వారిధారయు, ఇంద్రియమృగంబులకు వ్యాధగానంబును, సచ్చరితంబు లనుచిత్రంబులకు ధూమలేఖయు; మోహంబు పేరిదీర్ఘనిద్రలకు విభ్రమశయ్యయు, ధనమదపిశాచంబులకుఁ గూటగృహంబును, శాస్త్రదృష్టులకుఁ దిమిరోద్గమంబును, సర్వావినయంబులకుఁ బురస్సరపతాకయు, క్రోధావేశగ్రాహంబులకు నుత్పత్తినదియు, విషయమద్యములకుఁ బానీయశాలయు, భ్రూవికారనాట్యంబులకు సంగీతశాలయు, లోకాపవాదంబులకు నెలవును, కపటనాటకంబులకుఁ బ్రస్తావనయు, కామగజంబునకుఁ గదళికయు, సాధుభావంబునకు వధ్యశాలయు, ధర్మంబనునిందుబింబమునకు రాహుజిహ్వయు నగును. ఈసిరితో స్థిరముగఁ గూడియున్న వానిని, దీనిచే మోసపోనివానిని నే నెఱుంగను. ఇయ్యది చిత్రరువున నున్నను చలించును. పుస్తకరూపురా లయ్యు నింద్రజాలము రచించును.

గట్టిగఁ గట్టినను వదలిపోవును. ఇట్టిదురాచార యగుసిరిచే నెట్లో దైవవశంబునఁ బరిగ్రహింపఁబడినవా రై రాజులు పార వశ్యము నొంది సర్వావినయంబుల కధిష్ఠాన మగుదురు. ఎట్లన, నభిషేకసమయమున నె వీరిదాక్షిణ్యం బభిషేకజలములచేఁ గడుగఁబడియెనో యన వదలిపోవుచుండును. వారలడెందం బగ్నికార్యధూమముచేతనో యన మాలిన్యము నొందును. పురోహితులకుశాగ్రము లనుసమ్మార్జనులచేఁ దుడువఁ బడియెనో యన క్షమ పోవును. ముదిమి రాఁ గల దనుస్మృతి పట్టబంధముచేతనో యన నాచ్ఛాదింపఁబడును. పరలోకదృష్టి యాతపత్రమండలముచేతనో యన వారింపఁబడును. సత్యవాదిత్వము వింజామరలగాడ్పులచేతనో యన నపహరింపఁబడును. గుణములు వేత్రదండములచేతనో యనఁ బారదోలఁబడుచుండును. సాధువాదంబులు జయశబ్దకలకలంబుచేత నో యనఁ దిరస్కరింపఁబడుచుండును. యశము ధ్వజపటంబులచేత ననఁ బరామర్శింపఁబడుచుండును.

కొందఱు శ్రమవశంబున శిథిలం బయినపక్షి మెడవలెఁ జంచలంబు లై మిణుఁగురులప్రకాశంబువలె క్షణమాత్రము మనోహరంబు లై, మనస్విజనులచే గర్హితంబు లై నసంపదలచే నాశపెట్టఁబడి, ధనలవంబు లభించుటం గలిగినగర్వంబున జన్మంబును మఱచి యనేకదోషంబులం బెరిఁగినదుష్టరక్తంబుచే తనన రాగావేశంబుచే బాధింపఁబడుచు, వివిధంబు లగువిష

యంసంబుల గ్రసింప లోలుపంబులై యేనైన ననేకసహస్ర సంఖ్యలో యనఁ దనరునింద్రియంబులచే నాయాస పెట్టఁబడు ప్రకృతిచంచల యగుటంజేసి యొక్కటి యైనను శతసహస్రత నొందెనన నొప్పుమనంబుచే వ్యాకులీకృతులై పారవశ్య మొందుచున్నారు. మఱియు గ్రహములచే గ్రహింపఁబడినవారివలెను, భూతములచేఁ దిరస్కరింపఁబడినవారివిధంబునను, మంత్రములచే నావేశపెట్టఁబడినవారిచందమునను, సత్త్వములచేఁ బట్టుకొనఁబడినవారిరీతిని, వాయువుచే బాధింపఁబడినవారిభాతిని, పిశాచములచే గ్రసింపఁబడినవారిరీతిని వర్తింతురు. మననశరంబులచే మర్మంబులయందుఁ గొట్టబడినవారివలె ముఖవికారంబులఁ గనంబఱుతురు. ధనదాహంబున నుడుకువారివలెఁ బరితపించుచుందురు. గొప్పదెబ్బలు దిని నవారివలెఁ గమయంగంబుల ధరింపజాలకుందురు. కులీరంబువలె స్వద్ధంబునఁ బరిభ్రమింతురు. అధర్మంబునఁ గమనశక్తి దప్పిన కుంటివారివలెఁ నొరులచే నడిపింపఁబడుదురు. మృషావాదం బనువిషంబువిపాకంబునం గలిగినముఖరోగంబు గలవారివలె నతికష్టంబుగ మాటాడుదురు. కుసుమరజంబులచే నేడాకులయనంటులవలె వికారంబులచే సమీపమున నున్నవారలకుఁ దలనొప్పి గల్గింతురు. ఆసన్నమృత్యువులవలె నెదుట నున్నబంధుజను నైనఁ దెలిసికొనం జాలరు. కాలసర్పదష్టులవలె మహామంత్రములచే నైనఁ దెలివి నొందరు. లక్కబొమ్మల

వలె నష్టమును సహింపరు. కత్తులవలెఁ బానంబునఁ దైక్ష్ణ్య వృద్ధినొంది పరప్రేరితులై నశింపఁ జేయుచుందురు. దండవిక్షేపంబులచే దూరస్థితంబు లగుఫలంబులంబలె మహాకులంబుల నాశ మొందింతురు. అకాలకుసుమంబులవలె మనోహరాకృతులయ్యు లోకవినాశంబునకు హేతువు లగుదురు. శ్మశానాగ్నులవలె నతిభయంకరం బగుభూతిగలవారును, తిమిరరోగగ్రస్తులవలె దూరదృష్టి లేనివారును, మార్జాద్యుపసర్గంబు నొందినవారిచందమున క్షుద్రాధిష్ఠితభవనులై వినంబడుచున్నను ప్రేతపటహంబులవలె భయము గలిగింతురు. చింతింపఁబడియు మహాపాతకంబులవలె నుపద్రవంబు నాపాదింతురు. అనుదినంబును బాపముచే నిండింపఁబడినవారివలె బు సంగొట్టుచుందురు. అట్టియవస్థలో నున్నవారలు వ్యసనశతంబులకు గుఱియై వల్మీకతృణాగ్రంబున నున్నజలబిందువుంబోలెఁ బతితులైనను దన్నుఁ దెలిసికొనం జాలరు.

మఱికొందఱు జూదము వినోద మనియుఁ, బరదారాభిగమనము వైదగ్ధ్య మనియు, వేఁట పరిశ్రమం బనియు, స్వాదాసపరిత్యాగము వ్యసనరాహిత్యం బనియు, గురువచనము సరకుగొనమి స్వాతంత్ర్య మనియు, భృత్యులజయింపమి సుఖోపసేవ్యత్వ మనియు, నృత్యగీతాదులయందును, వేశ్యలయందును నాసక్తి గలిగియుంట రసికత యనియు, గొప్పతప్పుల వినకుండుట మహానుభావత్వ మనియు,

లోకనింద సహించుటయె తాలిమి యనియు, తనకుఁ దోఁచునట్లు నడచుటయె ప్రభుత్వ మనియు, దేవావమాన మొనర్చుటయె మహాసత్వత యనియు, వందిజనులపొగడ్త యె కీర్తియనియు, చాంచల్యమె యుత్సాహ మనియు, మంచి చెడుగులెవిన కుండుటయె నిష్పక్షపాత మని యు, దోషములయందు గుణత్వము నారోపించుచు, లోలోన నగుచు, దుర్వ్యధ లాచరించుచు, స్వార్థపరులును, ధనపిశితంబు గ్రసింపఁగ్రద్దలును, 'అస్థానంబుపేరి కమలినికి ధూర్తబకంబులును, నగుధూర్తులు అమానుషోచితంబు లగు స్తుతులచేఁ దమ్ము వంచించుచుండ వి త్తమదంబుచే మత్తుగొనినచి త్తంబున నిశ్చేతను లగుటంజేసి యట్టులే యని తమయందు వృథాభిమానంబు నారోపించుకొని మర్త్యధర్ములయ్యును దివ్యాంశంబున నవతరించినవారివలెఁ దమ్ము నమానుషులనుగా నూహించుచు సర్వజనంబునకును నుపహాస్యత నొందుచుందురు. భృత్యులు సేయుఁదమపరిహాసమును విని సంతసింతురు. తమయందు మనంబున దేవతాభిమానంబు వహించి శుక్కటియుపసేతులును లోన నున్నవానిఁ గా నెంతురు. తమమూఁడవకన్ను చర్మంబుచేఁ గప్పఁబడియె నని భావింతురు. దర్శనమొసంగుటయె యనుగ్రహముగాఁ లెక్కింతురు. కంటఁ జూచుటయె యుపకారపత్రంబున స్థాపింతురు. సంభాషణంబును సివిలో గణింతురు. ఆజ్ఞ నొసంగుటయు వర మొసంగుటఁ గాఁ దలంతు

వలె నష్టమును సహింపరు. శత్రులవలెఁ బాణంబునఁ దైక్ష్ణ్య వృద్ధినొంది పరప్రేరితులై నశింపఁ జేయుచుందురు. దండవిక్షేపంబులచే దూరస్థితంబు లగుఫలంబులంబలె మహాకులంబుల నాశ మొందింతురు. అకాలకుసుమంబులవలె మనోహరాకృతులయ్యు లోకవినాశంబునకు హేతువు లగుదురు. శ్మశానాగ్నులవలె నతిభయంకరం బగుభూతిగలవారును, తిమిరరోగగ్రస్తులవలె దూరదృష్టి లేనివారును, మార్వాద్యుపసర్గంబు నొందినవారిచందమున క్షుద్రాధిష్ఠితభవనులై వినంబడుచున్నను ప్రేతపటహంబులవలె భయము గలిగింతురు. చింతింపఁబడియు మహాపాతకంబులవలె నుపద్రవంబు నాపాదింతురు. అనుదినంబును బాపముచే నిండింపఁబడినవారివలె బుసంగొట్టుచుందురు. అట్టియవస్థలో నున్నవారలు వ్యసనశతంబులకు గుఱియై వల్మీకతృణాగ్రంబున నున్నజలబిందువుంబోలెఁ బతితుండై నను దన్నుఁ దెలిసికొనం జాలరు.

మఱికొందఱు జూదము వినోద మనియుఁ, బరదారాభిగమనము వైదగ్ధ్య మనియు, వేఁట పరిశ్రమం బనియు, స్వదారపరిత్యాగము వ్యసనరాహిత్యం బనియు, గురువచనము సరకుగొనమి స్వాతంత్ర్య మనియు, భృత్యులజయింపమి సుఖోపసేవ్యత్వ మనియు, నృత్యగీతాదులయందును, వేశ్యలయందును నాసక్తి గలిగియుంట రసికత యనియు, గొప్పతప్పుల వినకుండుట మహానుభావత్వ మనియు,

లోకనింద సహించుటయె తాలిమి యనియు, తనకుఁ దో చునట్లు నడచుటయె ప్రభుత్వ మనియు, దేవావమాన మొనర్చుటయె మహాసత్వత యనియు, వందిజనులపొగడ్త యె కీర్తియనియు, చాంచల్యమె యుత్సాహ మనియు, మంచి చెడుగులెఱిఁగ కుండుటయె నిష్పక్షపాత మని యు, దోషములయందు గుణత్వము నారోపించుచు, లోలోన నగుచు, దుర్వ్యధ లాచరించుచు, స్వార్థపరులును, ధనపిశితంబు గ్రసింపఁగ్రద్దలును, 'అస్థానంబు పేరి కమలినికి ధూర్తబకంబులును, నగుధూర్తులు అమానుషోచితంబు లగు స్తుతులచేఁ దమ్ము వంచించుచుండ వి త్తమదంబుచే మత్తుగొనినచి త్తంబున నిశ్చేతను లగుటం జేసి యట్టులే యని తమయందు వృథాభిమానంబు నారోపించుకొని మర్త్యధర్ము లయ్యును దివ్యాంశంబున నవతరించినవారివలెఁ దమ్ము నమానుషులనుగా నూహించుచు సర్వజనంబునకును నుపహాస్యత నొందుచుందురు. భృత్యులు సేయుఁదమపరిహాసమును విని సంతసింతురు. తమయందు మనంబున దేవతాభిమానంబు వహించి తక్కటియిరుసేతులును లోన నున్నవానిఁ గా నెంతురు. తమమూఁడవకన్ను చర్మంబుచేఁ గప్పఁబడియె నని భావింతురు. దర్శన మొసంగుటయె యనుగ్రహముగాఁ లెక్కింతురు. కంటఁ జూచుటయె యుపకారపక్షంబున స్థాపింతురు. సంభాషణంబును సిరిలో గణింతురు. ఆజ్ఞ నొసంగుటయు వర మొసంగుటఁ గాఁ దలంతు

రు. స్పర్శంబునె పావనముగా భావింతురు. మిథ్యామాహాత్మ్యంబునం బరిపూర్ణగర్వులగుచు దేవతలకుం బ్రణమిల్లరు. విప్రులం గౌరవింపరు. మాన్యుల మన్నింపరు. పూజ్యులం బూజింపరు. పెద్దల కభివాదనము సేయరు. గురువుల కభ్యుత్థానము సల్పరు. నిరర్థక మగునాయాసంబున విషయోపభోగంబు నెఱుంగ రైరని పండితులం బరిహాసింతురు. ముదిమి నగుబారవశ్యమునం బ్రలపింతు రని వృద్ధజనోపదేశంబు నాకర్ణింపరు. తమప్రజ్ఞకుం బరిభవంబని యెంచి సచివోపదేశంబు గ్రహింపరు. హితవాదినిం గోపింతురు. మఱియెవండేని సకలకృత్యంబుల విడిచి దోయిలింబట్టుకొని రేలుంబవళ్లు దేవతంబలె స్తుతిచేయునో, మాహాత్మ్యంబుం జాటునో, వానిని మెత్తురు. వానితో సంభాషింతురు. వానిం బ్రక్కనునిచికొందురు. వానిని వృద్ధిసేతురు. వానితో సుఖ ముందురు. వాని కొసంగుదురు. వానితో మైత్రిసేయుదురు. వానివచనము నాలింతురు. వానియందు గృప వర్షింతురు. వానిం బహుమానింతురు. వానిం బరమాప్తునిగా భావింతురు. నరపతుల కేమి యోగ్యత కలదు? వారలకు నతిక్రూరం బగునుపదేశంబు గలిగి నిర్దయం బైన కౌటిల్యశాస్త్రము ప్రమాణము. అభిచారక్రియలచేఁ గ్రూరప్రకృతు లగుపురోహితులు గురువులు. పరోచ్ఛేదకర్త లగుమంత్రు లుపదేశకులు. పెక్కురాజు లనుభవించివిడిచినలక్ష్మియం దాసక్తి. మారణరూ

పము లగు శాస్త్రములయందు నభిమానమ్ము, సహజప్రేమార్ద్ర హృదయు లగుతోఁబుట్టువుల్ను నిర్మూలము సేయందగినవారు. కుటిలము లగునిట్టికష్టచేష్టలచే దారుణ మగురాజ్యతంత్రము నందును, మహామోహాంధకారంబు గలయౌవనమునందును కుమార, నీ వెట్లుప్రవర్తించెదో, ఎట్లు జనులచే నుపహాసింపఁబడవో, గురువులచే ధిక్కరింపఁబడవో, సాధువులచే నిందింపఁబడవో, మిత్రులచే నుపాలంభింపఁబడవో, పండితులచే శోచింపఁబడవో, మఱి యెట్లువిటులచే మోసపుచ్చఁబడవో, కుశలులచేఁబ్రహసింపఁబడవో. సేవకులచే నవలోపింపఁబడవో, లక్ష్మిచేఁ బరిహాసింపఁబడవో, మదముచే నర్తింపఁబడవో, మదనునిచే నున్మత్తీకరింపఁబడవో, విషయములచే నాకర్షింపఁబడవో, అట్లు ప్రవర్తింపవలయు. ఈవు స్వభావంబునన ధీరుండవు. తండ్రిచే మహాప్రయత్నంబున సంస్కరింపఁబడితివి. ధనంబులు వివేకహీనుం డగుచపలచిత్తుని మత్తునిఁ గావించుఁగాని నినుబోఁటివానిం జేయఁజాలవు. అయినను నీగుణములయం దగుసంతోషము నన్నిట్లు పలికించెను. 'ఈలక్ష్మి విద్వాంసు నైన, సచేతను నైన, మహాత్ము నైన, నభిజాతు నైన, ధీరు నైనఁ, బ్రయత్నవంతు నైన నీచునిఁ గావించును, అని నీకుఁ బలుమఱుఁ జెప్పుచున్నాఁడను. ఈవు తండ్రియాచరించునవయౌవ రాజ్యాభిషేకమంగళము ననుభవింతువుగాక. కులక్రమాగత మై పూర్వపురుషులచే వహిం

పఁబడినభూభారంబు వహింపుము. వైరిశిరంబుల నమ్రీకరింపుము. బంధువర్గము నుద్ధరింపుము. అభిషేకోత్సవానంతరమున దిగ్విజయమున కారంభించి చరించుచు నీతండ్రిచే జయింపఁబడినను సప్తద్వీపసముద్రభూషణ యగువసుంధరను మగుడ జయింపుము. ప్రతాపంబును గానిపింప నీ కిది యుక్తకాలము. అని వాక్రుచ్చి యుపరమించెను. ఇట్లు శుకనాసుం డుపదేశింపఁ జంద్రాపీడుం డావచనంబులచేఁ గడుగఁబడియెనో, స్వచ్ఛీకృతుఁడాయెనో, అభిషిక్తుఁడాయెనో, అలంకృతుఁడాయెనో యన ముహూర్తమాత్రం బుండి నిజభవనంబునకుం జనియెను.

చంద్రాపీడుని యౌవరాజ్యపట్టాభిషేకము.

అంతఁ గొన్నిదినంబులు కడచనఁ దారాపీడుండు తాన మంగళకలశంబు బట్టికొని శుకనాసుం గూడి పుణ్యదినంబునఁ బురోహితుండు మంగళకృత్యముల నెఱవేర్ప ననేకనరపతిసహస్రమధ్యంబున సకలతీర్థంబులనుండియు, సకలనదులనుండియు, షకలసముద్రములనుండియుఁ దోని రాఁబడి సర్వౌషధులతోఁ, సర్వఫలంబులతో, సర్వమృత్తికలతో, సర్వరత్నంబులతోఁ గూడి యానందబాష్పమిశ్రితంబును, మంత్రపూతంబు నగుజలంబుచేఁ జంద్రాపీడు నభిషేకించెను. అభిషేకసలిలార్ద్రదేహుం డగునతనియందు రాజలక్ష్మి ప్రవేశించెను. అనంతర మఖిలాంతఃపురయువతులం గూడి విలాసవతి సురభి

చందనం బలఁది మాలతీకుసుమమాలిక సిగఁజుట్టెను. అప్పుడు తారాపీడుండు వేత్రదండధరులఁ గైకొని జనంబుల జడియుచుండఁ జంద్రాపీడుండు సభామండపమునఁ గరుదెంచి చంద్రుండు మేరుశృంగము నధిష్ఠించునట్లు సింహాసనంబు నధిష్ఠించెను. అట్లు చంద్రాపీడుండు సింహాసనారూఢుండై తనునట్లు రాజలోకంబును సన్మానింపఁ బడంపడి దిగ్విజయప్రయాణంబు సూచించుచు మందరఘాతంబులచే నుదధిచందంబునను, తటిద్దండపాతంబులచే నుత్పాతజలధరంబువిధంబునను, మహావరాహ ఘోణాభిఘాతంబులచేఁ బాతాళకుక్షిమాడ్కిని కనకకోణంబులచేఁ గొట్టఁబడి ప్రస్థానదుందుభి మ్రోసెను. ఆదుందుభి ధ్వనించుచుండఁ బూరితంబులో, గర్భీకృతంబులో, ప్రదక్షిణీకృతంబులో, బధిరీకృతంబులో, యనఁ దనరు సకలదిశల సంధిబంధంబులు సడలెను. ఆదుందుభిరవంబు విని జయజయ యని యెల్లరుం బలుకుచుండఁ జంద్రాపీడుండు వైరులసిరితోడ సింహాసనంబువలనుండి లేచి నరపతిసహస్రంబు వెంబడింప నాస్థానమండపంబు వెలువడి ప్రయాణంబునకుం దగునట్లలంకరింపఁబడి ముందుగఁ బత్రలేఖచే నధిష్ఠింపఁబడినపిడియేనిక నధిష్ఠించి దశవదనబాహుదండాన్స్థిత కైలాసంబు ననుకరించుచు, ముక్తాఫలాలంకృతంబై శతశలాకంబైన యాతపత్రం బాతపంబు వారించుచుండఁగను, ఇంద్రాయుధంబు ముందుగఁ జనుచుండఁగను, మెల్లమెల్లం దొలుతఁ దూర్పు

దెస కభిముఖుం డయి వెడలెను. అప్పుడు గజఘటలు నడుచు చుండుటం గదలినధవళాతపత్రవనంబు గలిగి యనేక కల్లోల పరంపరలయందుఁ జంద్రప్రతిబింబసహస్రంబు దోఁప మహీతలం బెల్ల ముంచిన మహాప్రళయజలధిజలంబో యన సకల బలంబును గదలెను. అంత వైశంపాయనుండు ప్రస్థానమంగళవేషంబు దాల్చి మహాబలసమూహంబుతోఁ గరిణి నెక్కి రెండవయువరాజో యన సమీపించి సూర్యునకుఁ జంద్రుని వలెఁ జంద్రాపీడునకు సమీపస్థుం డాయెను. అనంతరము యువరా జిట పోయె నిటపోయె నని పరుగిడుబలంబులభారంబునఁ బుడమి వడంకెను. క్షణమాత్రంబున మహీతలంబు తురంగమయంబో, కుంజరమయంబో యనఁగను, దిగ్వలయం బాతపత్రమయంబో యనఁగను, ప్రజాసృష్టి భూపాలమయంబో యనఁగను, దృష్టి యాభరణాంశుమయంబో యనఁగను, అంతరిక్షంబు ధ్వజవనమయంబో యనఁగను, ఆతపము కిరీటమయంబో యనఁగను, త్రిభువనము జయశబ్దమయంబో యనఁగను నొప్పెను. ఏయెడఁ జూచినను పర్వతాకారంబులయి నడుచుమత్తగజంబులచేతను, ఉత్పాత చంద్రమండలంబులంబోలు నాతపత్రంబులచేతను, సంవర్తజలధరారావభీషణం బగుదుందుభిధ్వానంబుచేతను, నిర్ఘాతపాతపరుషఘోషంబు లగుకరికంఠగర్జితంబులచేతను, భువనాంతరవ్యాపి యగుకలకలంబుచేతను నత్తఱి మహాప్రళ

యంబో యనఁ దోఁచెను. అప్పుడు బలంబులకోలాహాలంబు చేతను, కాహళలనినాదంబుచేతను, వారువంబుల హేషారవంబుచేతను, ప్రయాణపటహంబులరావంబులచేతను, డిండిమంబులనిస్స్వనంబుచేతను జర్ఘరంబైన శ్రవణపుటంబులు గలజనంబునకు మూర్ఛవచ్చినటు లుండెను. అత్తఱిఁ బాతాళంబునందుండి లేచెనో, పాదంబులనుండి వెడలెనో, దెసల నుండి యేతెంచెనో, రవికిరణంబులవలనఁ బొడమెనో యన నొప్పి సూర్యుని సరకుఁ గొననియంధకారంబన భాసిల్లుమహీరజంబు ముల్లోకంబుల వ్యాపించెను. రజోధూసరితంబై రవిబింబంబు నిష్ప్రభం బాయెను.

వైశంపాయనుండు చంద్రాపీడునితో ముచ్చటించుట.

అప్పుడు వైశంపాయనుం డపరిమితంబైనబలంబుం గాంచి విస్మయంబు నొంది రాజనందనునితో నిట్లనియె:—

'యువరాజ' నీవు జయింప మహారాజాధిరాజగుతారాపీడుండు జయింపని దేమి కలదు? నీవు వశము సేసికొన మహారాజుచే వశీకరింపఁబడని దేదెసలు గలవు? నీవు సాధింపఁ దారాపీడుండు సాధింపనిదుర్గంబు లేమి కలవు? నీవు స్వాధీనము చేసికొన స్వాధీనంబులుగాని యేద్వీపాంతరంబులు గలవు? నీ వార్జింప నార్జింపఁబడని యేరత్నాకరంబులు గలవు? నమ్రులు కానిరాజు లెవరు కలరు? సేవాంజలి బట్టనివా రెవరు? చామరంబులు వీచనివా రెవరు? జయశబ్దంబు పలు

కనివా రెవరు ? పృథివియందుఁ గలభరతభగీరథప్రతిము లగు మూర్ధాభిషిక్తు లెల్లరును దమచూడామణిపల్లవంబులచే నీపాదరజంబును రక్షాభూతినింబలె ధరించుచున్నారు. నీబలంబులును దెసలనెల్లఁ గప్పియున్నవి. ఇప్పుడు పుడమి బలభరాక్రాంతం బయి మహాభారతసమరసంక్షోభంబుఁ దలంచునని యెంచెద. ఇయ్యెడ ధరిత్రి బలభరంబుచే సకలశైలసంధిబంధంబులును సడలి వేలకొలఁది తునుకలు గాకుంట గడు చిత్రము, అని పలుకుచుండ నయ్యువరాజు పటమండపసహస్రంబులచే భాసురం బగునావాసదేశంబు ప్రవేశించెను. అట నాదినంబు గడపి మఱునాఁడు లేచి సేనాసముదాయంబుతోఁ దరలి యున్నతుల వంచుచు, భీతుల నూఱడించుచు, శరణాగతుల రక్షించుచు, శత్రువుల నిర్మూలము చేయుచు, స్థానస్థానంబులను రాజపుత్రుల నభిషేకించుచు, రత్నంబుల నార్జించుచు, కానికలం గొనుచు, దేశవ్యవస్థల నాదేశించుచు, నిజచిహ్నంబుల స్థాపించుచు, శాసనంబుల లిఖించుచు, విప్రులఁ బూజించుచు, మునుల నమస్కరించుచు, ఆశ్రమములఁ బాలించుచు, జనానురాగంబు గలిగించుచు, విక్రమమును వెలిగించుచు, ప్రతాపమును స్థాపించుచు, కీర్తిని విస్తరించుచు, గుణములఁ బ్రఖ్యాపించుచుఁ బుడమిం జరించెను. తొలుతఁ దూర్పును, పదంపడి దక్షిణమును, నంతటఁ బశ్చిమమును, నవల నుత్తరంబును జయించెను. ఇట్లు మూఁడు

వత్సరంబులలో ద్వీపాంతరంబుల నెల్ల వశపఱచుకొని భూవలయ మెల్లం బరిభ్రమించెను. అంత నొకప్పుడు కైలాసమునకు సమీపంబున నున్న హేమజకూటంబనుకిరాతులకు నావాసంబగు హేమజకూటంబనుపురమును జయించి తనబలంబుల విశ్రాంతికై యచటం గొంతకాలము వసించెను.

చంద్రాపీడుండు కిన్నరమిథునంబు గ్రహింపం బూనుట.

అందుండి యొకప్పు డింద్రాయుధంబు నెక్కి యొక్కడ వేటకుం జని యచట శైలశిఖరంబుననుండి దిగినకిన్నరమిథునంబుం గాంచి యచ్చెరువుపడి గ్రహింపంబూని తురగంబును బ్రేరేప నాకిన్నరమిథునంబును భయంబునం బఱువసాగెను. అప్పుడు మహీమలతోం బోడుచుటంజేసి యింద్రాయుధం బతివేగంబునం జనుచుండ నిదో పట్టితి నిదో పట్టితి నని యెంచుచు ముహూర్తమాత్రంబునం బంచదశయోజనంబులదూరం బతిక్రమించెను. ఇట్లు వెన్నంటిపోవుచుండ నక్కిన్నరమిథునంబు ఎదు శైనపర్వతశిఖరంబు నధిష్ఠించెను. అంతం జంద్రాపీడుండు కిన్నరమిథునంబువలన దృష్టిమరలించి గుఱ్ఱంబు నాపి శ్రమంబునం జెమ్మటం గార్చుచున్న నింద్రాయుధంబుం గాంచి క్షణమాత్రము విచారించి తన్నుం దాన నవ్వుకొని యిట్లు తలంచెను. ఏ నేల బాలునివలె శరీరము నాయాసపఱచితి? ఈకిన్నరమిథునంబుం గ్రహించిననేమి? గ్రహింపకున్న నేమి? దీన నాకేమి ప్రయోజనము? ఏమి నాకార్యము? ఆరంభించినరాజ

ధర్మ మా తుది ముట్ట దాయె. మొదలిడినవిజిగీషువ్యాపార మో, సిద్ధింప దయ్యె. నాకృత్యము నాకె నగవును గలిగించెడిని. నా సైన్యంబెంతద వ్వాయె నో యెఱుంగ. మహా జవం బగునింద్రాయుధంబు నిమిషమాత్రంబున నతిదూరంబు నాక్రమించును. మరలిపోవ నైన వచ్చునపుడు కిన్నరమిధునంబునదృష్టి నిగిడించినవాఁడ నగుటంజేసి మహావనంబున మార్గంబు గుర్తింపఁ జాల. మార్గంబు నడుగనైన నిందు మనుష్యమాత్రుండు కానరాఁడు, ఏనుఁ దొల్లి 'సువర్ణపురంబున కుత్తరంబునఁ బుడమికి సీమాంతలేఖ కలదు. దాని కవ్వల నిర్మానుషం బగునరణ్యంబును, దాని నాక్రమించి కైలాసగిరియుఁ గలదు.', అని వినియుంటిని. ఇదియె కైలాసము కాఁబోలు, కాన యిపుడు నే నొంటిమెయి మరలి కేవలము దక్షిణదిశ నె కాంచుచుఁ బోవలయు. తనచేసినదోషంబులఫలంబు తాన యనుభవింపవలయుంగదా? అని నిశ్చయించి తురగంబును మరల్చి మగుడ నిట్లని చింతించెను.

చంద్రాపీఢుం డచ్ఛోదం బనుకొలనిం గాంచుట.

ఇప్పుడు భానుండు దివసలక్ష్మీ రశనామణిచందంబున గగనమధ్యంబు నధిష్ఠించి యున్నవాఁడు. ఇంద్రాయుధంబు పరిశ్రాంతి నొందెను. కాన వారుపంబురు నీరుద్రావించి యేనును జలంబు గ్రోలి యొక్కచెట్టునీడ ముహూర్తమాత్రంబు విశ్రమించి పోయెదనని యాలోచించి జలము వెదకఁ దలంచి

యిటునటు దృష్టి నునిచి తిరుగుచుఁ దడిసినమార్గంబును గాంచి కొంతద వ్వరిగి యీశావదిగ్భాగంబున జలభారంబున నలసిన జలధరపటలం బో, పుంజీభూతం బగుబహుళపక్షనిశాంధకారంబో యనఁ దనరుతరుజాలంబుఁ గాంచెను. అంత భూకాంతుండు కలహంసలకోలాహలంబులచేఁ బిలువంబడువానివలెను బ్రవేశించి యాచెట్లనడుమఁ ద్రైలోక్యలక్ష్మీమణిదర్పణంబో, వసుంధరాదేవి స్ఫటికభూమిగృహంబో, రసత్వమునొందినచంద్రాతంబో యనఁ దనరి, యతిమనోహరంబయి, దృష్టి కాహ్లాదజనకం బయినయచ్ఛోదం బనుకొలనిం గాంచెను. దానిం గనినంతనె సకలశ్రమంబును విడిచి చంద్రాపీడుండు మనంబున నిట్లు చింతించెను. చిత్రము. కిన్నరమిథునంబు వెంబడించి నావచ్చుట విఫలం బైన నిద్దానిం గాంచుటచే సాఫల్యంబు నొందెను, ఇప్పుడు చూడవలసినదాని జూచుటచేఁ గన్నుఁగవ సఫలం బాయె. ఇయ్యది విమలంబగుటఁ గన్నుఁగవకు బ్రీతిం గలిగించెడి. చల్లని దగుట స్పర్శసుఖంబు నొసంగెడి. కమలసుగంధి యగుట నాసికకుఁ దనియించెడి. హంసముఖరం బగుట శ్రుతిసుఖంబు నొడఁగూర్చెడి. మధురం బగుట జిహ్వేంద్రియంబు నానందింపఁ జేసెడి. ఇట్టియ్యది యమృతంబువలె సకలేంద్రియంబుల నాహ్లాదింపఁజాలును. అని విచారించుచునె దక్షిణతీరంబునకు విచ్చేసి తురంగమంబుదిగి గుఱ్ఱంబును నీరు ద్రావించి తానును జలము గ్రోలి యొకచెట్టునీడ

విశ్రమించెను. ఇట్లు ముహూర్తమాత్రంబున సేదఁ దీర్చికొని సరసియుత్తరతీరంబుననుండి యమానుషం బగుగీతరవంబు నాకర్ణించి 'మనుష్యసంచారంబు లేనియిచ్చోట గీతశబ్దం బెట్లు కలిగె, నని వితర్కించి యాదెసను దృష్టి నిగిడించి యేమియు, గానక గీతశబ్దము వినంబడుచుండుటం జేసి దానికిఁ గతంబు గనుంగొనుకుతూహలంబున నింద్రాయుధంబు నెక్కి కొలని పడమటిగట్టున వెడలి చంద్రప్రభ మనుకొలనికిఁ బశ్చిమతీరంబున విరూపాక్షసిద్ధాయతనంబుఁ గాంచెను. అందు మందాకినీపుండరీకంబులచే నర్చితుండును, మౌక్తికలింగాకృతియు, చతుర్ముఖుండును, భగవంతుండు నగుత్ర్యంబకుని దర్శించెను. ఆప్పురహరునెదుట నిర్మలయు, నిరహంకారయు, పరిగృహీతపాశుపతవ్రతయునై దక్షిణకరంబున వీణియ మీటుచు, ప్రత్యక్షమైనగంధర్వవిద్యయో యనగీతిచే విరూపాక్షదేవు నారాధించు కన్యక నొక్కతం గనియెను.

### చంద్రాపీడుండు మహాశ్వేత నవలోకించుట.

అంత రాజనందనుండు తురగంబు దిగి యయ్యశ్వంబు నొక్కచెట్టునకుం గట్టి యచ్చోటఁ జేరి భక్తిచే భగవంతుఁ డగునుమాకాంతునకుఁ బ్రణమిల్లి యాదివ్యకన్యకను కనుఱెప్ప వ్రేయక గనుచు దానికాంతికి, శాంతికి ని నచ్చెరు వొంది తనమదిలో నిట్లు చింతించెను. 'ఎంత చిత్రము. లోకంబునఁ బ్రాణులకుఁ దలంపనివృత్తాంతములు ప్రాప్తించుచుండును.

వేఁటకై వెడలి నిరర్థంబుగఁ గిన్నరమిథునంబు వెంబడించి వచ్చి మానవుల కగమ్యంబగు నిప్పరదేశంబు గాంచితి. అందు జలము వెదకుచు దివ్యంబగు కొలనిం దర్శించితి. అట విశ్రమించి యమానుషంబగు గీతధ్వని నాకర్ణించితి. ఇద్దాని జాడఁ జూడ నరుదెంచి మనుజులకుఁ గానరాని దివ్యకన్యకం గాంచితి. ఈయాకృతిం జూడ దివ్యకన్యకయంటకు సందియంబు లేదు. అట్లుగాన యియ్యది తిరోధానంబు నొందదేని, కైలాసశిఖరంబు నధిష్ఠింపదేని, గగనతలంబున కెగయదేని నంత నీవెవ్వతవు? నీపేరేమి? ప్రథమవయస్సున వ్రతం బేలపూనితి?, వని యడిగెదను., అని నిశ్చయించి యాస్ఫటికమణి మండపంబున నొక్క స్తంభంబు నూని కూర్చుండి గీతావసానంబుఁ బ్రతీక్షించుచుండెను.

అంతఁ గీతాంతంబున నక్కన్యక పరమేశ్వరునకుఁ బ్రణమిల్లి చంద్రాపీడునిఁ గాంచి 'అతిథికి స్వాగతమె? మహాభాగుం డిభూమి కెట్లు వచ్చెను.? నాతో నరుదెంచి యతిథిసత్కారంబు గ్రహింతువుగాత, మనుటయు సంభాషణమాత్రంబుననె యనుగ్రహింపఁబడితి' నని యెంచి చంద్రాపీడుండు భక్తిచే నమస్కరించి 'దేవి చిత్తము., అని పల్కి వినయంబు గనఁబఱుచుచు నాయమ పోవుచుండఁ దాను శిష్యునివలె వెంబడి చనుచుఁ దనమనంబున నిట్లు తలంచెను. 'ఈయమ నన్నుఁ గాంచి తిరోధానంబు నొందదయ్యె. కావున నామనంబు ప్ర

శ్నముల నడుగ వేడుకపడియెడిని., అని యెంచుచు నూ
రడుగులు చని యొకగుహం గాంచెను. అంత నక్కన్యక యు
ర్ఘ్యంబు నొసంగిన చంద్రాపీడుండు 'భగవతి, సర్వపాపప్రశ
మనం బగునీయాలోకనంబ పవిత్రీకరింపఁజాలును. అత్యా
దరంబు వలదు., అని పలికి యాయమ నిరోధింప సకలం బగు
నతిధిసత్కారంబును గ్రహించెను. ఆతిథ్యంబు నొసఁగి యా
యన్నువ యింకొకశిలాతలంబునఁ గూర్చుండి క్షణమాత్రం
బూరకుండి క్రమంబున నడుఁగఁ జంద్రాపీడుండు దిగ్విజయం
బు మొదలుకొని కిన్నరమిధునంబు వెంబడి వచ్చునందాఁకఁ
దనరాకనంతయు నక్కాంత కెఱిఁగించెను.

చంద్రాపీడుండు మహాశ్వేతను నీవృత్తాంబు చెప్పు మని యడుగుట.

అనంతర మారాజనందనుండు వినయంబున నిట్లనియె:-
'భగవతి, నీయనుగ్రహప్రాప్తిచేఁ బ్రోత్సాహితం బగుకుతూ
హలంబున నాకులితంబై మానవజాతిసులభం బైనలాఘవం
బు నే నంగీకరింపకున్నను నన్నుఁ బ్రశ్నకృత్యంబున నియో
గించెడిని. ప్రభుప్రసాదలవంబు భీరువునకుఁ బ్రాగల్భ్యమును గలి
గించును; ఒక్కచో నుండినకాలకల స్వల్పమైనను పరిచ
యంబు గలిగించును. ఇయ్యది నీకు శ్రమకరంబు కాదేని నది
వచించి నన్ననుగ్రహింప వేడెద. నిన్ను దర్శించినది మొద
లీవిషయంబున నా కెక్కుడు కౌతుకంబు గలదు. దేవతలు,
ఋషులు, గంధర్వులు, అప్సరలు లోనగువారిలో నెవ్వరికులం

బును భగవతి జన్మముచే ననుగ్రహించెనో? కుసుమసుకుమా
రం బగునీ శరీరాయమున నేల్లాకో వ్రతంబు పూనుట? ఈప్రా
య మెక్కడ? ఈతప మెక్కడ? ఈయాకృతి యెక్కడ? ఈ
యుపశాంతి యెక్కడ? ఇదిచ్చూడ నా కద్భుతము గాఁ దోఁ
చెడిని? ఏల సురలోకసుభగంబు లైనదివ్యాశ్రమంబుల విడిచి
యొంటిమెయి సమానుష్యం బగునియ్యడవి నున్నదానవు? ఇట్టి
వార్త యింతకు మున్ను గని విని యు నెఱుంగము. కాన
సకలంబుఁ జెప్పి మాకౌతుకంబు దీర్తువుగాక, యనియడుగ
నాయన్నన యేమి యో లోనఁ దలంచి ముహూర్తమాత్రం
బూరకుండి నిట్టూర్పు విడిచి కన్నీరు గార్చుచు నిశ్శబ్దంబుగ
నేడ్వఁ దొడంగెను. అంత నాచంద్రాపీడుం డిట్లు తలంచెను.
చిత్రము. వ్యసనోపనిపాతంబులు దుర్నివారంబులు. అవియి
ట్టితేజోవతిం గూడ స్వవశంబుచేసికొనియెఁ గదా? సంతా
పంబులు దేహిమాత్రుని విడువనేరవు. ఈయమకుఁ గన్నీరు
దొరంగుటచే నింకొకంతు గొప్పకౌతుకంబు నామనంబునఁ
గల్గెడిని. ఏలన, అల్పం బైనశోకకారణంబుచే నిట్టివారు నెవ్వ
గ నొందనేరరు. క్షుద్రనీర్ఘాతపాతంబుచేఁ బుడమి వడంకునే?
అని యెంచి కౌతుకం బిమ్మడి యగుడు నాయమకు గలిగినశో
కస్మరణంబునకు నిమిత్తభూతుం డైనతన్ను నపరాధిని గాఁ
దలంచుచు లేచి ముఖప్రక్షాళనంబుకయి శిలయేరినుండి దోయి
టం జలంబు గొనివచ్చెను. అంత నాయన్నువయు రాజపు

త్రునిరోధంబునఁ గన్నులు కడిగికొని, నారచీరకొంగున మోముదమ్మిం దుడిచికొని బెట్టునిట్టూర్పు పుచ్చి మెల్లఁగ నిట్లనియె:—

మహాశ్వేత చంద్రాపీడునకుఁ దనవృత్తాంతంబు చెప్పుట.

“రాజనందనా, కఠినచిత్తయు, మందభాగ్యయు నైనయీపాపురాలియీజన్మవృత్తాంతంబు విన నేల? నీకిందుఁ గుతూహలము గలదేనిఁ జెప్పెద నాలింపుము. కల్యాణోదర్కుండ వగునీవు స్వర్గంబున నప్సరసలు కల రని వినియె యుందువు. వారిలోఁ బదునాలుగు కులంబులు గలవు. అందొక్కటి పద్మగర్భుమనంబునఁ గలిగెను. ఇంకొకండు వేదంబులవలనఁ బొడమెను. వేఱొకటి యగ్నివలనఁ బ్రభవించెను. మఱియొక్కటి వాయువువలనఁ జనించెను. ఇంకొక్కటి యమృతంబువలన నావిర్భవించెను. వేఱొకండు జలమువలన జనిమ గాంచెను. ఇంకొక్కటి సూర్యకిరణంబులవలనఁ బుట్టెను. మఱియొక్కటి చంద్రకిరణంబులవలన జన్మించెను. వేఱొక్కటి భూమివలన నుద్భవించెను. ఇంకొక్కటి మెఱుంగులవలన నుదయించెను. వేఱొకండు మృత్యువువలన జననమొందెను. మఱియొక్కండు మన్మథునివలన నుత్పత్తి గాంచెను. ఇంకొక్కటి దక్షకన్యయైన మునివలన జనించెను. వేఱొక్కటి దక్షకన్యయె యైన యరిష్టవలనఁ బుట్టెను. ఇన్నియుఁ గూడి పదునాలుగుకులంబు లాయె. గంధర్వులలో

దక్షకన్యాద్వయంబునఁ గలిగిన రెండుకులంబులె యుండెను. అందు మునికొమరు లగుచిత్రసేనాదులు పదునేవురకుఁ బదునాఱవవాఁడు చిత్రరథుం డని గుణాధికుండు కలఁడు. ఆతం డతిలోకపరాక్రముం డగుట నాఖండలునకు మిత్రుం డయి బాల్యంబుననె గంధర్వుల కెల్లరకు నాధిపత్యంబు గాంచెను. ఈభారతవర్షంబున కుత్తరంబున నున్నకింపురుషవర్షంబున వర్షపర్వతం బగుహేమకూటం బాతనికి నివాసం బగు. అందు నాతనిచేఁ బాలింపఁబడుచు వేనవేలు గంధర్వులు వసింతురు. ఆచిత్రరథుండె యిచ్చట చైత్రరథం బనువనంబు నిర్మించి యిందు నచ్ఛోదం బనుగొప్పకొలనిం ద్రవ్వించి భగవంతుఁ డైనయిందుమౌళి నిందుఁ బ్రతిష్ఠితుం జేసెను. మఱియు నరిష్టపుత్త్రు లగుతుంబురుప్రభృతు లార్వురలో జ్యేష్ఠుం డగుహంసుండు చిత్రరథునిచే రెండవగంధర్వకులంబునాధిపత్యంబున నభిషిక్తుం డయి బాల్యంబుననె రాజ్యపదంబుఁ బొంది యుండెను. అతండును నపరిమితం బగుగంధర్వబలంబుం గూడి హేమకూటంబుననె యున్నవాఁడు. చంద్రకిరణంబులవలన జనించిన యప్సరఃకులంబునఁ బొడమినయతిలావణ్యవతి యైనగౌరి యనుసుకుమారిని రెండవగంధర్వకులంబున కధిపతి యైనహంసుండు పరిణయం బాయెను. ఆహంసగామిని రతీదేవి మదనునితోడంబలె హంసునితోడం గూడి మోదంబు నొందుచు నాతని సకలాంతఃపురంబులకును స్వా

మిని యయి యుండెను. అట్టి మహాత్ముల కిరువురకును నిట్టియ లక్షణురాలను, దుఃఖసహస్రంబులకుఁ బాత్రురాల నైనయే నొక ర్తుకం గూఁతుర నై శోకంబునకె పుట్టితి. నాజనకుం డపుత్రకుం డగుటం జేసి పుత్త్రీజన్మంబుకంటె నతిశయితం బైనమహోత్సవంబుచే నాజన్మం బభినందించి దశమదివసంబున నాకు మహాశ్వేత యని పేరిడియెను. ఏనును పితృభవనంబున బాలనగుటఁ గలమధురంబుగ భాషించుచు వీణియవలె నొకరియంకంబుననుండి యింకొకరియంకంబు నొందుచు శోకాయాసంబు లెఱుంగనిశైశవంబు గడపితి. అంత మదంబుచే మధుకరంబువలెను, మధుకరంబుచేఁ గుసుమంబువలెను, కుసుమంబుచే నవపల్లవంబువలెను, నవపల్లవంబుచే మధుమాసంబువలెను, మధుమాసంబుచే వసంతునివలెను, యౌవనంబుచే నాశరీరంబు సొబ గొందెను.

మహాశ్వేత పుండరీకుఁ గాంచుట.

అనంతరము సకలజీవలోకహృదయానందకంబు లగు మధుమాసదివసంబులయం దొకనాఁడు తల్లితోఁ గూడి మధుమాసవిస్తారితశోభం బగునచ్ఛోదంబున స్నానము చేయ వచ్చి అట 'ఆహా' కుసుమాపహారరమ్యం బగునీలతామండపం బెంత మనోహరం బయి చూపట్టెడిని! సఖీ, పుష్పితమైనయీచూతలత మనోజ్ఞతం గంటివా? సుందరీ, సుందరంబైనయీచందనవీధి చల్ల నై యుల్లంబున నాసందంబు వెల్లి

నొలుపుచున్నది కదా? అని నెచ్చెలులతో విహరించుచుంటిని. అంత నొక్కచో నన్యకుసుమపరిమళంబు నిరసించి యతిసురభి యగుటం జేసి ఘ్రాణేంద్రియంబుం దనియించెడి నో యన వెడలు ననాఘ్రాతపూర్వం బగుకుసుమగంధంబు నాఘ్రాణించి, ఇది యెందుండి వచ్చె నని కుతూహలంబునం గొన్నియడుగులు నడిచి యచట విహూపాత్ము వశపఱుచుకొన నెంచి నియమంబు పూనినకాముం డో, బ్రహ్మచర్యంబునలంకార మో, ధర్మంబుయొక్క నవనం బో, సకలవిద్యలస్వయంవరపతి యో యన నం దనరి సమానవయస్కుం డగునింకొకమునికుమారకుని తోం గూడి స్నానార్థమై యరుదెంచినయతిమనోహరుం డగు మునికుమారకుం గాంచితి. ఆతనిచెవిలోన వనలక్ష్మిస్మితప్రభ యో, కుసుమలక్ష్మియొక్కావనలక్ష్మి యో యన నదృష్టపూర్వ మగుకుసుమమంజరిం గాంచి 'యిద్దానిపరిమళం బన్యకుసుమపరిమళంబులం దిరస్కరించె, నని మనంబున నెంచి యక్కుమారుజక్కందనమునకుం జొక్కి యవలోకించుచుండ గుణదోషవిచారశూన్యుండును, హృస్మైకపక్షపాతియు నగుకుసుమాయుధుండు నన్నుం బరవశం గావించెను. అంత నిట్టూర్పులతోడ నిమేషంబులను మఱచి సస్పృహంబుగ యాచించుదానివలెను, నీయధీనురాల నైతి నని వచించుదానివలెను, అభిముఖ మగుహృదయము నొసంగుదానివలెను, మనోభవాభిభూత నగు నన్నుం గావు మని శరణుసొచ్చుదానివలెను గాంచుచు 'ఏ

మీ యీయకృత్యము? ఇయ్యది కులకన్యలకుఁ దగదు, అని తెలిసియు మనంబు నిల్ప నశక్తనై తత్కాలంబున నావిర్భవించి యిట్టి దని చెప్ప రాక స్వసంవేద్యం బైన యవష్టంభంబుచే స్తంభింపఁబడినదానివలెను, చిత్రమున లిఖింపఁబడిన దానివలెను, మూర్ఛనొందినదానివలెను, నిశ్చేష్టితురాల నైతి. ఏ నుపదేశింపఁబడుట యతనిరూపసంపదచేత నా? మనంబుచేత నా? మనసిజునిచేత నా? నవయౌవనంబుచేత నా? అనురాగంబుచేత నా? ఎఱుంగ. ఇది యెల్లి ట్లని యక్కుమారకుఁ గాంచుచుంటిని. అప్పు డతనియొద్ద కింద్రియములచే లేవనెత్తుకొనిపోవంబడుదానివలెను, హృదయముచే ముందున కీడ్వఁబడుదానివలెను, మదనునిచే వెనుక నెట్టఁబడుదానివలెను నయి యెట్లో శరీరంబు ధరించితి. అనంతరము స్వేదజలముచేఁ గడుగఁబడియెనో యన లజ్జ కరఁగిపోయెను. మారశరంబులకు భీతి గొనియెనో యన గాత్రంబు వడంకెను. అప్పుడు, నామనంబున నిట్లు చింతించితి. శాంతచిత్తుం డై, నిష్కాముం డై నయీజనునియందు నన్నుఁ బడనై చుసీమనసిజుం డెట్టి యుపద్రవంబు సేయ నారంభించెను. స్త్రీజనచిత్తంబును, నతిమూఢం బగును. ఏ లన, అనురాగవిషయయోగ్యత నైన విమర్శింపఁ జాలదు గదా! తపంబులకు నిక్క యగునీ తేజం బేడ? ప్రాకృతజనాభినందితంబు లగుకామసుఖంబు లేడ? ఇట్లు మదనునిచే బాధింపఁ బడునన్నుఁ గాంచి యాతఁ

డు మనంబున నియతంబుగ వసించుచున్న వాఁడు. ఇది యి
టులెఱింగియు నేను చిత్తక్షు నాఁపఁ జాలను. ఇది చిత్రము.
అట్లు గాన నెంతలో తెలివి తప్పకుండునో మఱియు నెంతలో
నితండు పరిస్ఫుటంబుగ నామదనదుశ్చేష్టితలాఘవంబు నూ
హింపకుండునో, అంతలో నే నిచ్చోటనుండి తొలంగుట శ్రే
యము. మఱియు నొకస్వ డనభిత మగునామదనవికారంబుఁ
గాంచి కోపించి యితండు శపించిన శపింపఁగలఁడు. మునిజన
ప్రకృతికిఁ గోపంబు మునిముఖ్యున నె యుండుంగదా! యని
నిశ్చయించి యటనుండి చన నెంచి యీజాతి యెల్లరకు వంద
నీయం బని శ్రేష్ఠ ప్రాల్పకు యతనిమోమున నె దృష్టి నిల్పి
యతనికి నమస్కారంబు చేసితి. అంత మనోభవుం డలంఘ్య
శాసనుం డగుటను, మధుమాసంబు మదజనకం బగుట
ను, ఆప్రదేశం బతిరమణీయం బగుటను, నవయౌవనం
బవినయబహుళం బగుటను, ఇంద్రియంబు లతిచంచలంబు
లగుటను, విషయాభిలాష దుర్నివారం బగుటను, మనో
వృత్తి చపలం బగుటను, ఏ నభాగ్య నగుటను, నాకుఁ
క్లేశంబు విహితం బగుటను, పవనుండు ప్రదీపంబు నం బలె
మారుం డమ్మునికుమారు నధీరుం జేసి నడఁకించెను. అప్పు
డమ్మునికుమారునకును నెదుఱుగ నేతెంచుమానిని నెదుర్కొ
నియె నో యన రోమాంచంబు ప్రాదుర్భవించెను. కంపంబు
గలుగుట వ్రతభంగంబునకు వెఱచె నన జేత నున్న జప

మాల చలించెను. అతిప్రకటం బగునీతనివికారంబు గాంచి మదనావేశం బిమ్మడింప నే వర్ణింపరాని యవస్థ నొంది మనంబున నిట్లు చింతించితి. 'అనేకలీలోపదేశోపాధ్యాయుం డగుమకరకేతుం డె విలాసంబుల నుపదేశించెడిని. అట్లు కాదేని నిక్కామతంత్రంబులయందు బుద్ధిం జొనుపనియీజను నకు ననభ్యస్తం బగుసరాగదృష్టి యెట్లు పొడమును? శృంగారరసంబు చిలుకునో, అమృతరసంబు గురియునో, యనం దనరు నిట్టి దృష్టి యెట్లు బొడమెడిని? అక్కరంబులతో నక్కఱ లేక కన్నుతోడ న యంతర్గతం బగునభిలాషను వక్కాణించుచున్నవాఁడు, ఇది యెట్లు కలిగెడిని, అనితలంచి సమీపించి యాతనిసహచరుం డగురెండవమునికుమారకునిఁ బ్రణామపూర్వకము గా నిట్లడిగితి. 'ఈయనపేరేమి? ఏతపోధనునికుమారుండు? ఈతండు చెవికొనం దాల్చినకుసుమమంజరి యేమిపేరిటిచెట్టునం గలిగినది? తొల్లి యాఘ్రాణించి యెఱుంగనిదీనిగంధంబు నామనంబునఁ గౌతుకంబు గలిగించుచున్నది. అని యడుగ నాతండు కొంచెము నగి యిట్లనియె:—. 'బాలా' దీన నేమి ప్రయోజనము? ఇందు నీకుఁ గౌతుకము కలదేని జెప్పెదవినుము. 'దేవలోకంబున శ్వేతకేతుం డనుమహాముని యున్నవాఁడు. అమ్మహానుభావుని రూపంబు సకలసురాసురసుందరులడెందంబులకు నానందజనకం బై నలకూబరు నతిశయించి యుండును. ఒక్కనాఁ డమ్ముని

దేవతార్చనకుసుమమ్ములఁ గోయ మందాకినీజలంబున దిగుట
యు నప్పు డాయనను కదళీవనంబున నెల్లపుడు. సన్నిహిత
యై వేయిఱేకులతమ్మిగద్దియ పైఁ గూర్చుండి యుండులక్ష్మీ
దేవి గాంచెను. అటుల గాంచుచు నానందబాష్పతరళం
బగులోచనయుగళంబుచే నాతనిరూపంబు నాస్వాదించున ద్దేవి
చిత్తము మదనాయత్తం బాయెను. దర్శనమాత్రంబుననె
సమాగమసుఖంబు నొందినయామెకుఁ దా నుండుపుండరీకం
బున నె కుమారుండు పొడమెను. అంత న ద్దేవి 'మునీంద్రా,
వీఁడు నీకొమరుండు గ్రహింపుము.', అని పలికి యబ్బాలకు
నా శ్వేతకేతున కొసఁగెను. తరువాత న మ్మునీంద్రుండు బాల
కునకుఁ దగుసకలకృత్యంబులు నెఱపి యతండు పుండరీకమ్ము
నఁ బొడమియుంటఁ బుండరీకుం డనిపేరు వెట్టి యుక్తకాలంబు
న బ్రహ్మచర్యంబు నొసంగి సకలవిద్యల నేర్పెను. ఆపుండరీకుం
డే యితండు. ఈతనిచెవికొన నున్నకుసుమం బేచెట్టు దన్న,
సురాసురులు క్షీరసాగరంబు ద్రచ్చినపుడు పారిజాతం బను
పాదపం బొకండు జనించె. ఆవృక్షరాజంబుకుసుమమంజరి.
దీని నితండు వ్రతవిరుద్ధంబుగ నెట్లు గ్రహించె నో. అదియు
వినుము. నేఁడు చతుర్దశి యని, కైలాసవాసి యగునంబికాప
తిని సేవింప సురలోకంబుననుండి నాతో నితండు నందనవనస
మీపంబునఁ బోవుచుండ నందనవనదేవత ప్రత్యక్షంబుగ వ
సంతలక్ష్మీకరంబు పట్టుకొని యీపారిజాతకుసుమమంజరిం

గైకొని వచ్చి యీతనికిఁ బ్రణమిల్లి యిట్లనియె:—‘భగవంతుఁడా, సకలభువనాభిరామంబగు నీరూపునకు నీయలంకారంబు సుసదృశంబు. కావున ననుగ్రహించి యిద్దానిం జెవిఁగొన నునిచికొమ్ము. పారిజాతంబు జన్మంబు సాఫల్యంబు నొందుఁగాత,’ మనుటయు నీతండు తనదురూపంబుస్తుతికి లజ్జించి యిద్దేవి నలక్ష్యంబు సేసి పోవుచుండెను. అంత నద్దేవి వెంబడి యేతెంచుచుండం గాంచి యేను ‘మిత్రమా, తప్పేమి? ఈయుమ ప్రేమంబున నొసంగినదీనిం గ్రహింపు,’ మని యితం డంగీకరింపకున్నను బలిమిమై నిద్దాని నీతనిచెవిఁగొన నునిచితి. ఇట్లీతం డెవ్వండో? ఎవ్వనిపుత్త్రుండో? ఈకుసుమమంజరి యీతని కెట్లు వచ్చెనో? ఇవి యంతయు నెఱింగించితి., అని యితం డిట్లు పలుకుచుండ నత్తపోధనకుమారుండు కొంచెము నవ్వి నాతో నిట్లనియె:—‘కుతూహలినీ, ప్రశ్నాయాసంబుతోఁ బని యేమి? ఇద్దానిపరిమళంబు నీకు రుచించునేని దీనిం గైకొమ్ము., అని తనచెవినుండి తీసి ప్రాస్థంబలె నా చెవియం దునిచెను. అతనికపోలస్పర్శంబున నాడెందము రెండవపారిజాతకుసుమంబో యన నవతంసస్థానంబున నుండెను.

పుండరీకుండు మహాశ్వేతను మోహించుట.

ఆమునికొమరుండును నాకపోలతలస్పర్శసుఖంబున వడంకుచున్నవ్రేళ్లవలన లజ్జంగోడం జాఱి పడినజపమాలిక నేనిఁ

తెలిసికొనం జాలెను. అంత నే నాజపమాల క్రిందఁబడకుండ నడుమ న పట్టుకొని స్తబ్ధీలంబు గా నాతనిభుజపాశకృతకంఠగ్రహసుఖంబు నో యన ననుభవించుచుఁ గంఠాభరణంబుం జేసికొంటిని. ఇంతలో ఛత్త్రగ్రాహిణి యరుదెంచి 'భర్తృదారికా! దేవి స్నానము చేసెను. గృహగమనకాలము సమీపించెను. కాన స్నానము చేయ నరుదెమ్ము.' అనుటయు నమ్మాటచే నేను గ్రొత్తగఁ బట్టువడిన పిడియేనుంగువలె నెట్టకేలకు నాతనిమోమునందుండిచూడ్కి మరలించి స్నానంబునకు వెడలితి. ఏను వెడలుడు నాతనిధైర్యచ్యుతిం గాంచి రెండవమునిదారకుండు కొంచెము కోపించినవానివలె నిట్లనియె:—'సఖుఁడా, పుండరీక, ఈమార్గము క్షుద్రజనక్షుణ్ణముసుమా! నీకుఁ దగదు. సాధువులు ధైర్యధనులు కదా? ఎవ్వఁ డనొక్కప్రాకృతునివలె విహ్వలం బగుచిత్తమును నిరోధింప వేల? మున్నెన్నఁడు లేనియీయింద్రియక్షోభంబు నీ కిప్పుడెట్లు కలిగెను? నీధైర్యం బెక్కడ? ఆయింద్రియజయం బెక్కడ? ఆప్రశాంతి యెక్కడ? కులక్రమాగతం బైనయాబ్రహ్మచర్యం బెక్కడ? ఆగురూపదేశంబు లెక్కడ? ఆశాస్త్రంబు లెక్కడ? ఆవైరాగ్యబోధంబు లెక్కడ? ఆయుపభోగవిద్వేషమెక్కడ? ఆసుఖవైముఖ్యం బెక్కడ? తపంబున నాయభినివేశం బెక్కడ? ఆసంయమిత్వం బెక్కడ? భోగంబులపై నాయరుచి యెక్కడ? నినుబోఁటివారును రాగద్వేషంబులచేఁ గాలు

వ్యంబు నొందుట యు, ప్రమాదంబులచేఁ దిరస్కరింపఁబడుట యుఁ జూడ, సర్వవిధంబులఁ బ్రజ్ఞ, నిష్ఫలంబు. ధర్మశాస్త్రాభ్యాసంబు నిర్గుణంబు. సంస్కారంబు నిరర్థకంబు. గురూపదేశంబు నిరుపకారకంబు. ప్రబుద్ధత్వంబు నిష్ప్రయోజనంబు. జ్ఞానంబు నిష్కారణంబు. చేతనుండిఁజాఱి యపహరింపఁబడినజపమాలిక నేని నెట్లు కనుఁగొనవైతివి? ఏమి యీస్మృతిహీనత ఆయనార్య జపమాలిక నపహరించుఁగాత. మఱి యు దానిచే నపహరింపఁబడుహృదయంబు నేని నేల వారింపవు?, అనుట యు నాతండు కొంచెము లజ్జపడి యిట్లనియె:—, సఖుఁడా, కపింజల, నన్ను వేఱువిధంబుగఁ దలంచె దేల? ఏ నాదుష్టకన్యకచేసినజపమాలాగ్రహణాపరాధంబు సహింపను., అని లేని కోపంబు దెచ్చికొని యిట్లనియె:—.చపలా, నాజపమాల నొసంగక యడుగుదాఁటి కదలకుము. , అన విని యే నాతనిజపమాల నామెడయందు యునిచికొని నామెడలోనియేకావళిం దీసి యాతనిచేత నునిచి మగుడ స్నానంబునకయి వెడలితిని. అంత స్నానంబుచేసి యతనినె తలంచుచుఁ దల్లితోడ నిజభవనంబున కరిగి కన్యాంతఃపురంబునఁ బ్రవేశించి యదిమొదలు విరహావివశనై వచ్చితి నో, అం ద యుంటి నో, పలుపురం గూడి యుంటి నో, ఒంటిమెయి నుంటి నో, ఊరకుంటి నో, మాటాడుచుంటి నో, మేలుకొంటి నో, నిద్రించుచుంటి నో, దుఃఖమో, సుఖమో, పవలో, రేయి యో నేది యు నెఱుంగను. కేవలము

కుమారీప్రాసాదంబునధిష్ఠించి సఖీజనంబు విడిచి సకలవ్యాపారంబులఁ ద్యజించి యొంటిక్షయి గవాక్షంబున మోమిడికొని పూర్ణచంద్రోదయాలంకృతంబగు నాదిశనె గాంచుచు దూరస్థనయ్యు సూర్యునకుఁ గమలినివలెను, జలధరంబునకు నెమ్మివలెను, నాతనికై యభిముఖనయి యుంటిని.

తరళిక పుండరీకుని లేఖను మహాశ్వేత కొసంగుట.

అంతకుమున్న నాయడపకత్తె తరళిక నాతోడ స్నానంబునకు వచ్చియుండెను. అయ్యది కొంతదడవునకు వచ్చి మెల్లన నాతో నిట్లనియె:— 'అచ్ఛోదసరసితీరంబున మనము గాంచినయిర్వురిలో నీచెవిలోనఁ గుసుమమంజరి నిడిన మునికుమారుండు రెండవవాని కెఱుకరాకుండ నడవిలో నావెంట నరుదెంచి భర్తృదారిక నుద్దేశించి 'బాలికా, ఈకన్యక యెవ్వరు? ఎవ్వరి కూఁతురు? పేరేమి? ఎటకుఁబోయెడి?' అని యడుగ నేను 'గంధర్వపతియైనహంసునికూఁతురు. మహాశ్వేత యనునది. గంధర్వావాసం బగు హేమకూటంబున కరిగెను.' అనివచింప నాతం డేమియో చింతించుచు ముహూర్తమాత్రం బూరకుండి యర్థించువానివలెఁ గ్రమ్మఱ నిట్లనియె:— 'కల్యాణి! బాల్యంబునను నీయాకృతి శాంతంబై చూపట్టె. నాపలుకొక్కటి వినుము' అనుటయు నేను దోసిలియొగ్గి యాదరంబు కనఁబఱుచుచు 'స్వామీ' ఇటు లేల పలుకనలయు? పుణ్యాంబులు లేక మిముబోఁటి మహాత్ములు

మముబోంట్లపై దృష్టినేని నుంతురే? ఇఁక నాజ్ఞాపింతురన నేమి చెప్పవలయు? కాన యానతి యొసఁగి యీ జనుని నను గ్రహించుమనది, అని పలుక నాతండు నంతసించి కానుగుబ్రమా నున నొక్క తలిరుటాకుం గోసి దాని నొకశిలాతలంబునఁ బిసి చి యారసంబుచే నుత్తరీయాంచలంబుననుండి చింపఁబడిన ప ట్టికపై నఖాగ్రంబున వ్రాసి యాపట్టిక నా కన్నియకుఁ జాటు గ నొసంగు మని పల్కి యిచ్చెను, అని చెప్పి తాంబూలభా జనంబుననుండి యాపట్టికం దీసి కనఁబఱిచెను. ఏనును శబ్దమ యంబయ్యు నాస్పర్శసుఖంబు గలిగించెనో యనఁ దనరు మునికుమారసంబంధమైన యాలాపంబుచే మదనావేశమంత్రం బుచేతనన నావేశపెట్టఁబడి దానికరతలంబునలన నారచీరపట్టి కం గైకొని యందు వ్రాయంబడి యున్న యాగీతిం జదువు కొంటిని.

"గీ॥ ఓసరుహాయతలోచన ఓసరసిత సుగు
తపకమాలికవల్లీపుతల్లి ...త|
హంసముంబోలె నామనం బాసఁ గ్రొవ్వి
చలుప్రచ్చియుఁ జేసెత ప్రాలదవ్వు॥"

అంతేఁ దారితప్పినవానికి దిగ్భ్రాంతిచేతంబలెను, అంధునకు బహుళపక్షరాత్రిచేతంబలెను, మూకునకు జిహ్వాచ్ఛేదంబుచేతంబలెను, అథర్వాసక్తునకు లోకాయతికవిద్యచేతంబలెను, ఉన్మత్తునకు మద్యముచేతంబలెను, పిశాచగ్రహంబునకు

దురావేశక్రియచేతంబలెను, స్మరాతురం బైననాచిత్తంబునకు నాగీలిచే మిగులదోషోపచయంబు కలిగెను. దానంజేసి యేను వివశనై యాతరళిక రెండవతూరి మునికుమారుం గాంచియుం డుట దానిని మహాపుణ్యంబుచేసినదానింబలెను, సురలోక వాసం బనుభవించినదానింబలెను, అమృతంబుగ్రోలినదానిం బలెను, త్రైలోక్యరాజ్యాభిషేకంబు నొందినదానింబలెను ద లంచుచు దగ్గఱ నుండెడిదైనం జూడనలభ్య మగుదానింబ లెను, అతిపరిచితురాలైనం గ్రొత్తదానింబలెను బలుకరించు చు, ప్రక్కన నున్నదియైనం ద్రైలోక్యంబునకుం బైన నున్న దానింబలెను గాంచుచు, చెక్కులయందును, ముంగురుల యందును దడవుచు, స్వామిభృత్యసంబంధమును దలక్రిందుగం గనంబఱుచుదాననై 'తరళిక, ఈ వామునికుమారు నెట్లు చూ చితివి? ఆతండు నీతో నేమేమి చెప్పెను? ఆయనయొద్ద నెం తకాల ముంటివి? ఆయనఘుండు మనల ననుసరించి యెంతద వ్వేతెంచెను? చెప్పు, మని వేమాఱడుగుచు నీవార్తతో స్నా మేడమీఁదం బవలం గడపితి. అంత సాయంకాల మగుడు ఛ త్రగ్రాహిణి వచ్చి యి ట్లనియె:—'భర్తృదారిక, ఆమునికు మారులలో నొక్కండు వాకిట నున్నవాఁడై, అక్షమాల వే డవచ్చితి నని వచింపుచున్నాఁడు., అనవిని యేను మునికుమా రనామగ్రహణంబునఁ బారవశ్యంబు పొంది కంచుకి నొక్క నిం బిలిచి 'పోయి యాతనిం దోడ్కొని రమ్ము, అని యాన

తిచ్చుటయు వాఁడు వల్లె యని ముహూర్తమాత్రంబున నా మనఃప్రియునిరూపునకు యౌవనంబుపలెను, యౌవనంబునకు మకరకేతనునివలెను, మకరకేతనునకు వసంతునివలెను, వసంతునకు మలయానిలునివలెను ననురూపసఖుం డై నకపింజలుం డను రెండవమునికుమారుం గాంచితి. ఆతనియాకారంబుఁ జూడఁ బర్యాకులంబో, సవిషాదంబో, శూన్యంబోయనఁ దనరు నంతర్గతభావంబు గలిగి యొప్పుచుండెను. అప్పుడె లేచి వందనము చేసి యేన యాసనం బొసంగితి. అతండు కూర్చుండ నాతనిపాదంబులఁ గడిగి పయ్యెదకొంగునం దుడిచి సమీపంబుగ నేలపైఁ గూర్చుంటిని. అంత నతండు ముహూర్తమాత్రంబుండి యేమో వచింపఁ దలచినవానివలెఁ దరళికయందు దృష్టి నునిచెను. ఏ నాతనిభావం బెఱింగి 'ఇయ్యది నాకు భిన్నురాలుకాదు. అసంశయముగ వక్కాణింపనగు, నని వచింప నతం డిట్లనియె:—

కపింజలుఁడు మహాశ్వేతకు బుండరీకు నవస్థలు విన్నవించుట.

'రాజపుత్రి' ఏమి చెప్పుదు? నావాక్కు వచింపరానివిషయంబున్న లజ్జచే నడఁగి పోయెడిని. కందమూలఫలంబులఁ గుడుచుచు శాంతి నొందియడవియందుండుమునిజనం బెక్కడ? అశాంతజనోచితంబై విషయభోగాభిలాషకలుషం బైనమదనరాగప్రపంచం బెక్కడ? యిది యెంతయు నయుక్తము. దైవం బెద్ది యారంభించెనో, చూడుము. ఈశ్వరుం డయత్నంబుగనె జనుని

హాసాస్పదుం గావించెడిని. ఇత్యాది నారచీరలకుం దగునో? జ
డలకు సౌభాగ్యంబో? తపంబున్న కనుకూలంబో? ధర్మోపదేశము
నకంగంబో? ఎఱుంగ. ఇద్ది యవశ్యంబును జెప్పవలయు. వే
ఱొకం డుపాయంబు కన్పట్టదు. ఇంకొక్క ప్రతిక్రియ తోఁప
దు. వేఱు దిక్కు గానంబడదు. వేఱొక్క గతి లేదు. చెప్పకున్న
నొప్పయనర్థంబు. మూడంగలదు. ప్రాణపరిత్యాగంబుచేనైన
నుహ్నాత్ప్రాణంబులు రక్షణీయంబు లని యెంచి వచింపంబూనితి.
శ్రీమతి యెదుఱనే యే నట్లు కినుకఁ బూని కఠినంబుగ వక్కా
ణించితి. అట్లు పలికి కోపించి యాతని విడిచి యచ్చటు వాసి
వేఱొక్కచోటికరిగితి. నీ వేగినపిదప ముహూర్తమాత్రంబుం
డి యిప్పు డొంటిమెయి నితం డేమి చేసెనో, యని మరలి
వచ్చి యచ్చోఁ గాంచునంతలో నతండు కానంబడమికి మనం
బున నిట్లు వితర్కించితి.

అతండు మదనపరాయత్తచిత్తుండయి యక్కన్నియ
వెంబడి పోయెనో? అక్కన్నియ యరుగఁ దెల్వినొంది. లజ్జచే
నా కగపడఁ జాలఁ డయ్యెనో? లేక కోపించి నన్ను విడిచి చ
నియెనో? అట్లుగాక నన్ను నెమక నింకొక్కచోటి కరిగె
నో?, యని వికల్పించుచుఁ గొంతకాల ముంటిని. పిమ్మట
నిట్లు చింతించితి. ఆతం డొకపరి ధైర్యంబు చెడి యేదేని
నప్రియంబు నాచరించెడినో? లజ్జచే నేమి చేయఁడు? అట్లు
గాన యీతని నొంటిగా విడువఁ గూడ, దని నిశ్చయించి

వెదకుచు నాతండు కానంబడనికొలందిఁ స్నేహకాతరం బగుమ
నంబున నమంగళంబు నాశంకించుచుఁ జందనవీథులను, ల
తామండపములను, సరఃకూలంబులను గాంచుచుఁ జాలసేపు
వెదకితి. అంతనొక్కకొలనిచెంగట నిరంతరం బగుటచేఁ గు
సుమమయం బో, మధుకరమయంబో, పరభృతమయం
బోయన నతిమనోజ్ఞం బయి వసంతునిజన్మభూమి యనఁదో
ప్పు నొకలతాగహనంబున నుండి సకలవ్యాపారంబులఁ ద్యజిం
చినవాఁ డగుట లిఖితునివలెను, స్తంభితునివలెను, యోగస
మాధినిష్ఠునివలెను గానంబడుచు, సధూమంబు లగుతప్తశ
ల్యంబులచేతనో యన సంపెగమొగ్గలచేత మదనునిచేఁ గొ
ట్టంబడుచు, హుంకారంబులచేతనో యన మధుకరఝంకారం
బులచేత దక్షిణానిలంబుచే నదలింపఁబడుచు, ననిశంబు గన్నీ
రుగార్చుచు, గ్రహగ్రస్తునివలెను, ఉన్మత్తునివలెను, అంధు
నివలెను, బధిరునివలెను, పరాయత్తచిత్తుం డయి మన్మథా
వేశంబు గొనకొమ్మ నధిష్ఠించి యెఱుంగరాని పూర్వాకృతి
గలయాతనిం గాంచితి. అట్టియవస్థఁగో నున్నమిత్రుని బె
ప్ప్రాల్పుక గాంచి విషాదంబు నొంది డెందంబు వడంక
నిట్లు చింతించితి. మకరకేతునివేగంబు దుస్సహంబు. అ
తండు క్షణమాత్రంబున నీతని నిట్టియవస్థ నొందించెఁగదా?
ఎట్టు లిట్టిజ్ఞాననిధి యొక్కమాఱుగ నిట్లువ్యర్థీభూతుం
డయ్యెడిని. ఇది యెంతచిత్రము? ఇతండు బాల్యంబు మొ

దలుకొని ధీరప్రకృతియై నాకు నొరులకును స్పృహణీయచరితుండయి యుండెను. ఇప్పు డొరునివలె జ్ఞానము నిరసించి తపంబు పోనాడి, ప్రభావంబుఁ ద్యజించి గాంభీర్యము దిగనాడి మన్మథునిచేఁ జడీకృతుం డాయె, అన్నివిధంబుల నిర్దోషం బగుయౌవనంబు దుర్లభంబు., అని యెంచి సమీపంబునఁ గూర్చుండి 'సఖుఁడా, పుండరీక, ఇదియేమి? చెప్పుము; అని యడిగితి. అంత నతండు బాష్పపర్యాకులం బగునీక్షణంబు మెల్లగ దెఱచి నన్నుఁ గాంచి నిట్టూర్పువుచ్చి 'కపింజల, వృత్తాంతం బెఱింగియు నన్నడిగెదవేల? అని పలికెను. అది విని యేను ఈతనివికారంబునకుఁ బ్రతిక్రియ లేదని యెఱింగియు 'మిత్రుం డసన్మార్గంబునఁ బ్రవర్తించునెడ శక్తికొలఁది తొలఁగింపవలయు నని నిశ్చయించి యి ట్లంటిని. 'సఖుఁడా' పుండరీక, ఏ నెఱింగియు నివియే యడుగుచున్నాఁడ. నీవెద్ది యారంభించితో, అది గురువులచే నుపదేశింపఁబడియెనా? ఇఁక ధర్మశాస్త్రములయందుఁ జెప్పఁబడియెనా? ధర్మార్జనోపాయంబా? అట్లుగాదేని నిది తపంబులు విధానాంతరంబా? మఱియిది స్వర్గగమనమార్గంబా? వ్రతరహస్యంబా? మోక్షప్రాప్తియోగంబా? ఇంకొకనియమప్రకారంబా? ఎట్టిది నీమనంబునఁ దలంపనేని యుక్తంబు? ఇఁక నెట్లు వచింపను, జూడను యుక్తమా చెప్పుము. నీ వజ్ఞునివలె మదనునిచే హాసాస్పదత్వంబు నొందింపఁబడుచు ని ట్లుండగవేల? మదనునిచే నా

యూసపెట్టఁబడువాఁడు మూఢుండుగదా? సాధుజననిందితం బు లగువిషయంబులయందు నీ క్షేమసుఖాశ కలదు? పరిణామ విరసంబు లగువిషయభోగంబులయందు సుఖబుద్ధి నిడికొను మూఢుండు ధర్మం బని విషలతలఁ జెనుచును. పూదండయని ఖడ్గలతను మెడయం దిడికొనును. మహారత్నం బని నిప్పుకం దాఁకును కదా? విషయస్వరూపం బెఱింగియు నుత్పథంబు నం జనునింద్రియంబుల వారింపవేల? క్షోభంబు నొందినమ నంబునైన నియమింపవేల? అనంగుఁడన నెవఁడు? ధైర్య మ వలంబించి యీదురాచారంబుం దూరీకరింపుము. అని పలు కుచుండ నాతండు కన్నీరు దుడిచికొని తనకరతలంబున నాపా ణిం బట్టుకొని యిట్లనియె:—

'సఖుఁడా' కపింజల, పలుమాటలేల ? నీవు స్వస్థుండ వు. ఆశీవిషవిషవేగతుల్యాంబు లగుకుసుమచాపసాయకంబుల పాలిం బడవైతివి. దాసంజేసి సుఖంబుగ బరున కుపదేశించె దవు. ఎవ్వని కింద్రియంబులు, మనంబును స్వస్థంబులో, ఎ వ్వండు కనుచు, వినుచు, వినినదాని దెలిసికొనుచు నున్నవాఁ డో, నుఱి. యెవ్వండు ఇది మంచి ఇదీ చెడుఁ గని వివేచింప నర్హుండో, వాడుకదా ఉపదేశమునకు యోగ్యుండు. నా కిది యంతయుఁ గడుదూర మయ్యె. జ్ఞానము,' ధైర్యము ననువా ర్త య స్తమించెను. ప్రాణంబు లెట్లో నిలచి యున్నయవి. ఉ పదేశకాలము దూరంబుననె పోయె. వైరాగ్యసమయం బతిక్ర

మించెను. ఇత్తటి నీకంటె నొరుం డెవ్వాఁడు నా కుపదేశించు వాఁడు? జగంబున నాకు నిన్నుఁబోలిబంధుం డెవ్వఁడు కలఁడు? ఏమి చేయుదు? చిత్తంబు నాఁపఁజాల. ఇప్పుడు నాయవస్థం గాంచితిగదా! ఉపదేశకాలంబు గతించెను. కాన బ్రదికియుం డుదాఁక నీమదనసంతాపంబునకుఁ బ్రతిక్రియ సేయఁగోరెద. నాయంగంబు లుడికెడిని. హృదయంబు తెఱలెడిని. శరీరంబు మండెడిని. కాన యిప్పటి కేది తగునో, యదియొనరించెదు గాత., అని పల్కి మిన్నకుండెను.

అంత నే నిట్లు చింతించితి. 'సమయంబు దప్పెను. ఈత నిమరల్ప సాధ్యంబుకాదు. ఇప్పు డుపదేశంబులు నిరర్థకంబులు. కాన ప్రాణపరిరక్షణంబునకై యత్నించువాఁడ' నని యెంచి పలువిధంబు లగుశిశిరోపచారంబులఁ జేయుచు నిట్లు చింతిం చితి. భగవంతుఁ డగుమనోభవునకు నసాధ్యంబు లేదు. హ రిణంబువలె వనవాసనిరతుండయి స్వభావముగ్ధుండైన యీజ నుం డెక్కడ? వివిధవిలాసరాశి గంధర్వరాజపుత్రి మహాశ్వేత యెక్కడ? ఇతని కన్నింట దుర్ఘటంబును, దుష్కరంబును లేదు. అగాధగాంభీర్యసాగరుం డగునీతని తృణమునిబలె లా ఘవంబునొందించెఁగదా? ఆతపం బేడ? ఈయవస్థ యేడ? దేనను బ్రతీకారంబు లేనియాపద యుపస్థితంబయ్యెను. ఇప్పు డేమి చేయవలయు? ఏదెసకుఁ బోవలయు? ఎవ్వనిశరణుచొర వలయు? ఏమియుపాయము? ఏమి యుక్తి? ఏమి దిక్కు? ఏ

దినహాయము? ఈతనిప్రాణంబు లెట్లు నిల్చు? ఏయుపాయం బుచే నితండు జీవించును?" అని విచారించి క్రమ్మఱ నిట్లు చింతించితి. 'అతిదీర్ఘం బైనయీనిష్ప్రయోజనచింతచే నేమి? మంచియో? చెడుగో? ఏ దేనొకయుపాయంబున నీతనిప్రాణంబుల రక్షింపవలయు. వానికి నీసమాగమంబు దక్క యింకొండుపాయంబు లేదు. బాలభావంబునను, అప్రాగల్భ్యంబునను, తపోనిరుద్ధం బగుననుచితంబు పోనగె నని యెంచి యితం డాకన్నియయున్నయెడకుం జని మనోరథంబు నించికొనం జాలఁడు. మదనవికారంబు కాలాంతరంబు సహింపదు. సాధువు లతిగర్హితం బైనయకృత్యంబునైన సుహృత్ప్రాణంబులు రక్షింప నెంతురు. కాన యిది యకృత్యంబయ్యు నాకవశ్యకర్తవ్యంబై ప్రాప్తించెను. ఇం కేమి చేయవలయు? నేఁ డు గతి యేమి? సర్వవిధంబుల నాయుమయొద్దకుఁ జని యీ యవస్థ నివేదించు వాఁడ, నని యాలోచించి 'ఏ ననుచిత వ్యాపారంబునఁ బ్రవర్తించితి నని లజ్జించి యతండు వారించునో, యని యెంచి యతనికిఁ దెలుపకయే కార్యాంతరవ్యాజంబున వెడలి యిటకు వచ్చితి. ఇట్టు లుండఁగా నిప్పుడది యుక్తమో? ఇట్టియనురాగంబున కెద్ది తగునో? మా రాక కది యనురూపంబో? అందు నీవ వలంతివి.' అని పల్కి యే మి చెప్పుదునో యని నామొగంబునఁ జూడ్కి నిల్పి మిన్నకుండెను.

ఏ నది విని సుఖామృతమయంబగు హ్రదంబున మునింగినదానివలెను, సర్వార్థంబుల నొందినదానివలె నప్పుడు పొడమినలజ్జచే మోము వంచి యానంద బాష్పంబులచేఁ బ్రహర్షంబు దెలుపుచు నిట్లు చింతించితిని. దైవయోగంబున మదనుండు నన్నుంబలె నాసుభగుని ననుబంధించి యున్నవాఁడు. ఇతండు నన్ను సంతాపపెట్టినను గొంతయానుకూల్యంబునె కనంబఱచినవాఁ డగు. అమ్మునికుమారకున కిట్టిదశ నిజంబగు నేని నీతండు సేయనియుపకారం బేమి? ఇతనింబో సముండైనబంధుం డెవ్వఁడు? కపింజలుండు కలలో నైన నసత్యంబు వచించునే? ఇట్టు లుండ నే నేమి నిశ్చయింపనలయు, ఈతని యెదుట నే నేమిచెప్పనలయు', నని విచారించుచుండఁగ నె ప్రతీహారి వచ్చి యిట్లనియె:— 'భర్తృదారిక! నీ వస్వస్థశరీర వని పరిజనంబువలన విని మహాదేవి వచ్చెను., అనుటయు' విని కపింజలుండు మహాజనసమ్మర్దంబునకు వెఱచి వేగంబ లేచి ' రాజపుత్త్రీ, కాలం బతిక్రమించెను. దివసకరుం డస్తమించెడిని. కాన నే నరిగెద. అన్నివిధముల సుహృత్ప్రాణరక్షణంబునకయి యిదో దోసిలి యొగ్గుచున్నాఁడ. ఇదియె నాకుఁ బరమానందంబు., అనిపల్కి ప్రతివచనం బపేక్షింపక య వెడలి పోయెను. అంతనాజనని యరుదెంచి కొంతడడ వుండి తనయిక్కకుం జనియెను. ఆయమ యచట నేమి చేసెనో? ఏమిచెప్పెనో ఎఱుంగ. ఆమె యరుగ నరుణగభ

స్తి యస్తమింపఁ జీఁకటి వ్యాపించెను. అప్పు డేమియుం జేయఁ దోఁపక తరళిక నిట్లడిగితి.

మహాశ్వేత పుండరీకు నుద్దేశించి చింతించుట.

'తరళిక' నా డెందం బాకులపాటొందెను. ఇంద్రియంబులు వివశంబు లాయెను. నాయంతన యేమి యుం జేయఁజాల. ఇం కెది యుక్తమో? అది నీవ యుపదేశింపుము. కపింజలుండు నీయెదుటన చెప్పిపోయెఁగదా? ఇతరకన్యకవలె నేను లజ్జను దృజించి, ధైర్యంబు నిర్మూలంబు చేసి, అవినయం బంగీకరించి, సదాచారంబు నుల్లంఘించి, అయశంబున కొప్పి రాగాంధవృత్తినై తండ్రిచే ననుజ్ఞఁగొనక, తల్లిచే ననుమోదింపఁబడక నాయంతన వెడలి మునికుమారుపాణిం గ్రహించు నెడ గురుజనాతిక్రమణంబున గొప్పయధర్మంబు వాటిల్లును. ఇఁక ధర్మానురోధంబున మృత్యువు నంగీకరింతు నేని దానం దనంతనవచ్చినకపింజలునకుఁ బ్రణయభంగంబును, మత్కృతం బైనయాశాభంగంబున మునిసూనుం డసువులఁ దొఱంగు నెడ నద్దుస మునిజనవధజనితం బైన మహాపాతకంబు కల్గును. అని యిట్లు బల్కుచుండఁగనె చంద్రోదయం బాయెను. శశధరబింబంబుచే నానిశి మనోజ్ఞం బయి యుండె. అప్పు డుదయించినరజనికరబింబంబుఁ గాంచి యేను లోనఁ బ్రజ్వలించెడుమదనానలంబు గలిగియు, నంధకారితం బైనహృదయంబుగల దానను, తరళికతొడపైఁ దనువల్లి నుంచియు మన్మథునిచేతి

లో నున్నదానను, చందురునిగాంచుచుండియు మృత్యువు నాలోకించుచున్నదానను నైతిని. మదనమధుమాసమలయపవనాదు లొక్కవలను, పాపకారి యైనచంద్రహతకుం డొక్కవలను నుండుఁగదా? దాహజ్వరంబు గలవానికి నిప్పుకలవర్షంబువలెను, చలిగొన్నవానికి మంచుసోనవలెను; మదనవేదనాతురం బైననాడెందంబున కీయిందుబింబం బత్యంతమసహ్యంబు., అని యాలోచించుచునె మూర్ఛ నొందితి. అంతఁ దరళిక చేసినచందనచర్చలచేతను, తాళవృంతానిలంబులచేతను దెప్పిఱిలి కన్నీరు గార్చుచు నేడ్చుచున్నతరళికం గంటిని. నేను కన్నులు దెఱచిన నన్నుఁగాంచియాతరళిక దోసిలియొగ్గి యిట్లనియె:—

మహాశ్వేత తరళికతోఁ బుండరీకునొద్దకు వెడలుట.

'భర్తృదారిక' లజ్జతో నేమి? గురుజనాపేక్షతో నైన నేమి? ప్రసన్న వగుము. నన్నంపుము. నీప్రియతముని నిటకుం గొనివచ్చెద. లేదేని లెమ్ము. నీ వైన నటకుఁ బొమ్ము. ఇంక మీఁద మదనునివలనబాధ ముత్కంఠ నోర్వఁజాలవు. నావిని యే ని ట్లంటిని. ఉన్మత్తా, మన్మథునితో నేమి? కుముదబాంధవుండు సర్వవికల్పంబులఁ బరిహరించుచును, సర్వసందేహంబుల మాన్పుచును లజ్జ నున్మూలీకరించుచును మృత్యువునొద్దనుండి వచ్చినవాఁడు. మృత్యువునొద్దకుఁ గొనిపోవం గలఁడు. కాన లెమ్ము. అని దానిం బట్టుకొని యేరికి నగఁబడ

కయ మేడనుండి దిగితి. దిగి వెడలునంతలోఁ గుడికన్ను దరఁ దొడగెను. అది లక్షించి దైన్యం బిం కెద్దియో సంకల్పించె నని యెంచితి. అట్లు వెడలి తరళికాద్వితీయనై చనుచు నిట్లు చింతించితి. ప్రియతమాభిసరణంబునకయిఁ బ్రవర్తించిన జనంబునకు బాహ్యపరిజనం బేల? వీరలె పరిజనకృత్యమును నెఱపుచున్నారు గదా? సమారోపితశరాసనుం డగుకుసుమాయుధుండు వెంట నేతెంచుచున్నాఁడు. చంద్రుండును తన కరంబులఁ జాఁచి నాకరంబు నాకర్షించెననఁ దనరుచున్నాఁడు. లజ్జను వెనుకజేసి డెందం బింద్రియములతోఁ మున్ముందునకుఁ బోయెడిని. ఉత్కంఠ నన్ను నెత్తికొని పోవుచుండెడిని.' అని యెంచి ప్రకాశంబుగ నిట్లంటిని. 'తరళిక, ఈయిందుహతకుండు నన్నుం బలె నతనింగూడఁ గరంబునఁ బట్టి యాకర్షించి యెదురుగఁ గొనివచ్చునా?' అన విని నన్నుఁ జూచి తరళిక యిట్లనియె:—'భర్తృదారిక, ఈతని కాజనునితోఁ నేమి? ఈతండు తాన మదనాతురునివలె భర్తృదారికయం దాయాచేష్టల నాచరించెడిని. ఎట్టు లన, ప్రతిబింబమిషంబునఁ జెక్కిలి ముద్దుగొనుచున్నాఁడు. మఱియుఁ గాలిగోళ్లం బ్రతిఫలించి యడుగులపైఁ బడుచున్నాఁడు., అని యిట్టి యాలాపంబు లాడుచు నచ్చోటు డాసితి. అంత మార్గంబునఁ గుసుమరజం బంటిన చరణయుగంబు నొక్కకొలనిలోనఁ గడిగికొనినదాననై పురుషునిరోదనధ్వని నాలించితి. మొదల కుడికన్నదరుట సహి

తము నాశంకించుచున్నదాన నాక్వనిచే మిగుల గుండియ వగిలినట్లు విషణ్ణచిత్తనయి 'తరళికా! ఇది యేమి?' అని భయంబున వణంకుచు నెదురుగఁ ద్వరితగతి నరిగితి. అపుడు నిశీథసమయంబగుట నార్తనాదంబు దూరంబునకు వినవచ్చె.

కపింజలుండు పుండరీకుని నుద్దేశించి విలపించుట.

'హా! హతుఁడ నైతి. వంచితుఁడ నైతి. హా! ఇది యేమి? ఇట్లు వచ్చె. దురాత్మా, మదనపిశాచ! నిర్ఘృణ, ఈ యకృత్యము చేసితి వేల? ఆ! పాపా, మహాశ్వేతా, దుర్వినీతా, నీ కితం డేమి యపకృతి యొనర్చె? ఆ! దుశ్చరిత, చంద్రచండాల, కృతార్థుండ వైతివి. దాక్షిణ్యహీన, దక్షిణానిలహతక, నీమనోరథంబు లిప్పుడు పూర్ణంబు లయ్యె. కృతకృత్యుండ వైతివి. ఇప్పుడు సంతోషంబు నొందుము. హా! భగవంత, శ్వేతకేతూ, పుత్రవత్సల, చెడినని నెఱుఁగ నైతివి. హా! ధర్మమా, నిష్పరిగ్రహమ వైతివి. తపమా, నిరాశ్రయమ వైతివి. సఖుఁడా, నిన్ను విడిచి క్షణమైన నుండఁజాల. నీవెంట వచ్చెద నిలుము. ఎట్లు పరిచితునివలె నొక్కమాఱుగ నన్ను విడిచి పోయెదవు? ఏమి నీనిష్ఠురత్వము? నిన్ను విడిచి యెచ్చటి కేగుదునో ఛాత్వని ఎవ్వనితోఁ ద్గోష్టినో చెప్పుము. అంధుండ నైతి. నాకు దెసలు శూన్యంబు లయ్యె. నాజీవితంబు నిరర్థకత నొందె. తపంబు నిష్ప్రయోజనత గాంచె. ఎవ్వనితోఁ దిరుగుదు? ఎవ్వనితో భాషింతు? లెమ్ము. విలపించునాకుఁ బ్రతివచనంబు నిమ్ము, నీకు నాపైఁ

గల ప్రేమం బెటఁబోయె. స్మితపూర్వాభిభాషిత్వం బెందేగె, అను కపింజలునాలాపంబు నాలించితి,

మహాశ్వేత పుండరీకు నుద్దేశించి విలపించుట,

అంత నెగసిపోయెడు నసువులతో నెలుంగెత్తి యే డ్చుచుఁ, జని మందభాగ్యను పాపకారిణి నగునేను తలిరుసెజ్జ పై ననంగయోగవిద్యను ధ్యానించువానివలెను, అపూర్వ మగు ప్రాణాయామము నభ్యసించువానివలె నుండి కంఠంబునఁ గపింజలునిచేఁ గౌఁగిలించుకొనఁబడి యప్పుడ విగతజీవితుం డయిన యమ్మహాభాగుని జూచితి. చూడనె మూర్ఛాంధకారం బుగప్పి పాతాళంబున కేగినదానివలె నప్పు డెందుంటినో, ఏమి చేసితినో, ఏమి విలపించితినో, ఏదియు నెఱుంగ. ఈ మూఢ హృదయం బతికఠినం బగుటనో, దీర్ఘశోకంబు విహితం బగు టనో, జన్మాంతరోపాత్తం బైనదుష్కృతంబునకుఁ బాత్రురాల నగుటనో, నాప్రాణంబు లేకారణంబున నిలిచెనో ఎఱుంగ. కొంత దడవునకుఁ దెలివిఁ గాంచి యిది యే మిట్లు వచ్చెనని పేరెలుం గున 'హా! తల్లీ,' హాతండ్రీ, హాచెలులారా, అనుచును, హానాథ, జీవితనిబంధన, దిక్కులేనిన న్నొంటిగ విడిచి యెటఁబోయెదో వచింపుము. నీకయి యెట్టియవస్థ పొందితినో తరళిక నడుగుము. ప్రసన్నుఁడ వగుము. ఒక్కమాటైన మాటాడుము. భక్తవత్సలతం గనఁబఱుపుము. కొంచమైనఁ జూడుము. నామనోరథంబు నింపుము. ఆర్తనైతి. అనురక్తనైతి. అనాథనైతి. అగ

తిక నైతి. మదనపరిభూత నైతి. దయయుంప వేల? ఏమి యప
రాధము చేసితినో? నీయాజ్ఞాపత్తి యేమి చేయనైతినో? చెప్పుము.
ఏల కోపించితివి, దాసీజనంబు నకారణంబుగ విడనాడి పోయె
దేల, ఆ! నాకతన నీ కిట్టిదశ వాటిల్లెను. ఇట్టినే నింకను బ్రదికి
యున్నదాన. నాకు వినయంబును, బంధువర్గంబును, పరలోకం
బును లేదు. నాబోంటిక్రూరహృదయ యెందును లేదు. ఇట్టి
నిన్ను విడిచి గృహంబున కరిగితినిగదా? ఇంక నాకు గృహంబు
తో నేమి, తల్లితో నేమి? తండ్రితో నేమి? బంధువులతో నేమి,
పరిజనంబుతో నేమి? హా! ఎవ్వని శరణుఁ జొత్తు. దైవమా, నా
యందు దయగనంబడుము. నీకు విన్నవించుకొనుచున్నదాన.
భర్తృభిక్ష వెట్టుము. భవితవ్యతా, దయ నుంచుము. అనాథవ
నితం గావుము. వన దేవతలారా, ఈయనకుఁ బ్రాణముల నొ
సంగుఁడు. తండ్రీ, కైలాసవాసా, నిన్ను శరణుఁ జొచ్చితి. దయా
ళుతర గనంబడుము., అని యిట్లు గ్రహగృహీతవలెను. ఉన్మ
త్తవలెను, విలపించితిని. భగవంతుఁడా, ఈయనను బ్రదికింపు
ము, అని పలుమాఱు కపింజలుని పాదములపైఁ బడితిని. తరళి
కం గౌఁగిలించికొని రోదనము చేసితి. అని యిట్లు తన వృత్తాం
తంబు వచించుచుండునంతలో మహాశ్వేతకు మూర్ఛ వచ్చు
టయు శిలాతలంబుపయిఁ బడుచుండఁ జంద్రాపీడుండు పట్టుకొని
తనయుత్తరీయాంచలంబున వీచుచు మూర్ఛ దేర్చెను.

తెలివివచ్చినపదంపడి జాలిగొని చంద్రాపీడుం డిట్ల నియె:—'భగవతీ, పాపుండ నైన యేను నీశోకంబుం గ్రొత్త జేసితి. దానంజేసి నీవిట్టిదశ నొందితివి. కాన నీవృత్తాంబు వచింపవలదు. ఏనువినఁజాల, ఇంక ముగింపుము. కడచిననైన ను దుఃఖంబులు సుహృజ్జనంబునకు నెడఁగించునవి యనుభవం బునకు సమం బైన వేదనం గలిగించెడిని. కాన యెట్లో ధరింపఁ బడిన యీయసువుల మగుడ శోకానలంబున కింధనత్వంబు నొందింపకుము.' అని విని వేడినిట్టూర్పు విడిచి కన్నీరు గ్రమ్మిన కన్నులతో దుఃఖంబున నిట్లనియె:—'రాజపుత్త్రా అతిదారుణం బగునాకేయి నన్ను వీడని ప్రాణంబు లిప్పుడు విడుచుననుట యు తిదూరము. భగవంతుం డైనయంతకుండును నతిపాప నైన నాదర్శనంబుఁ బరిహరించెడిని. కఠినహృదయంబు గలనాకు శోకం బెక్కడిది? అట్టివేదన ననుభవించిననాకుఁ జెప్పుటకు శక్య మేమి? చెప్పుటకును వినుటకును నశక్యం బైన యీ వార్త కంటె నింకొకకష్టం బేమికలదు? ఈవజ్రపాతంబునకు నవ్వల జరిగినయాశ్చర్యంబు నివేదించెద. ఏ నాదురాశా మృగ తృష్ణచే గ్రహింపం బడుటన భారభూతం బగు యప్రయో జనం బైనహతశరీరయుఁ ధరించియున్న దాన. ఇద్దాని బాగుగ వినుము.

దివ్యపురుషుండు మహాశ్వేత నూఱడించుట.

ఏ నట్టియవస్థాంతరంబున మరణంబ నిశ్చయించి పెక్కు విలపించి తరళికతో ని ట్లంటిని. 'ఓసీ' లెమ్ము. ఎంతసేపేడ్చెదాన. కట్టియలం గొనితెచ్చి చితం బేర్చుము. జీవితేశ్వరు ననుగమించెద., అనుటయు నంతలో మహాప్రమాణుండు, దివ్యాకృతి యైనయొకపురుషుండు చంద్రమండలంబుననుండి వెలువడి వచ్చి మృతు డైనపుండరీకు నెత్తుకొని గంభీరస్వరంబుతో 'వత్సా' మహాశ్వేతా, నీవు ప్రాణంబుల విడువకుము. మగుడ నీ కీతనితోడ సమాగమంబు గలిగెడిని., అని తండ్రివలె నాదరించి పలికి గగనతలంబున కెగసెను. అంత నేను భయంబును, విస్మయంబును, కౌతుకంబును దోప మొగం బెత్తి 'ఇది' యేమని కపింజలు నడిగితి. అతండు నాకు మాఱుపల్కకయ 'దురాత్మా, అంతక, నానెచ్చెలి నెచ్చటికిఁ గొనిపోయెదు ?' అని కోపించి యాతనివెన్నంటి గగనతలంబున కెగసెను. ఏను చూచుచుండఁగనె వారందఱు దారామండలంబునఁ బ్రవేశించిరి. ఏమియుఁ దోఁచక 'ఇది యేమో యెఱుంగుదువా?' అని తరళిక నడిగితిని. అదియుఁ భయంబున వడంకుచు నేను మరణింతు నని యెంచి దీనంబుగ ని ట్లనియె:—

'భర్తృదారిక, పాపాత్మురాల నేమియు నెఱుంగ. ఇది గొప్ప వింత. అమానుషాకృతి యైనయాపురుషుండు తండ్రివలె నక్కటికంబున ని న్నూఱడించెను. ఇట్టిదివ్యపురుషులు స్వప్నం

బునఁ జెప్పినవచనంబులును నిక్కంబు లగు. ప్రత్యక్షం
బుగఁ జెప్పినవానిగుఱించి యేమి చెప్పవలయు. విచారించి
నను నిప్పురుషునిభాషితం బసత్యం బంటకుఁ గారణంబు దోప
దు. కాన యీయవస్థయందుఁ బ్రాణపరిత్యాగోద్యమంబు ని
వర్తింప నిది గొప్పయాశ్వాసస్థానంబు. మఱియుఁ గపింజలుం
డాతనివెన్నంటి పోయెను. అతనివలన 'ఇతం డెందుండి వ
చ్చెనో, ఏల విగతజీవితుం గొంపోయెనో, ఎటుపోయెనో, ఏ
ల యసంభావనీయం బైనపునస్సమాగమంబున నాశపెట్టి భ
ర్తృదారిక నూఱడించెనో' ఇది యంతయు నెఱింగి యప్పుడు
జీవితంబో, మరణంబో నిశ్చయించెదు. మరణంబు సులభంబు.
ఇయ్యది యెఱింగినపిమ్మట గాఁ గలదు. కపింజలుండు జీవించి
యుండునెడ భర్తృదారికం జూడకుండఁడు. కాన యాతండు
వచ్చునంతకుఁ బ్రాణంబుల ధరింపుము, అని నాపాదములప
యి వ్రాలెను. ఏను జీవితాశ దుర్లంఘ్యం బగుటను, స్త్రీస్వ
భావంబు క్షుద్రం బగుటను, దివ్యపురుషునివచనంబునం గలి
గినదురాశామృగతృష్ణకతనను, కపింజలుండు మగుడ వచ్చు
ననుకాంక్షను 'అప్పు డిదియే యుక్తం, బని యెంచి జీవితం
బు విడువ నైతి. ఆశచే నేమి చేయరు? తరళికతోడ నేడ్చుచు
దుఃఖమయివలె, నరకమయివలె నున్నయారాత్రి గడపితి.
ప్రభాతంబున లేచి యాకొలనిలో స్నానంబు చేసి నిశ్చయం
బు చేసికొని మునికుమారకుని ప్రీతికయి యాకమండలువును,

ఆనారచీరలను, ఆజపమాలను గ్రహించి, సంసారంబు నిస్సారం బని యెఱింగి, ఏ•నప్పుణ్య నని యెంచి, శోకంబు దుర్నివారం బని తలంచి, దైవంబునిష్ఠురత్వముం గాంచి, స్నేహంబు బహుళదుఃఖం బని వితర్కించి, సర్వపదార్థంబు లనిత్యము లని నిశ్చయించి, తలిదండ్రులఁ ద్యజించి, మనంబున సకలబంధువర్గంబును దెగడి, చిత్తంబు విషయసుఖంబువలనఁ దొలఁగించి, ఇంద్రియంబుల నియమించి, బ్రహ్మచర్యంబు నవలంబించి, త్రైలోక్యనాథుండును, అనాథశరణుండు నైనపరమేశ్వరు శరణుఁ జొచ్చితి. మఱునాఁ డీవృత్తాంతంబు నెఱింగి నాతల్లిదండ్రులు బంధువర్గంబుతో నరుదెంచి చాలసేపు రోదనంబు చేసి పలుదెఱంగు లైనయుపాయంబులచే న న్నింటికిఁ గొంపోవ నుద్యమించి విఫలయత్నులై దుహితృస్నేహంబు దుస్త్యజం బగుటం జేసి యేను బో మ్మనుచున్నను పెక్కుది నంబు లుండి సశోకులయి గృహంబున కరిగిరి. అంత నేను దేవునివిషయంబునఁ గన్నీరు గార్చుటయు కృతజ్ఞతగాఁ గనఁబఱుచుచు, బహుపాతకంబు, నిర్లజ్జంబు, నమంగళబహుళంబు, ననేకక్లేశావాసంబు నైనయీశరీరంబు వివిధనియమంబులచే శోషింపఁ జేయుచు, వన్యంబు లైనఫలమూలాదులం గొనుచు, జపంబునియమంబున దేవుని గుణగణంబు లెక్కించుచు, త్రిసంధ్యంబును నిక్కాలనం గ్రుంకి త్ర్యంబకుని బూజించుచు నీగుహాయందుఁ దరళికతోడ దీర్ఘశోకంబు ననుభవించుచున్న

దాన. ఏనిట్టిపాపిని, నిర్లజ్జను, నృశంసను, నిష్ప్రయోజనోత్పన్నను, నిష్ఫలజీవితను, అనాథను, నిస్సుఖను నగుదు. బ్రాహ్మణవధమహాపాతకంబు చేసినదన్నుఁ గనినను, పలుకరించినను మహాభాగున కేమిప్రయోజనము?" అని పల్కి చీర కొంగున మోముచందురుం గప్పికొని శోకవేగంబు నాఁపరామి నేలుంగెత్తి యేడ్చెను.

చంద్రాపీడుండు మహాశ్వేత నూఱడించుట.

చంద్రాపీడుండు మొదల రూపంబునను, వినయంబునను, దాక్షిణ్యంబునను, తపస్విత్వంబునను, మహానుభావత్వంబునను నాయువయందు గౌరవంబుగలిగియుండుటఁ దద్వృత్తాంతశ్రవణంబున మిగుల దయార్ద్రహృదయుండయి మెల్లననిట్లనియె:— 'భగవతి' అకృతజ్ఞుండు స్నేహసదృశంబైనకృత్యంబుం జేయఁజాలక యూరక యేడ్చుచుండును. కర్మంబుచేతన సర్వంబు నాచరించునీవు రోదనము సేయనేల? ప్రియునికయి జన్మంబు మొదలు పరిచితంబైనబాంధవజనంబుం ద్యజించితివి. తృణప్రాయంబుగ విషయంబులఁ దెగడితివి. ఐశ్వర్యసుఖంబులఁ విడనాడితివి. బ్రహ్మచర్యంబు గ్రహించితివి. మహాతపంబునఁ జిత్తంబుఁ జొనిపితివి. వనితాజనదుష్కరంబైనవనవాసం బంగీకరించితివి. అనుమరణంబున నెద్ది కలదో, అది యతినిష్ఫలంబును, నజ్ఞానపద్ధతియు, నతిప్రమాదంబును నగు. తండ్రియో, సోదరుండో, మిత్రుండో, భర్తయో మృతి నొందునెడ ప్రాణంబు

లు! వానియంతన వోయెనా? అదియుచితంబ యగుఁగాని బలవంతంబుగఁ దెగడుట యొప్పదు. ఇందు విచారింపఁ బ్రాణపరిత్యాగంబు తనయసహ్యశోకంబునకుఁ బ్రతీకారంబుగాన స్వార్థంబ కాక యిది మృతున కేమిగుణంబును గలిగింపనేరదు. ఇయ్యది మృతినొందినవానిఁ గ్రమ్మఱఁ బ్రదికించు నుపాయంబా? ధర్మోపచయకారణంబా? పుణ్యలోకావాప్తిహేతువా? నరకపాతప్రతీకారంబా? పరస్పరసమాగమనిమిత్తంబా? ఇందేదియుఁ గాదు. మృతినొందినవాఁడు తనకర్మంబునకుం దగినప్రదేశంబునవశుండయి చేరెడిని. అనుగమనంబు సేసినజనుం డాత్మహత్యాపాతకంబునె యార్జించుకొనంగలఁడు. జీవించియున్నవాఁడు మృతునకు జలాంజలిదానాదుల నుపచరించుంగాని యనుమరణంబు చేసినవాఁడు ఇర్వురకు ననుపకారకుండగు. భర్తయైనమకరకేతనుండు హరనయనహుతాశునిచే దహింపబడి యుండఁ రతీదేవి ప్రాణంబుల విడిచెనా? కిందమమునిశాపంబునఁ దనపతి, పాండుమహీపాలుం డసువులఁ గోల్పోయినయెడఁ గుంతీదేవి మృతి నంగీకరించెనా? వినయవంతుండు, విక్రమవంతుండు నైనయభిమన్యుండు నిహతుం డగుటయు విరాటపుత్రి యుత్తర దేహంబు ధరించియుండదాయెనా? సైంధవుం డర్జునునిచే మడియ ధృతరాష్ట్రనందన దుశ్శల ప్రాణపరిత్యాగంబు సేసెనా? మఱియు సురాసురకన్యలు పలువురు భర్తృరహితలు వినంబడుచున్నారు. ఈవు మగుడ భర్తృసమాగమంబుగలుగు

ననుమాట నాలించితివి. అట్టిమహాత్ములవచనంబులు వితథం బులగునే, నిస్సంశయంబుగ నిమ్మహాత్ముండె కారుణ్యంబునఁ గ్రమ్మఱఁబ్రదికింపనె యతని నెత్తుకొని సురలోకంబునకుఁ గొం పోయె. మహాత్ములప్రభావం బచింత్యంబు. దైవంబు చిత్రంబు. తపస్సిద్ధు లాశ్చర్యకరంబులు. అట్లుగానియెడ నాతనింగొ నిపోవ నేల? కాన పునస్సమాగమం బసంభావ్యం బనియె న్నకుము. ఈమార్గంబు చిరకాలంబుననుండి వచ్చెడిని. తొ ల్లి విశ్వావసుండనుగంధర్వరాజునకు మేనకయందు జనించినప్ర మద్వర యనుకన్యక కాలసర్పదష్టయయి మృతినొంద నద్దాని ౦ బ్రమతితనయుండు రురుం డనువాఁడు తనయాయువులో సగ మొసంగి బ్రదికింపఁడె? అశ్వమేధతురగానుసారియయి, ఆత్మ జుండైనబభ్రువాహనునిచే నిహతుం డయినయర్జునుని నులూపి యనునాగకన్యక సప్రాణుం జేసెఁగదా. అశ్వత్థామ సస్త్రాగ్ని చే దగ్ధుం డయి మృతినొందినపరీక్షితుని భగవంతుం డైన వాసుదేవుండు సజీవుంజేసెఁగాదె? ఎట్లో యింగును నట్ల కాగ లదు. ఐనను నేమి సేయవలయు? ఎవ్వని నిందింపవలయు? నియ తి బలవతి, మనయిచ్చచే నిట్టూర్పు విడువనైన శక్యంబు గాదు. తలుచుగ స్వభావంబునని సుఖంబులు క్షణికంబులును, దుఃఖంబులు దీర్ఘంబులు నయియుండు. అట్లు ప్రాణుల కొక్క జన్మంబున సమాగమంబును, పెక్కుజన్మంబులయందు విర హంబును భోగ్యం బగు. కాన నిన్ను నిందించికొనవలదు. అతి

గహనం బైనసంసారపథంబునఁ జరించువారల కీవృత్తాంతంబులు.రాక మానవు. ధీరు లాస్పదం దరింతురుగదా?, అని పల్కి జలంబులం దెచ్చి బలాత్కారంబున నాయమ ముఖము గడిగికొనునట్లు సేసెను.

అంతలో మహాశ్వేతావృత్తాంతంబు విని శోకంబు నొందెనో యన దినకరుం డస్తమించెను. పదంపడి చంద్రాపీడుండు సాయంసంధ్య నుపాసించి మహాశ్వేత నిట్టు లడిగెను. 'భగవతీ' నీపరిచారిక తరళిక యెట కేగెను.' అనుటయు నాయమ మగుడ ని ట్లనియె:—'మహాభాగ, మున్న మృతమంభవం బైనయప్సరసకులంబు కల దని చెప్పియుంటిని. ఆకులంబున మదిర యనుకన్యక జనించెను. ఆకన్యకను చిత్రరథుం డనుగంధర్వరాజు పరిణయం బాడె. వారికిఁ గాదంబరి యనుకన్యారత్నం బుదయించెను. ఆకన్నియ జన్మంబుమొదలు నాకు బాలమిత్రం బయి యుండెను. ఆజవ్వనియు నిట్టినావృత్తాంతంబుచే శోకాకులయయి 'మహాశ్వేత దుఃఖితయయి యుండ నేను పాణిగ్రహణంబు చేసికొనను., అని నెచ్చెలుల యెదుటఁ బ్రతిన సేసెను. మఱియు 'ఏ నంగీకరింపకున్నను నా తండ్రి బలాత్కారంబుగ నొక్కని కొసంగు నెడ నప్పు డేను అనశనంబుననో, విషంబుననో, నియతంబుగ దేహంబు దొఱంగుదు.' ననియు నిశ్చయంబు చేసికొనెను. అదివిని చిత్ర

రథుండు కాలంబు గడచుచుండఁ గూఁతుం బరిపూర్ణయౌవ
నం గాంచి చింతాపరవశుండయ్యెయది యొక్క రక్తకయ పుత్రి
యగుట నేమియుఁ జెప్ప వెఱచి యొకయుపాయంబు పన్ని మ
దిరతో నాలోచించి 'మహాశ్వేతా, నీకయి వగచుమాకు నిం
కొకదుఃఖం బుపస్థితం బయ్యె. ఇప్పుడు కాదంబరికి బోధింప
నీవ దిక్కు., అని నాకుఁ జెప్పు మని క్షీరోదుం డనుకంచుకి
నొక్కని నిచ్చటి కనిచెను. అంత నేను గురువచనగౌరవంబు
నను, సఖిప్రేమంబునను 'సఖి, కాదంబరి, దుఃఖించుజనుని
మఱియు దుఃఖపెట్టెద వేల? ఏ జీవించియుండ నిచ్చగించెదే
ని గురువచనం బొనరింపుము., అని చెప్పి యాకంచుకితోఁ ద
రళిక ననిచితి. అది చనిన కొంతదడవునకే నిందుల కరు
దెంచితి, నని వాక్రుచ్చి మిన్నకుండెను.

అంతఁ జంద్రాపీడుఁడు పల్లవశయనంబున శయనించి
'వైశంపాయనుండు నన్ను విడిచి యేమి యాలోచించుచుం
డెనో? పత్రలేఖ యేమి చేయుచుండెనో? రాజపుత్రలోకం బేమి
తలంచుచుండెనోకో?' అని చింతించుచు నిద్రించెను. ఆరాత్రి
కడచన నుషఃకాలంబున మహాశ్వేత లేచి స్నానంబుచేసి జపిం
చుచుండెను. చంద్రాపీడుండును కాల్యకృత్యంబు నిర్వర్తించెను.
అంతఁ దరళిక కేయూరకుం డనుగంధర్వదారకునితో నరుదెం
చి యాతం డెవఁడని చంద్రాపీడుం గాంచుచు మహాశ్వేతయొ
ద్దకు వచ్చి ప్రణమిల్లి సవినయంబుగఁ గూర్చుండెను. పిమ్మటఁ

గేయూరకుండును బ్రణమిల్లి కూర్చుండి చంద్రాపీడుం గాంచి యతని హస్తంబున కచ్చెరువొందుచుండెను. జపంబు పరిసమాప్తినొంద మహాశ్వేత తరళికం గాంచి 'ప్రియసఖ యైనకాదంబరిం గాంచితివా? కుశలంబుగ నున్నదా? నీ వచనరీతి నంగీకరించెనా?' అని యడుగ నాతరళిక యిట్లనియె:—'భర్తృదారిక, కాదంబరిం గాంచితి. కుశలంబున్నది. సకలంబు విన్నవించితి. మద్వచనంబు విని రోదనంబు చేసి కేయూరకునితో నిట్లు చెప్పి పుత్తెంచెను. అతండు వచింపం గలండు.' అని పల్కి యూరకుండెను. అంతఁ గేయూరకుం డిట్లనియె:—'భర్తృదారిక, మహాశ్వేత, కాదంబరీదేవి నీకంఠంబు గౌఁగిలించికొని విన్నవించెడిని. 'ఈతరళిక వచ్చి యెద్ది చెప్పెనో, అద్ది గురువచనంబుం బట్టి చెప్పఁబడియెనా? నాచిత్తంబుం బరీక్షింపనా? గృహంబున నుండి పని నిపుణంబుగఁ జూపించుట యా? భర్తృజనంబును విడుచు నుపాయంబా? ప్రకోపంబా? చెప్పుము, సహజప్రేమనిర్భరం బైన నాహృదయంబు నెఱుంగవా? ఇంత కఠినంబుగ నెట్లు చెప్పి పుత్తెంచితివి, అట్టిమధురభాషిణివి. ఇట్టియప్రియంబుం బరుషంబు నాడ నెచ్చట నేర్చితివి. మనంబు స్నేహార్ద్రకంబున దుఃఖితం బయి యుండ సుఖాన కెట్లు బొడమెడి? సంభోగంబు లెట్టివి? నాప్రియసఖ యిట్టిదశ నొందించినకాముని నే నెట్లు సకామం జేయుదు? నాప్రియసఖి భర్తృవిరహంబున వ్రతకర్శితయయి గొప్పకష్టం బనుభవించుచుండ నేను నాసు

ఖంబు గోరి యెట్లు పాణిగ్రహణంబు చేసికొందును? నాకు సుఖం బెట్లు గల్గు? నీయందలి ప్రేమంబున నిష్కార్యంబువిష యంబునఁ గన్యాజనంబునకుం దగనిస్వాతంత్ర్యంబు నవలంబిం చి యపకీర్తి కొప్పితి. వినయంబుం దెగడితి. గురువచనం బతి క్రమించితి. లజ్జవిడనాడితి. లోకాపవాదంబు సహించితి. మ గుడ నెట్లింమఁ బ్రవర్తింతును? కాన యిదె యంజలి చేసితి. న న్ననుగ్రహింపుము. ఈయర్థంబు మనంబున నుంపకు, మని పల్కి యిన్నకుండెను.

అది విని మహాశ్వేతయుఁ గొంతదడవాలోచించి యేన వచ్చి తగున ట్లాచరింపఁ గల నని పల్కి కేయూరకు ననిపి చంద్రాపీడునితో ని ట్లనియె:— 'రాజపుత్ర, హేమకూటంబు రమణీయంబు. చిత్రరథునిరాజధాని చిత్రంబు. గంధర్వలో కంబు కనుసుందరంబు. కాదంబరి మహానుభావురాలు. అచ్చ టి కేతెంచుట యతిఖేదకరంబు గా దని తలంచెదేని, నీచి త్తం బదృష్టవిషయంబునఁ గౌతుకంబు కలదేని, నీమనంబు నావచనం బాదరించునేని నాయభ్యర్థనంబు నిష్ఫలంబు చేయకుము. నాతోడన హేమకూటంబునకు విచ్చేసి యం దుఁ గాదంబరిం గాంచి నేఁ డచట విశ్రమించి తేపకడవ త్తువుగాక. నిష్కారణబాంధవుండ వైనసీకు వినిపింపఁగనె నాశోకంబు కొంతదీఱినటు లున్నయది. సజ్జనసమాగమం బులు దుఃఖితునింగూడ సుఖపెట్టెడినిగదా?, అన విని చంద్రా

పీడుండిట్లనియె:— 'నీదర్శనంబు మొదలుకొని యేను పరాధీనుండ నైతి. కృత్యంబులన్నియందు నన్ను నిస్సంశయముగ నియోగింపవలయు,' నని పల్కెను.

చంద్రాపీడుండు మహాశ్వేతతో హేమకూటంబు ప్రవేశించుట.

అంతఁ జంద్రాపీడుండు మహాశ్వేతతో నయ్యాశ్రమంబు వెలువడి హేమకూటంబు చేరి గంధర్వనగరంబు సొచ్చి సప్తకక్ష్యాంతరంబులఁ గడచి కన్యాంతఃపురద్వారంబున కేతెంచుటయు మహాశ్వేతం గని ప్రతీహారి దూరంబుననె ప్రణమిల్లి తెరువు వెల్లడించుచుండ లోనఁ బ్రవేశించి 'స్త్రీమయంబైన రెండవజీవలోకంబో, అంగనాద్వీపంబో, యనఁ దనరి, శృంగారమయంబో, సౌందర్యమయంబో, కుసుమశరమయంబో, ఆశ్చర్యమయంబో, సౌకుమార్యమయంబో, ప్రేమమయంబో, యన నొప్పునంతఃపురాభ్యంతరంబుం గాంచెను. అచ్చటికన్యకాజనంబునకు లోచనంబులె కర్ణోత్పలంబులు. హాసితద్యుతులె యంగరాగంబులు. ఆలాపంబులె తంత్రీవినాదంబులు. భుజలతలె చంపకమాలలు. కరతలంబులె లీలాకమలంబులు నగు. అందు నలక్తకరసంబును జరణాతిభారంబు. అంగరాగగౌరవంబును నధికశ్వాసనిమిత్తంబు. అంశుకభారంబును గ్లానికారణంబు. అవతంసకుసుమధారణంబును శ్రమకరంబు. అందు సఖీదర్శనంబునఁ జెయిఁబట్టుకొనక లేచుటయు యతిసాహసంబు. పుష్పావచయంబున రెండవపూవు గోయుట

యువతిజనంబున కనుచితంబు. ఇట్టిసౌకుమార్యసంపదకుఁ దావలం బైనకన్యకాజాలంబుం గనుచు వారలయాలాపంబు లాలించెను 'లవలిక, గేదగిపుప్పొడిచే నీతీవియలకుఁ బాది గట్టుము. రజనికా, చీఁకటిగ్రమ్మఁకుల బాటలలో రతనంపుదివ్వియలం బెట్టుము. కుముదికా, చిలుకలు పొడువకుండ దాడిమీఫలంబులకు ముత్తియంబులం గూర్పుము, నళినికా, రాయంచలకుఁ దమ్మిపూఁదేనియలం ద్రావింపుము. చూతలతికా, పంజరంబులలోనిగంధుకోయిలలకు మామిడిచివుళ్లం దినఁబెట్టుము, మయూరికా, కిన్నరమిథునంబుల సంగీతశాలలకుం బనుపుము.,

అని యొండొరులఁ బిలుచుచుఁదవతులపలుకు లాలించెను. 'చామరికా' మిథ్యాముగ్ధత్వంబు వెలార్చుచు నవ్వనిగూర్చి పో నుద్యమించెదవు? పరిహాసకాంక్షిణి, రతనంపుగోడపైఁ దోఁచునిజప్రతిబింబంబుతో మాటాడె దేల?, అని యిట్టివరిహాసవచనంబు లాలించుచుఁ గాదంబరీభవనసమీపంబునకుం జని యందు మధ్యభాగంబున ననేకసహస్రసఖ్యం బైనకన్యకాజనంబు పరివేష్టింప నల్లనికప్పడంబున నొప్పుసాన్పుపయి నుండి కుబ్జఁగట నున్నకేయూరకుం గాంచి 'అతం డెవ్వాఁడు? ఎవ్వరికుమారుండు? అతనిపే రెయ్యది? రూప మెట్టిది? ఏవయసువాఁడు? ఏమి చెప్పుచున్నాఁడు?- నీ వేమి చెప్పితివి? బాగుగఁజూచితివా? అతనికి మహాశ్వేతతోఁ బరిచయ మెట్లు కల్గెను? ఇటకు వచ్చునా?, అని పలుమారు తనవృత్తాంతం

బ యడుగుచున్న కాదంబరిని గాంచెను. అంత దనమనంబున నిట్లు తలంచెను. 'ఆహా' తన్ను మాలి తక్కటినాయింద్రియ ముల నెల్ల గన్నులగా నేల యొనర్పఁ డాయెను? ఇన్నాతిం జూడ ము న్నీకన్ను లేమి పుణ్యయంబు చేసెనో? ఎంత చిత్రము. అక్కంజభవుం డెల్లసొబగుల కొక్కయిక్క పాదుకొల్పెను., అని పలువితంబులఁ జింతించుచుండ నక్కాంతచూపులు భూపాలుపయిం బడియెను. అంత నమ్మదవతి 'కేయూరకుండు చెప్పినయప్పురుషుం డితండ, యని యెంచి యతనిరూపాతిశయంబున కచ్చెరు వొందుచుండెను.

కాదంబరి చంద్రాపీడుని గాంచుట.

అటు లక్కాదంబరీకటాక్షవీక్షణంబు పయింబడినయాక్షణంబున రాజనందనుండు వివశుండయి యబలునివలె నుండెను. ఆరాకుమారు విలోకింపఁగ నెమ్మున్ను రోమాంచంబును, పిదప భూషణరవమ్మును, పదంపడి కాదంబరియు నుద్గమించెను. అంత నమ్మగునకుఁ గుసుమాయుధుండె చెమ్మట కతి నించెను. అయినను నతని నెమరొక్కనుటాంబాడమిన బడలికయె నెపం బాయెను. ఊరుకంపంబ గతిని నిరోధించెను. అందియలనాదు విని యేతెంచినరాయంచపిండు వాడు గట్టుకొని యెను. బెట్టునిట్టూర్పులై పయ్యెదం గదలించెను. చామరానిలంబు నిమిత్తం బాయెను. ఆనందంబె కన్నీరుం గురిపించెను. దానికిఁ జెవికొనతమ్మిపూఁదుమ్ము వ్యపదేశం బాయెను. లజ్జ

ఱె మాటాడనీయదాయె. అద్దానికి మోముదమ్మి నెత్తావి కరుదెంచిన తేఁటిగమియె దూఱున శగ్గ మయ్యెను. ఇట్లు మారవికారంబులం బలుతెఱంగుల నయ్యంగన చెంగునంతఁ జంద్రాపీడుండును హృదయప్రవేశంబు పరిగ్రహంబుగ లెక్కించెను. భూషణరవమ్మును సంభాషణమ్ముగఁ దలంచెను. సర్వేంద్రియాకర్షణమ్మును ననుగ్రహమ్ముగ నెంచెను. దేహకాంతిసంపర్కంబును సమాగమంబుగఁ గల్పించెను. కాదంబరియుఁ గష్టంబుగఁ గొన్నియడుగు లిడి మహాశ్వేతం గౌఁగిలించికొనియెను. మహాశ్వేతయు నట్లె కౌఁగిలించుకొని యిట్లనియె:—‘సఖి, కాదంబరి, భారతవర్షంబున రక్షితప్రజాపీడుం డగు తారాపీడుం డను రాజన్యుండు కలఁడు. అతనికిఁ బరిహృతవిశ్వంభరాపీడుం డైనయీచంద్రాపీడుండు కొమరుండు. ఇతండు దిగ్విజయప్రసంగవశంబున నీభూమికి వచ్చెను. కనఁబడినది మొదలీయనఘుండు స్వభావంబున నాకు నిష్కారణబాంధవుండయి తనగుణంబులచే సకలసంగంబులఁ ద్యజించి యున్నదైన నాచిత్తవృత్తి నాఁచికొనియె. దాక్షిణ్యపరవశుం డైనయకారణమిత్రుండు దొరకు టరిది. నావలెఁ నీవును తమ్మిచూలిసృష్టికౌశలంబును, పుడమిపడతి తగినతేనిఁ బడసియుండుటను, మర్త్యలోకంబు సురలోకంబుకన్న మిన్న యగుటను, మనుజాంగనాదృష్టులసాఫల్యంబును, సకలవిద్యలప్రాభవంబును, మానవులనాగరికతను దెలిసి యగ్గింపగలవని యిచ్చటికి విచ్చేయవేఁడి తోడితె

చ్చితి. నిన్ను గుఱించి యీతనికిఁ బలుదెఱంగుల విన్నవించి యుంటిని. కాన మున్ను కన్నవాఁడు కాఁడని లజ్జింపక, అపరిచితుం డని యవిశ్వాసంబు గొనక, అజ్ఞాతశీలుం డని సంశయింపక నాయందుంబలె నితనియందు వర్తింపవలయు. ఇతండు నీకు మిత్త్రుండును, బాంధవుండును నగు.,' అని నివేదింపఁ జంద్రాపీడుండు ప్రణమిల్లెను. ప్రణమిల్లునాతని సస్నేహంబుగఁ గాంచునప్పుడు కాదంబరికనుదమ్ములనుండి యానందబాష్పంబు దొరఁగెను. త్వరితంబుగ నెదుర్కొనుదెందంబురజంబో యనఁ జిఱునగవు వెలసెను. కాదంబరియు సలీలంబుగఁ బ్రతిప్రణామంబు చేసిమహాశ్వేతతోఁ బర్యంకంబునఁ గూర్చుండఁ బరిచరులు గొనివచ్చియునిచినపీఠంబునఁ జంద్రాపీడుం డుపవిష్టుం డాయెను. కాదంబరీచిత్తవృత్తి నెఱింగి ప్రతీహారులు వేణురవంబులను, వీణాఘోషంబులను, గీతధ్వనులను నంతటను వారించిరి. మహాశ్వేతయుఁ గాదంబరి ననామయం బడిగెను. దాని కాయతివ తాను గృహంబున నున్నయపరాధంబున లజ్జించి కుశలంబు కష్టంబుగఁ జెప్పెను. అప్పు డాయన్నువ మహాశ్వేతతో సంభాషించుచున్నను కడకంటిచూపులచేఁ జంద్రాపీడునినె కాంచుచు నతనిపయిఁ బర్వినచూడ్కి మరల్పఁ జాలకుండెను. అంత ముహూర్తమాత్త్రంబున మహాశ్వేతకుఁ దాంబూలంబు నొసఁగ నుద్యమించుటయు నాయమ కాదంబరితో నిట్లనియె:—'సఖి, కాదంబరి, మన కందఱకును గ్రొత్తగ వ

చ్చిన చంద్రాపీడుండు పూజనీయుండు. కాన యీతని కొసంగుము., అనుటయు మోము వాంచి మెల్లఁగ 'ప్రియసఖి, పరిచయంబు లేమిం జేసి నాకు లజ్జ పొడమెడిని. నీవ కైకొని యీయన కొసంగుము., అని పలికి యాయమచే బలుమాఱు బోధింపఁబడి యియ్యకొని మహాశ్వేత మొగంబున నునిచినతన చూడ్కి మరల్పక యొడలు వడవడ వడఁక బెట్టుగ నిట్టూర్పుచు, చెమ్మట గ్రమ్మ, స్వేదజలంబున మునుంగుచు ననుభయంబునఁ జెయిఁ బట్టుకొను మని యాచించుదానివలెఁ దాంబూలగర్భం బైన హస్తపల్లవంబు సాఁచెను. చంద్రాపీడుండును విజయగజకుంభసమ్మర్శంబున సిందూరం బంటె ననఁ బాటలంబయి, స్పర్శలోభంబున సరాగంబయి, యొక్కచోఁ జేరినదై దగునింద్రియవృత్తు లో యనఁదగు వ్రేళ్లతో నొప్పు పాణికమలంబుం జాఁచెను. అప్పుడు తత్కాలసులభంబులైన విలాసంబులఁ జూడ వేడుకపడియెనన నెటనుండియో వచ్చి సకలరసంబు లామదనవతి నధిష్ఠించెను. అంతఁ గాదంబరి కంపంబునం గదలుకడియంబులయొలివున సంభాషించుచుండెనన నొప్పుహస్తంబుచే స్వేదసలిలదానపూర్వకంబుగ మదనునిచే నీదాసజనం బొసంగఁ బడియె నని ప్రతిగ్రహింపఁ జేసెనో యనఁగను, ఇది మొదలుకొని నీహస్తంబున నుండు నని జీవితంబు నునిచెడినో యనఁగను దమ్ములం బొసంగెను. అప్పుడు తనకరకిసలయంబు ముడుఁచుచు హృదయంబుంబలె పడిపోయిన మణివలయం

బునెఱుంగదాయె. వేఱొండుతాంబూలంబు గైకొని మహా
శ్వేత కొసంగెను.

చిలుకగోర్వంకలసంవాదము.

అంతలో శీఘ్రంబున నొకశుకంబువెంబడి శారిక యొ
క్కండు వచ్చి సక్రోధంబుగ నీ ట్లనియె:— 'భర్తృదారిక '
కాదంబరి, సుభగమ్మన్యుండై దుర్వినీతుండై నయీవిహంగ
మాపశదు నేల వారింపవు? వీనిచేఁ బరిభవింపఁబడుచున్న ను
పేక్షించితేని యంత నే నిక్కంబు గఁ బ్రాణంబులు విడిచెద.
నీపాదంబు లాన, అనుటయుఁ గాదంబరి యలతినవ్వు నగియెను.
మహాశ్వేత యేదియు నెఱుంగక 'ఇది' యేమి,, అని మదలేఖ
నడుగ నమ్మగువ యి ట్లనియె:— 'కాళింది యనునీగోర్వంక
కును' పరిహాసనామకుం డైనయీచిలుకతేనికినిఁ గాదంబరియె
పెండిలి చేసెను. నేఁడు వేకువఁ గాదంబరియడపకత్తె యైనత
మాలికతో నేకాంతంబున నేమియొ శుకరాజు మాటాడుచుం
డం గాంచి యది మొదలీగోర్వంక యసూయపడి కినిసి ఢా
నిం జేరదు. దానితో మాటాడదు. దానిని స్పృశింపదు.
దానిం జూడదు. ఏ మ్మందఱము నెంతసెప్పినను నాలింపదు.
అని మదలేఖ చెప్పిన విని చంద్రాపీడుండు ముసిముసి నగవున
ని ట్లనియె:— 'అవు నవు నీవార్త వినవచ్చుచునె యున్నది.
రాజకులంబునను బరిజను లిద్దియె యాలోచించుచున్నారు. పరి
హాసనామకకీరపతి తమాలికం గామించి కామపరవశుండయి

దినంబులు గడచుటయు నెఱుంగఁ, దని యేనును విని యుంటి ని. పరిత్యక్తనిజకళత్రుం డైనవీనిమాట యటుండుఁగాక. చపల యైనదుష్టదాసిని వారింపకుండుట కాదంబరికిం దగునా? మొద లీకాళింది నిట్టిదుష్టశుకంబున కేల యిచ్చెను? ఇప్పు డిది యేమి చేయును? సవతితనం బన్ననో యువతులకుఁ బ్రధానం బైనకో పకారణంబు. గొప్పవివాదహేతువు. మిక్కుటం బైనపరాభవ స్థానంబు. మఱియుఁ దనదౌర్భాగ్యయోగంబున వైరాగ్యంబు నొంది విషంబు మెసవియో? చిచ్చునం జొచ్చియో? అనశనం బంగీకరించియో? యసువులఁ దొఱంగకుంటఁ జూడ నీకా ళిందియ యతిధీర యని చెప్ప నొప్పును. మానవతుల కిట్టిలా ఘవకరం బింకొకండు లేదు. ఇట్టియపరాధంబునను నిది క్ర మ్మఱఁ జిలుకం గూడెనేని నీమానహీనను దూరంబుగ విడువ వలయు. మగుడ దీని నెవ్వఁడు మాటాడించును? దీని నెవ్వఁడు కాంచును? వీనిపే రెవ్వఁడు తలంచును?, అనుచు, గ్రీడాలాప భావం బెఱింగి యచ్చటివిలాసిను లందఱు నవ్విరి. అతనిసర్మ భాషితం బాలించి పరిహాసకుం డిట్లనియె:— 'ధూర్త' రా జపుత్త్రి, యీశారిక నిపుణురాలు. నీవుగాని, ఇంకొకండుగాని దీని వంచిపనేరరు. ఇట్టివక్రోక్తులజాడ నిదియు నెఱుంగఁగల దు. ఇదియుఁ బరిహాసవచనంబుల నెఱుంగు. దీనిబుద్ధియు రా జకులసంసర్గంబునఁ జాతుర్యంబు గాంచినదియే. ఈమంజుభాషి ణి కోపప్రసాదంబులకుఁ గాలంబును, గారణంబును, ప్రమాణం

బును, విషయంబును, ప్రస్తావంబును నెఱింగినదియ. వక్రభా
షితంబుల కిది నెలవు కాదు. విరమింపుము.' అనుటయు నం
తలో నొకకంచుకి యేతెంచి మహాశ్వేత నవలోకించి 'ఆయు
ష్మతి, చిత్రరథదేవుండును, మదిరాదేవియు నిన్నుఁ జూడఁగోరి
పిలుచుకొని రమ్మని నన్ను బుత్తెంచిరి.' అని విన్నవించుట
యుఁ జన నెంచి. మహాశ్వేత 'సఖీ, నావచ్చు నందాక చంద్రాపీ
డుం డెక్కడ నుండ నగు,' నని యడుగ కాదంబరియు 'ననేక
సహస్రంబు లైనవిలాసినీహృదయంబుల మెలంగునితని కొక్క
మనికి యే' లని మనంబున నగి ప్రకాశంబుగ ని ట్లనియె:—
'సఖి, మహాశ్వేతా? ఇట్టు లడిగెద వేల? ఈతనిఁ గనుంగొనిన
నాటంగోలె నీశరీరంబునకు నితండ యొడయం డన నింక భవ
నంబునకు విభవంబునకుఁ, బరిజనంబునకును నేమి చెప్పవలయు?
అతనికిఁగాని, నీకుఁగాని యెందు రుచించునో అందయుండ
నగు' నన విని మహాశ్వేత 'నీప్రాసాదంబు సమీపంబున నున్న
ప్రమదవనంబునఁ గ్రీడాపర్వతకమణివేశ్మంబున నిలుపు,' మని
చెప్పి గంధర్వరాజుం జూడ నరిగెను. చంద్రాపీడుండును కే
యూరకుండు దారి చూపుచుండఁ గాదంబరి యనిపిన గీతవాది
త్రాదికుశల లైనకన్యకలతో మణిమందిరంబునకరిగెను.

కాదంబరి తనభావంబు వెల్లడి యయ్యె నని వగచుట.

అంత గంధర్వరాజనందన సకల మైనసఖీజనంబును,
బరిజనంబును విడిచి పరిమితపరిచారికలతో మేడ నెక్కి యం

డుఁ దనశయనతలంబునం బరుండి 'చపలా? ఇది యేమి యా
రంభించితి' వని లజ్జచే నిగ్రహింపఁ బడు నట్లును, 'స్వైరిణీ, య
థేచ్ఛంబుగ నవినయం బాచరింపకు, మని కౌమారంబుచే బో
ధింపఁబడునట్లును, 'దుర్వినీతా' ఈయనాచారంబు దొఱంగు,
మని యాచారంబుచే శిక్షింపబడునట్లును, 'మూఢా' మదను
నిచే లాఘవంబునొందింపఁబడితివి, నిగ్రహింపు, మని కులం
బుచే నిందింపఁబడునట్లును నధిక మైనలజ్జ నూని తనలో నిట్లు
చింతించెను. 'ఆహా! ఏను మోహాంధనయి యేమి చేసితి?
సాహసికురాలనయి ఈజనుం డపరిచితుం డని శంకింపనైతి.
నిర్లజ్జనై లోకంబు నిందించు నని తలంపనైతి. మూఢనయి ఈ
తనిచిత్తవృత్తి యెట్టిదని విచారింప నైతి. చపలనయి ఈతనికిఁ
గనబడ నగునా యని యాలోచింప నైతి. మఱియు నిర్దాక్షి
ణ్యనయి మహాశ్వేత దుఃఖిత యని యపేక్షింప నైతి. మంద
మతినయి సమీపమున నున్నసఖీజనంబు కని పెట్టు నని యెన్న
నైతి. నష్టచిత్తనయి ప్రక్కన నున్న పరిజనంబు గాంచు నని పరి
కింప నైతి. స్థూలబుద్ధులును నట్టియవినయం బూహింతు రన
మదనవేదన ననుభవించినమహాశ్వేతయు, సకలకలాకుశల లగు
సఖులును, రాజకులసంచారచతురంబయి, ఇంగితజ్ఞం బైనపరి
జనంబును నెఱుంగుదు రనిచెప్పవలయునె? అన్నివిధంబులఁ జె
డితి. నాకిప్పుడు మరణంబ శ్రేయంబుగాని లజ్జాకరం బైనజీవి
తంబు శ్రేయంబు గాదు. ఈవృత్తాంతంబు విని తల్లియు, దం

ద్రిడియు, గంధర్వవృద్ధులును నే మనువారల్లో? ఏమి సేయు దు? ఏయుపాయంబున నీనేర్మంబు మఱుఁగుపఱుతును? మహా శ్వేతయలమట తొలఁగునంతదాక నేను కన్నియతనంబున నుం దునని నెచ్చెలులయెదుట ప్రతిన చేసితినే! ము న్నే న్నడును గని విని యెఱుంగనియీాతం డెందుండి వచ్చెను, మదనుండు తోడ్కొనివచ్చెనో? నాతొలుమేనిదొసంగులు తోడితెచ్చెనో? మృత్యువు గొనివచ్చెనో యెఱుంగ. ఆతనిఁ గన్నమాత్రంబున యింద్రియంబులచేఁ గట్టి యొసఁగఁ బడినయట్లును, మదనుని చే పంజరమున నునిచి యర్పింపఁబడినవిధంబునను, అనురాగ ముచే దాసినిగాఁజేసి యొప్పగింపఁబడినపగిదిని నైతి. నాకాచ పలునితో నేమి? అని క్షణమాత్రము తలఁచెను.

అనంతరము 'మిథ్యావినీతా! నాతోఁ బనిలేనియెడ నిదిగోఁబోవుచున్నాఁడ, నని యంతర్గతుం డైనచంద్రాపీడునిచేఁ బరిహరింపఁ బడినట్లును, ఆతనివిడువ నెంచినప్పుడ కంఠలగ్నం బై నజీవితంబుచేఁ జెప్పఁబడినవిధంబునను, నీకై ర్యావలేపంబునను సుఖలతోడ వెడలింతు నని మనోభవునిచే నదలింపఁబడినప గిదిని, గ్రమ్మఱ తనడెందంబు చంద్రాపీడున కభిముఖంబు బగు టయుఁ బరవశయయి లేచి గవాక్షంబువలన నతం డున్న క్రీడాపర్వతంబుం గాంచుచుండెను. అందుండి యాయకివ 'యానందబాష్పం బడ్డగించునని వేఱచెననఁ గన్నులం జూ డక మతిచేఁ గాంచెను. వ్రేళ్ళనుండి గాఱుచెమ్మట పడునని

భీతి నొందెననఁ జిత్రతూలికచే వ్రాయక చింతచే లిఖించెను. ఆతనిసమాగమంబునకుఁ గాలాతిపాతంబు సహింపదనఁ బరిజనంబుం బనుపక మనంబుం బనిచెను. చంద్రాపీడుండును కాదంబరి రెండవకొండం బనఁ దనరుమణిభవనంబునఁ బ్రవేశించి యందు సుందరశిలాతలంబునఁ బఱచియుండినమెత్తపయి నత్తమిల్లి కేయూరకుండు తనపాదంబు లొత్తుచుండ గంధర్వకన్యక లాయూయిచోట్లం గూర్చుండి యుండ డోలాయమానం బైనతనచిత్తంబున నిట్లు చింతించెను.

చంద్రాపీడుండు కాదంబరి భావం బెఱుంగక చింతించుట.

ఇక్కాదంబరికి సాజంబు లైనవిలాసంబులె యిట్లు సకలలోకమనోహరంబు లొకో? అట్లుగాక మదనునిచే నాయందు నియోగింపఁ బడియెడు గాంబోలు. కానిచో సాస్రంబును, సరాగంబునైన దృష్టిచే నన్నుఁ గాంచి యేను జూడ సిబ్బితిగొని వెలిపుట్టంబునంబలెఁ జిఱునగవునం దన్నుఁగప్పుకొనునే? లజ్జచే మోమువ్వలకుఁ ద్రిప్పి నా ప్రతిబింబప్రవేశమునం దాసనోయస జెక్కుటద్దంబు నర్పించునే? నాకవకాశం బిడినహృదయంబునకు మొదటివినయలేఖను వ్రాయునస శయనంబుపయి కరరుహంబున వ్రాయుచుండునే? అట్లు గాదు. మానుషజాతిసులభం బైనలాఘవంబొకో? లుప్తవివేకం బైనయౌవనమదంబొకో? మదనుండొకో? మిథ్యాసంకల్పంబులచే నన్నాయాసపఱిచి వంచించునట్లు దోఁచెడిని.తిమిరోపహాతంబోయనఁ గోడెకాంద్రదృ

ష్టియల్పకలుషంబును నెక్కువగా భావించును. స్నేహలవంబును జలంబుచేతంబలె యౌవనమద్దంబుచే దూరంబునకుఁ గొనిపో వంబడును. చాంచల్యంబు కవిచిత్తంబువలె స్వకల్పితచింతాశతాకులంబయి దేని నుత్ప్రేక్షింపదు? ఈవట్టి చింతలతో నేమి? నిజంబుగనిక్కాదంబరి నాయందు భావంబు గలదియేని భావజుండె యయ్యది ప్రకటీకరించి నాసంశయంబు వాపఁగలండు. అని నిశ్చయించి లేచి కూర్చుండి యక్కన్నియలంగూడి వీణాగానాదిగోష్ఠిం గొంతకాలం బుండి యటనుండిలేచి యుపవనంబుఁ జూడ నెంచి క్రీడాపర్వతంబుపై నెక్కెను.

కాదంబరియు నతనింగాంచి 'మహాశ్వేత రాక మసలె, నని నెపంబిడి యాయమ తెరువుచూచుదానివలె సౌధశిఖరం బెక్కి యచట పలుమాఱు గొడుగుకాడఁ బట్టుకొనియు, పలుమాఱుఁ దమాలికమూపున కరంబు లునిచియు, పలుమాఱు నెచ్చెలిం గౌఁగిలించికొనియు రాకుమారుఁ గాంచియు నతనిచే జూడఁబడియుఁ బ్రొద్దు వోవుటయుం దెలియక వినోదించుచుండ నొకప్రతీహారి వచ్చి మహాశ్వేత వచ్చె, నన విని సౌధంబు దిగి స్నానాదులపైఁ దన కిచ్చ లేకున్నను మహాశ్వేతానిరోధంబున దివసకృత్యంబు దీర్చుకొనియెను. చంద్రాపీడుండును నక్కొండదిగి స్నానంబు, దేవతార్చనంబు, నాహారంబును, నిర్వర్తించి యట సంగీతగృహంబున మరకతశిలాతలంబున నుపవిష్టుండయి యుండునంత 'పాలమున్నీటిచేఁ బు

దమి దేలింపంబడియెనో? చందనరసంబుచే దిగంతంబులు ద
దుపంబడియెనో? చందురుండుదయించెనో, యన ధవళప్రకా
శంబుం గాంచి కుతూహలంబున నద్దెసంజూచుచుండెను.

మదలేఖాతరళికలు చంద్రాపీడునొద్దకు వచ్చుట.

అంత బెత్తంబును, గంధపుగిన్నెయుఁ గొని ప్రతీహారి
యు, పాముకుబుసంబువలె వెల్లనై యూఁదినం బౌఁబు కల్పల
తామకూలంబులం బట్టుకొని కేయూరకుండు దారిఁ జూపు
చుండ, జాజిపూదండం గైకొని తమాలిక వెంటరా ననేకక
న్యకాజనంబుం గూడి ఛత్రచామర విరాజితయై యేతెంచిన
మదలేఖను, నాయుమచెంగట నున్నతరళిక నుం గాంచెను.
ఆతరళికాకరంబునఁ జంద్రునితోఁబుట్టువో? శ్రీదేవిహాసంబో,
సర్వరత్నంబుల గురువో? ఒక్కచోఁగుంపుగూడినయశోరాశి
యో? యనఁ దనరుహారంబుం గాంచి యేను గనినదెలిచాయ
కిద్దియె కారణంబని యెంచి ప్రత్యుత్థానాదులచే మదలేఖం
గారవించెను.

మదలేఖ కాదంబరిపంచినశేషహారంబుం జంద్రాపీడున కొసంగుట.

ఆమదలేఖయు మరకతశిలాతల్పంబునఁ గొంతదడవు
గూర్చుండి తానలేచి చందనం బలఁది, మాలతీకుసుమమాలిక
సిగకుఁ జుట్టి వెలిదువ్వలువ నొసఁగి హారంబు చేఁగొని చంద్రా
పీడునితో ని ట్లనియె :—'రాజకుమార' నీదురూపం బేజ
నునిఁ బ్రీతిపరవశునిం గావింపదు? ఈయాకృతిచే నెవ్వానికి

జీవితేశ్వరుండవు గావు? ఆకారణవత్సలం బైననీచరితం బెవ్వారికి బంధుత్వంబు నారోపింపదు? ప్రకృతిమధురం బైననీవ్యవహారం బెవ్వనికిం జెలికారంబు గూర్పదు? సహజకోమలంబులైననీగుణంబుల కెవ్వారు కట్టువడరు? ప్రథమదర్శనంబునన విశ్వాసంబు గలిగించిననీమూర్తినె యుపాలంభింపవలయు. ఇట్లు సద్గుణాలవాలంబ వైననీయెడ నే మొనరించునుపచారంబెయనుచితం బని తోంచెడిని. ఎటులన, సంభాషణంబును దిరస్కారంబును సూచించును. ఆదరంబును బ్రభుత్వాభిమానంబు ననుమానింపం జేయును. ఉపచారంబును జపలత్వంబు వెలివుచ్చును. విజ్ఞాపనంబును బ్రాగల్భ్యంబును దెలుపును. దానంబును బరిభవంబ యగు. తనంతన మనంబునె గ్రహించినజీవితేశ్వరున కేమి యర్పింప నగు? రాకచేతన మహోపకారంబు చేసిననీకుం బ్రత్యుపకారం బేమి సేయం గలము. దర్శనం బొసంగి మాజీవితంబు సఫలంబు సేసిన నీయాగమనం బెద్దానిచే సఫలం బగు. కాదంబరీదేవి యిట్లు తన కూర్మిం జూపెం గాని తనవిభవంబుం గాదు. ఆకన్నియ నీదాస్యమున కంగీకరించియు నకార్యకారిణి కాదు. తన్నె నీకొసంగియు మానసపోవదు. జీవితంబు నర్పించియుం బశ్చాత్తాపంబు నొందదు. కాదంబరీదేవి దీనిచే నిజంబుగ నీయం దపరాధంబు చేసినదానింగాం దన్ను నెన్నుచున్నది. కాన యిద్దిక్షీరసముద్రంబున సర్వరత్నంబుల నుద్ధరింప శేషించెనుగాన శేషహారం బనిప్రసిద్ధి

గాంచెను. దీనిం జలనిధి వరుణున కర్పించెను. వరుణుండును గంధర్వరాజున కొసంగెను. అతండును గాదంబరి కిడెను. ఆయ మయు సుధాసూతికి గగనతలంబు యుచితం బైనపగిది నిద్దానికి నీతనువె యుచితం బని యెంచి పనిచెను. మిముంబోటిసుగుణాభరణులు బరువుచే నైనయట్టియాభరణంబులం దాల్పరు. ఐన నిందుఁ గాదంబరిప్రీతియె కారణంబు భగవంతుఁ డగు శార్ఙ్గపాణి లక్ష్మికి దోఁబుట్టువని యెంచి యురంబునఁ గౌస్తుభం బనుశిలాశకలంబుం దాల్పఁడె? కాన యీబహుమానం బాదరంబున గ్రహింప నగును. నీ విద్దాని నూల్కొనకుండు వేని యక్కాదంబరి మహాశ్వేత నుపాలంభంబులచే నాయాసపఱిచి తనువు దొఱంగును. దానన మహాశ్వేతయు నిట్లు చెప్పి యీ హారంబుం దరళిక కొసఁగి పంపెను. మహాభాగ, కాదంబరి ప్రథమప్రణయంబు భంగంబు సేయకు, మని పలికి యాహారంబు నతనివక్షస్థలంబున నర్పించెను. అత్తఱిఁ జంద్రాపీడుం డచ్చెరువొంది, సబహుమానంబుగ ని ట్లనియె:—'మదలేఖా' మాటాడుట కెడ మియ్యక కిట్లొప్పికోలు గావించిన నీజాణతనం బే మనవచ్చు?. ముగ్ధా, సౌజన్యయుత లైననీకుఁ బరతంత్రుండ నైననాకు గ్రహింపనుగాని, గ్రహింపకుంటకుగాని స్వాతంత్ర్యం బెక్కడిది? కావున నిష్టానిష్టంబు లైన వ్యాపారంబుల యందు యథేష్టంబుగ నియోగింపనగు, కాదంబరిగుణంబు లెవ్వని దాసునిఁగాఁ జేయవు?' అని సాదరంబుగఁ బల్కి వారల

ననిచెను. అంతఁ గాదంబరి చంద్రాపీడుం జూడనెంచి సౌధశి
ఖరంబు నధిష్ఠించి ప్రోద్గ్రీవయై నంతకు ననేకరసభంగులతోఁ
జంద్రాపీడునవలోకించుచుండెను. అంతఁ గనుఁజీకటి వడుటయు
సౌధశిఖరంబుననుండి కాదంబరియు, క్రీడాపర్వతంబుననుండి
చంద్రాపీడుండును దిగిరి. అంతఁ జంద్రుం డుదయించెను. అ
ప్పుడు చంద్రాపీడుండు కాదంబరిపరిజనులు చూపిన చంద్రశీత
లం బైనముక్తాశిలాతలంబున గూర్చుండెను. అంతలోఁ గేయూ
రకుండు వచ్చి 'కాదంబరీదేవి దేవరం జూడవచ్చె' నని విన్న
వించెను. అంతఁ జంద్రాపీడుండు ససంభ్రమంబుగ లేచి తత్కా
లరమణీయం బైనవేషంబుతో సాక్షాత్కరించిన చంద్రోద
యదేవతయో యన మదలేఖాహస్తపల్లవం బవలంబించి వచ్చి
నకాదంబరిం గాంచెను. గంధర్వరాజకన్యయుఁ బ్రీతినిఁ గనఁ
బఱచుచు భూతలంబునను గూర్చుండెను. అందఱును గూర్చుం
డ క్షణం బుండి చంద్రాపీడుం డి ట్లనియె:—

చంద్రాపీడుండు కాదంబరితో నుపచారోక్తు లాడుట.

'దేవి' దృష్టిపాతమాత్రంబున సంతసించుదాసజనుని
యందు సంభాషణంబులోనగు ప్రసాదంబునకు యవకాశంబులే
దన నింతటియనుగ్రహంబున కేమి చెప్పవలయు? ఈ యను
గ్రహాతిశయంబునకు మూలం బైనగుణలవంబు నెంతచింతించియు
నాయందుఁ గానను. క్రొత్తగ వచ్చినసేవకజనునందును నిటు
లుండ నీసౌజన్యం బతిదారాళంబు. ఆజ్ఞసేయ నగుభృత్యునం

దాదరం బేల ? ఇది శరీరము. ఇయ్యది జీవితము. ఇయ్యవి యింద్రియంబులు. వీనిలో నేద్దేనిం బరిగ్రహించి యనుగ్రహింపుము., అని మఱువుచంద్రాపీడుని వచనంబుల నాక్షేపించి మదలేఖ చిఱున వ్వొలయ ని ట్లనియె:— ‹ రాజకుమార, ఇట్టి యుపచారోక్తులచేఁ గాదంబరి సిగ్గరియయి ఖేద మొందెడిని. ఏల యిట్లు పలుకవలయు. ? ఇట్టియుపచారోక్తులచేఁ గాదంబరిచిత్తంబు సంశయాయత్తంబగును. కాన నుడుగుము., అనుటయుఁ గాదంబరి కొంతకాలముండి ‹ తారాపీడుండు కుశలుండె ? విలాసవతీదేవికి సేమంబె ? శుకనాసునకు లగ్గె ? ఉజ్జయిని యెంతదూరము ? భారతవర్షం బెట్టులుండును ? మర్త్యలోకంబు రమణీయంబుగనుండునా ?, అని యడిగి యిట్టివార్తలతోఁ గొంతదడ వుండి కేయూరకుని చంద్రాపీడునొద్దఁ - బరుండని యోగించి శయనసౌధంబు నధిష్ఠించి శయనతలం బలంకరించెను. చంద్రాపీడుం డట శయనించి కాదంబరినిరభిమానిత్వంబును, మహాశ్వేతయకారణవాత్సల్యంబును, మదలేఖసౌజన్యంబును, గంధర్వలోకంబునతిసమృద్ధియు మనంబునఁ దలంచుచుఁ, గేయూరకుండుఁ బాదంబు లొత్తుచుండ నారేయి క్షణమాత్రంబుగ గడపెను. పదంపడి చంద్రాపీడుండు లేచి కాల్యకృత్యంబులఁ దీర్చికొని ‹ కేయూరక, కాదంబరి మేల్కాంచెనా ? ఎచ్చట నున్నది?, అని యడుగ నతం డరిగి కనుఁగొని వచ్చి ‹ దేవ,

మందరప్రాసాదంబు ముంగిటితిన్నియపయి మహాశ్వేతతోఁ గూడ నున్నది., అని నివేదింప గంధర్వరాజపుత్త్రి నవలోకింప నరిగెను. రాజపుత్త్రుండు సమీపించి యం దున్న పీఠంబునఁ గూర్చుండి కొంతకాలం బుండి చిఱున వ్రాలయు మహాశ్వేత మొగంబు గాంచుటయు నాయమ యాతనిభావం బెఱిఁగి కాదంబరితో ని ట్లనియె:— 'సఖీ, చంద్రమయూఖంబులచేఁ జంద్రకాంతంబువగిది నీగుణంబులచేఁ జంద్రాపీడుం డార్ద్రహృదయుండయి వచింపఁ జాలకున్న వాఁడు. కాని మగిడిపోఁ దలఁచియున్నాఁడు. వెనుక రాజచక్రం బీతనివృత్తాంతంబు దెలియక దుఃఖించుచుండును. ఇదిమొదలు మీకు కమలినీకమల బాంధవులకుంబలెను, కుముదినీకుముద బాంధవులకుంబలెను ప్రీతి స్థిరంబుగ నుండుత,' మనుటయుఁ గాదంబరి 'సఖి, మహాశ్వేతా, ఏను పరిజనంబుతోఁ జిత్తంబువలె రాకుమారున కధీనురాలను. ఇం దనురోధం బేమి?, అని పలికి గంధర్వకుమారులం బిలిచి రాజసుతుని నిజభూమిం జేర్చుఁ డని యాదేశించెను.

అంతఁ జంద్రాపీడుండును లేచి మహాశ్వేతకుఁ బ్రణమిల్లి దేవి, బహుభాషిని లోకంబు విశ్వసింపదు. పరిజనప్రస్తావంబులయం దీజనుని స్మరింపవలయు., నని పలికి హేమకూటంబు వెలువడి మహాశ్వేతాశ్రమంబునకు వచ్చి యింద్రాయుధంబు నడుగులజాడ నేతెంచి యచ్ఛోదసరస్తీరంబున నున్నతనసైన్యంబుం గాంచి గంధర్వకుమారుల ననిచి యానందంబునను,

విస్మయంబునను నందలిజనులు ప్రణమిల్లుచుండ నిజశిబిరంబున కరిగెను. అందు రాజలోకంబునకు దర్శనం బొసంగి వైశంపాయనునితోడను, పత్రలేఖతోడను మహాశ్వేత యిట్టిది. కాదంబరియిట్టిది. మదలేఖ యిట్టి దని యెన్నుచుఁ బవలు గడచెను. కాదంబరీరూపదర్శనంబున నసూయ గొనియె ననఁ దొల్లింటి వలె రాజలక్ష్మి యితనికిఁ బ్రీతి నొసంగ దాయెను. కాదంబరిం జింతించుచు మేల్కాంచి యుండఁగనె యెట్లో రేయియుం గడచెను.

కేయూరకుండు చంద్రాపీడునకుఁ గాదంబరి విరహవేదన విన్నవించుట.

మఱునాఁడు చంద్రాపీడుండక్కన్నియనె మనంబునఁ దలంచుచుఁ బేరోలగంబుండఁ బ్రతీహారునితోడఁ బ్రవేశించుచు దూరంబునన యుండి ప్రణమిల్లు కేయూరకుం గని 'రమ్ము రమ్మ'ని చేరం బిలిచి కౌఁగిలించికొని 'కేయూరక' సఖీజనంబుతోఁ గాదంబరియు, మహాశ్వేతయుఁ గుశలంబున్నవారె?' యని యడుగ నతండు ప్రణమిల్లి యిట్లనియె:—'దేవర వారాయము నిట్లడుగుట నిప్పుడక్కుమారి కుశలవతి' యని పనికి తమ్మితూఁటిదారంబునఁ గట్టఁబడ్డినకమలదళసంపుటంబు విచ్చి యందలి పాలపోకలను, దాంబూలీదళంబులను, కర్పూరంబును, మలయజవిలేపనంబునుం గనఁబఱిచి 'ఇయ్యవి కాదంబరి యనిచియడియాలములు' లని విన్నవించి యంతనిలువక 'దేవ' కాదంబరీదేవి దోసిలియొగ్గి దేవరవారినర్చించెను. మ

హాశ్వేత యిట్లు చెప్పి ప్రశ్నించెను. 'రాకుమార, సముత్తుం బునఁ దుహినశీతలంబులయి చంద్రమయంబులపోలె నున్ననీ గుణంబులు నీవియోగంబున సూర్యమయంబులపోలె సంతా పంబు గలిగించెడిని. కాన నిన్నుఁ జూడనివారె ధన్యులు. నీ వరిగినపిదప గంధర్వరాజనగరంబు మహోత్సవంబు గడచి నపదంపడి విచ్ఛాయం బయిన తెఱంగునం దోఁచెడిని. అమృ తోత్పత్తివాసరంబులంబోలు వెనుకటిదినంబువంటిదినంబు చేకు ఱ నెల్లరు గోరుట యుక్తంబెకదా? ఏను సర్వసంగపరిత్యాగం బు చేసినది యెఱుంగుదువు. అయినను నాడెందంబు నిను జూడఁ గోరెడిని. కాదంబరియుఁ గొప్పయవస్థలో నుండి నిన్ను దలంచుచుండెడిని. కావున దర్శనం బొసంగి యాదరింపం ద గు. మముబోంట్ల పరిచయకదర్శనంబు సహింపుము. నీసౌజన్యం బ యనుచితసందేశంబునను బ్రాగల్భ్యంబు గలిగించును. ఇ య్యది. దేవరవారు శయనీయంబున మఱచిన శేషహారంబు, అని కొంగుముడివిచ్చి చామరగ్రాహిణి కరంబున నర్పించెను. అంత జంద్రాపీడుండును, పరిజనునందును కాదంబరి తలంపు లో నగుననుగ్రహాతిశయంబు నారోపించుట మహాశ్వేతచర ణారాధనఫలం, బని సర్వంబును దాన గ్రహించి యవ్విలే పనంబు మేన నలదుకొని యాహారంబుం గంఠంబునం దాల్చి రాజలోకంబున కనుజ్ఞ యొసఁగి కేయూరకునితో నశ్వ శాల కుఁ జని యచట నేకాంతంబునఁ గుతూహలంబుతో ని ల్లడి

గెను:—'కేయూరక, నావచ్చినదిమొదలు గంధర్వరాజకులం
బు వృత్తాంతం బేమి? చిత్రరథనందన యేమి వ్యాపారముచే
బ్రొద్దుగడపెను? మహాశ్వేత యేమి చేసెను? మదలేఖ యే
మి భావించెను? సర్వంబు చెప్పుము.' నావిని కేయూరకుం డి
ట్లనియె:—'దేవ' చిత్తగింపుము. నీవందుండి వెడలుడు వేన
వేలుడెందంబులప్రయాణంబుతమ్ముటకలకలంబోయన నూపు
రక్వణితంబు వెలయ కాదంబరీదేవి సౌధశిఖరంబు నెక్కి వారు
వంబు డెక్కలవలనం గ్రమ్మినదుమారమ్మున వెల్లనైననీవచ్చి
న తెఱువు నీవు కనఁబడునందాఁకఁ గాంచి యవ్వల మదలేఖ
బుజంబులపై మోమిడికొని కొంతదడవుండి దేవరవారు వశిం
చియుండినక్రీడాపర్వతంబునకు వచ్చి అచ్చట రాజనందనుం
డీశిలాతలంబునఁ గూర్చుండెను. ఈశిలాప్రదేశంబున స్నానం
బు చేసెను: ఈగిరినదికాననంబున శూలపాణి నర్చించెను, ఈ
స్ఫాటిక శిలాతలంబున భుజించెను. ఈముక్తాశిలాపట్టంబునం బ
న్నుండెను; అని పరిజనంబులు నివేదింప దేవరవారివాసచిహ్నం
బులె గాంచుచుఁ బవలుగడపెను. దివసావసానంబున మహాశ్వే
తయత్నంబునన యాహారంబు గ్రహించెను. అంత భానుండ
స్తమించి చంద్రుండుదయింపఁ జెక్కిటఁ జేయిడికొని యేమి
యొ చింతించుచు క్షణమాత్రం బుండి లేచి శయ్యాగృహం
బునకుం జని శయనంబునం దనువల్లిం జేర్చి యదిమొదలు ప్ర
బలం బైనదాహజ్వరంబుచే నతిదుఃఖంబున రేయిగడపి ప్ర

భాతంబునని నన్నుఁ బిలిచి దేవరవారి కీవార్త నెఱింగింప
నాన తిచ్చెను.' అనుటయుఁ జంద్రాపీడుండు 'అశ్వం బశ్వం'
బని పలవరించుచు శిబిరంబు వెడలెను. తరువాత పరిజనులు
త్వరితంబుగ నింద్రాయుధంబుం గొనివచ్చిన నెక్కి పత్రలేఖ
నెక్కించుకొని వైశంపాయనుని స్కంధావారంబున నునిచి
కేయూరకునితో హేమకూటంబున కరిగెను. అట్లు కాదంబ
రీభవనద్వారంబు సేరి యశ్వంబు దిగి పత్రలేఖతో లోనం బ్ర
వేశించి యెదురైనయొక్కనిం గాంచి కాదంబరి యెచ్చట ను
న్న దని యడుగ నతండు 'దేవ, క్రీడాశైలంబుదిగువ నిర్మితం
బైనహిమగృహంబున వసించె' నని నివేదింపఁ గేయూరకుం
డు దారిఁ జూపుచుండఁ జని హిమగృహంబు ప్రవేశించి యం
దు బిసతంతుమయంబు లైనచామరంబులను, కువలయాదిమ
యంబు లైనఛత్రంబులనుం గ్రహించి 'జలదేవతలసమూహం
బో, శరదృతువులసమాజంబో? సరసులగోష్ఠీబంధంబో?' య
నఁ దనరి శిశిరోపచారకుశలం బైనకాదంబరీపరిజనంబుం గాం
చెను. మఱియు నందు నొక్కచో నిరుప్రక్కలనాటినచీఁకటి
మ్రాకులచివుళ్లవనపంక్తులును, వేఱొకచోఁ దమ్మిపుప్పొడి
యిసుకతిన్నియలతో రాజిల్లుచుండు సరసంబుగృహనదులును,
ఒకతావున జలార్ద్రంబు లైనమేలుకట్లక్రిందఁ బఱచియుండు
తమ్మిసెజ్జలును, ఒక్కవలను నేరేడుచివుళ్లచేఁ గప్పఁబడినపర్ణ
శాలలును. ఒక్కచోఁ బూదండలతూఁగుటుయ్యెలలును,

ఒక్కయెడ బిసతంతుమయంబులైన వసనంబులును గాంచుచు వరుణుని క్రీడాగృహంబో, సకలవర్షర్తువులసంకేతనికేతనంబో, చంద్రకలలజన్మభూమియో, చందనవనదేవతలకులభవనంబో, యనఘాసిల్లు హిమగృహమధ్యభాగంబు ప్రవేశించెను. అందు నతిశీతలం బైనస్పర్శంబున కలరి తనమనంబు చంద్రమయంబో, ఇంద్రియంబులు కుముదమయంబులో, అంగంబులు జ్యోత్స్నామయంబులో, పవనంబు కర్పూరమయంబో, కాలం బుదకమయంబో" యని మనంబున భావించుచు నచ్చట మృణాళదండమండపంబున నీనుగానినమదనునిచే గొలుసులతో గట్టఁబడియెనో యన మృణాళమయంబులైనవలయరశనానూపురంబులతో నొప్పి, చందురుండు ముట్టినన లలాటంబు చందనధవళంబుగాఁగను, వరుణుండు ముద్రిడికొనియెననఁ గనుఁగవ నశ్రువులు గ్రమ్మఁగను, గాడ్పుదృష్టి వాలెనన ముఖంబున నిట్టూర్పులు వృద్ధిఁ జెందఁగను, పతంగుండు వసించెనన నంగంబులయందుఁ దాపంబు ప్రకోపింపఁగను, దహనుండు గ్రహించెనన హృదయంబున దాహంబు దీపింపఁగను, అంగంబు లెల్ల నంతరంగంబులోఁ బ్రియు నొద్దకరిగె నన దౌర్బల్యంబు వెలయఁగను. పలుమాఱు భుజవల్లిచేఁ దుషారసాలభంజికం గాఁగిలించికొనుచు, కర్పూరంపుఁబుత్రికనక్కునఁ జేర్చుకొనుచు నున్నకాదంబరిం గాంచెను. అత్తఱి నత్తలోదరిచెంత నున్నయన్నవలు ' చంద్రాపీడుండు వచ్చె ' నని తెల్ప దిగ్గన

లేచి, కన్నులు దెఱచి 'నిజంబుగ వచ్చినే? నీవు కన్గొంటివా? ఎంతదవ్వున నున్నవాఁడు?' అని యడుగుచు రాజనందనుని దూరంబున నె కాంచి క్రొత్తగఁ బట్టువడిన ధేనుకకై వడి చేష్టలుడక్కి సంభ్రమంబునం బయ్యెద జాఱ, కన్నుల సానందబాష్పంబులు గాఱ నించుక మోము వాంచి యతనిముఖంబున లగ్నం బైనదృష్టిచే నాకర్షింపఁబడియెననఁ గుసుమశయనంబునుండి లేచెను.

చంద్రాపీడుండును దొల్లింటిమాడ్కి గాదంబరికిని, మహాశ్వేతకును బ్రణమిల్లెను. ఆ కాదంబరి ప్రతిప్రణామంబు చేసి యాకుసుమశయనంబునఁ గూర్చుండఁ బ్రతీహారి గొని వచ్చినపీఠంబుపయిఁ జంద్రాపీడుండు కూర్చుండెను. అంతఁ గేయూరకుండు 'ఇయ్యది చంద్రాపీడదేవునియనుగ్రహపాత్రురా లైనపత్రలేఖ యనునడపకత్తె,' యని పత్రలేఖం గనఁబఱిచెను.. అంతఁ గాదంబరి యక్కన్నియం గాంచి 'ఏమి! తమ్మి చూలికి మానవులయందుఁ బక్షపాతము' అని తలంచెను. పత్రలేఖ ప్రణమిల్లిన 'రమ్మురా' మ్మని తనసమీపంబునఁ గూర్చుండఁ బెట్టుకొని కరకిసలయంబునఁ దాఁకెను. చంద్రాపీడుండును నట్టియవస్థలో నున్నకాదంబరి నవలోకించి యిట్లు చింతించెను. 'నాహృదయం బెంతయునిపుణంబు? ఇప్పటికిని విశ్వసింపదు. కానిమ్ము. నిపుణంబుగ నడుగుదును గాక,' యని యెంచి ప్రకాశంబుగ ని ట్లనియె:—'దేవి, ఈతీవ్రసంతాపం బైనవ్యాధి

కామునికరతలంబునం బొడమెను. ఎఱుంగుదును. సుతనూ, నిజం బుగ నీవ్యాధి మమ్ము బాధించునట్లు నిన్ను బాధింపదు. దేహ దానంబున నయిన నిన్ను స్వస్థురాలం జేయ నిచ్చగించుచున్న వాఁడ. 'మదనవేదనం జేసి క్రుంగుచున్న నిన్నుఁ జూడ నా మనంబును క్రుంగెడిని.' అనుటయుఁ గాదంబరి బాల యగు టం జేసి సహజముగ్ధ యయ్యునుఁ గందర్పునిచేఁ బోధింపఁబడెనన నాతనివచనంబులయర్థంబు మనంబునం గ్రహించి యూరకుం డెను. అంత మదలేఖ యిట్లనియె:— 'కుమార, ఏమిచె ప్పుదు? ఇక్కన్నియ సంతాపం బింత యని చెప్పరాదుగదా? ఇక్కోమలికి సంతాపంబు నొసంగని దేమి కలదు? చల్లనిచివు రులును జిచ్చు ననుకరించెడిని. వెన్నెలయు నెండ యయ్యెడిని. కిసలయతాళవృంతంబులచే మనంబునం గలుగు ఖేదంబు గాన వా? ఇంక ప్రాణధారణంబునకు ధీరతయ నిమిత్తం బగు.' అనుటయు, గాదంబరి మదలేఖ చెప్పినపలుకులె ప్రత్యుత్తరం బుగా మనంబున నెంచెను. చంద్రాపీడుండును మహాశ్వేత తోడఁ జతురాలాపంబుల సల్పుచుఁ గొంతదడ వుండి యెట్ట కేలకు పశిపించుకొని కాదంబరీసాన్నిధ్యంబుననుండి వెడలుచుఁ గేయూరకుండు వచ్చి 'దేవ, కాదంబరీదేవి యిటఁ బత్రలేఖం గొన్ని దినంబు లునుచుటకు వేఁడెడిని. తరువాత రాఁగలదు.' అనుటయుఁ జంద్రాపీడుండు విని 'కేయూరక, దుర్లభం బైన దేవీప్రసాదంబునకుఁ బాత్రురా లగుటం బత్రలేఖయ ధన్య

రాలు. ఉంమత., మని పలికి శిబిరంబున కరిగెను. అటఁ బ్రవే శింపఁగనె తండ్రియొద్దనుండి వచ్చినలేఖహారకు నవలోకించి దూరంబున నుండియె ' ఓయి, సర్వపరిజనంబుతో మాతండ్రి యు, సకలాంతఃపురంబులతో మాతల్లియుఁ గుశలం బున్న వారె?, అనుటయు వాఁడు ప్రణమిల్లి ' దేవ, అందఱు గుశ లుల, యని విన్నవించి లేఖాద్వితయంబు నర్పించెను. యువ రాజు శిరంబున నిడికొని తాస విచ్చి క్రమంబుగఁ జదివెను.

తారాపీడుం డనిచిన లేఖను చంద్రాపీడుండు చదువుకొనుట

' స్వస్తి శ్రీమత్సమస్తరాజన్యవందితచరణారవిందుండును, పరమమాహేశ్వరుండును, ఉజ్జయినీనికేతనుండు నైనతారాపీ డుండు సకలసంపదల కావాసుం డైనచంద్రాపీడుని శిరంబున మూర్కొని యానందించుచున్నాఁడు, ప్రజలు కుశలంబున నున్నవారు. ఇఁకే మన నిన్నుఁ గాంచి చాలకాలం బాయె ను. కాన నామానసంబు నిన్నుఁ జూడ నుత్సుకంబయి యు న్నది. అంతఃపురంబులతో దేవియుఁ గృశించి యున్నది. కాన నీలేఖం జదివినతోడ్తోన వెడలి రావలయు., శుకనాసుం డనిచినరెండవ పత్రికయందును నీయర్థంబె యుండెను తండ్రి యానతిచొప్పునఁ జనువాఁడ నని పలికి ప్రయాణపటహంబు బ్రోయింపం జేసి మేఘనాదునిఁ గాంచి యిట్లనియె:— ' కేయూరకుం డిటకుఁ బత్రలేఖం దోడ్కొని రాఁ గలఁడు. నీ వాపత్రలేఖను వెంటఁ బెట్టుకొని రమ్ము. కేయూరకునిము

ఖంబునఁ గాదంబరి కిట్లు విన్నపం బనుపుము. 'మానవులప్రకృతి దాక్షిణ్యరహితంబయి, త్రైలోక్యనిందనీయం బయినది. మనుజులు నిష్కారణవాత్సల్యముం గణింపరుగదా! ఇట్టులుజ్జయినీపురాభిముఖుం డైనయేను స్నేహంబును దాహంబు గావించితి. భక్తిని గపటయుక్తినిగా నొనరించితి. ధూర్తత్వముం బ్రకటించితి. నాస్థితి ఇట్లుండనిమ్ము. అస్థానంబునఁ బ్రసాదంబునునిచినదేవి తాను నింద్యత నొందెడిని. మహాత్ముల ప్రసాదదృష్టు లపాత్రులయందుఁ బ్రయోగింపఁబడి వ్యర్థంబులయి తుదకు విస్మయంబుం గలిగించెడినిగదా? నాడెందంబు మహాశ్వేతం గుఱిచియు లజ్జ నొందదు. ఏలన, అకారణపక్షపాతంబున లేనిగుణంబుల నాయం దారోపించి పొగడినమహాశ్వేతను దేవి పలుమాఱు గేలిసేయకుండునే? ఏమి సేయుదు! గురునానతి మీఱ రానిది. ఈతనువు గురువశంబున మెలంగి నను హేమకూటవాసంబె కోరుచుండు. మనంబు వేపుట్టువులందును నీదుదాస్యపట్టంబ యభిలషించుచుండెడిని. ఇప్పుడుజ్జయినికిం బోయి వచ్చెద. అసజ్జనుఁ బ్రస్తావంబునఁ జంద్రాపీడచండాలునిఁ దలంచుచుండునది. చంద్రాపీడుండు బ్రదికియుండునెడ దేవీచరణారవిందంబు దర్శింపకుండువాఁడు కాఁడు; అని చెప్పి పుత్తెంచి మహాశ్వేతకుఁ బ్రణామిల్లుము.' అని యానతిచ్చి మిత్రులం గాంచి 'సైన్యంబుం గ్లేశపెట్టక మెల్ల మెల్ల నేతెంచునది.' యని పలికి వైశంపాయనుని స్కంధా

వారంబున నియోగించి యింద్రాయుధంబు నధిష్ఠించి లేఖ హారకుం గాంచి యుజ్జయినీవార్త లడుగుచుఁ గొంతయశ్వ సైన్యంబుతో వెడలెను. ఇట్లు వెడలి యం దందు సుందర స్థలంబులఁ గనుంగొనుచుఁ గొన్ని దినంబుల నుజ్జయనీనగరంబు ప్రవేశించెను.

చంద్రాపీడుం డుజ్జయినీనగరంబు ప్రవేశించుట.

ఆకస్మికంబుగఁ బ్రవేశించుటం జేసి ప్రహర్షంబునం బౌరు లొసంగునర్ఘ్య కమలంబులో యనఁదనరునమస్కారాంజలి సహస్రంబులం గ్రహించుచుఁ బురంబు ప్రవేశించెను. ఏ ముం దే ముం దని యమందానందంబునఁ బరిజను లరుదెంచి 'దేవ, తారాపీడ, చంద్రాపీడమహారాజు వాకిటనున్నవాఁ' డని నివే దింపఁ దారాపీడుండు నిర్భరానందంబున మందరంబు పాలము న్నీటినీరంబుంబలె జాఱిన యుత్తరీయంబు నీడ్చికొనుచు ముత్తియంబులం గురియుకల్పపాదపంబో, యన నానంద బాష్పంబు నర్షించుచు రాజసహస్రంబు వెంబడిరాఁ బాద చారియయి యరుదెంచుటయుఁ జంద్రాపీడుండు తండ్రిం దవ్వు నను గాంచి వారువంబు డిగ్గి యడుగుల కెఱఁగినంతఁ దారా పీడుండు బాహువులు సాఁచి 'రమ్ము. రమ్ము, అని బిగి కౌఁగిటం జేర్చి విలాసవతీభవనంబునకుఁ గొంపోయెను. అందును విలాసవతి యంతఃపురాంగనలం గూడి యానందింప దిగ్విజయ సంబద్ధంబు లైనవార్తలతోఁ గొంతప్రొద్దు గడపి శుకనాసుం

జూడ నరిగెను. అందును నట్ల చిరకాల ముండి వైశంపాయ నుండు కుశలంబుగ స్కంధావారంబున నున్నవాఁడని నివేదించి మనోరమం గాంచి యటనుండి మరలి విలాసవతిభవనంబున నె స్నానాదివ్యవహారంబుల నెఱపి యపరాహ్ణంబునఁ గుమార భవనంబున కేతెంచెను. అటఁ గాదంబరిం దలంచుకొని యాభామిని లేమికిఁ దన్నెగాక తనభవనంబు, నవంతీనగరంబు, సకలమహీమండలంబును శూన్యంబుగాఁ దలంచుచుఁ గాదం బరీవార్తాశ్రవణంబు మహోత్సవంబుగం బలెను, వరప్రాప్తికాలం బుగం బలెను, అమృతోత్పత్తి దివసంబుగం బలెను, నిరీక్షించు చుండెను. అట్లు గొన్నిదివసంబు లతిక్రమింప నొకనాఁడు మేఘనాదుండు పత్రలేఖం దోడ్కొనివచ్చి యొప్పగించుటయుఁ బత్రలేఖ నమస్కరింప దూరంబుననుండియే చిఱునగవునఁ బ్రేమంబు గనఁబఱచుచుఁ గాదంబరిసమీపంబుననుండి వచ్చు టం జేసి యత్యాదరంబునఁ గౌఁగిలించికొని రాజలోకంబునకు సెల వొసంగి పత్రలేఖం దోడ్కొని మందిరాభ్యంతరంబున కరిగి 'పత్రలేఖా, ఏను వచ్చినపదంపడి యట నెట్లుంటివి? దేవీ ప్రసాదం బెట్టిది? ఏము ప్రశంసలు ప్రవర్తిల్లెను? ఎవ్వరేని మమ్ము దలంతురా? ఎవ్వరికెక్కుడు ప్రీతి కలదు?' అని యడిగినఁ బత్రలేఖ యి ట్లనియె:—' దేవ, అట నె ట్లుంటినో? ఎన్ని దినంబు లుంటినో? అం దేమి ప్రశంసలు ప్రవర్తిల్లెనో? ఎవ్వారు నిన్నుఁ దలంతురో? ఎవ్వారికి నీయం దెక్కుడు ప్రీతికలదో? విన్నవింతు నాలింపుము.

పత్రలేఖ చంద్రాపీడునకుఁ గాదంబరియవస్థలు విన్నవించుట.

అటనుండి దేవరవారు వెడలుడు నేను కేయూరకునితోఁ మరలి సవనవంబులైన దేవీప్రసాదంబుల ననుభవించుచుఁ గుసుమశయనీయసమీపంబున సుఖంబుగఁ గూర్చుంటిని, పలుమాటల నేమి? తఱుచుగ నాకంటియం దాయమకంటిని, శరీరంబున శరీరంబును, కరంబునఁ గరంబును, ప్రీతియందు డెందంబును నునిచి ప్రొద్దుపుచ్చుచు నపరాహ్ణంబున నన్నుఁ బట్టుకొని హిమగృహంబుననుండి వెడలి పరిజనుల నాగించి లేఁదోటకుం జని యందుఁ బటికంపుటరుగుపయిఁ గూర్చుండి మానికపుఁగంబంబున కొఱఁగి యొకింతసేపు మనంబున నాలోచించి యేమియో చెప్పఁ దలంచి కనుఱెప్పవ్రేయక నా మొగంబునఁ జూడ్కి నిల్పి యవలోకించుచునె 'మదనాగ్నిం బ్రవేశింప నెంచి స్నానము చేసెనన స్వేదప్రవాహంబునం దోఁగెను' అప్రవాహంబున నెట్టఁబడియెనన వడంకెను. వడంకుచుఁ బతనభీతి నన విషాదంబుచేఁ బట్టుకొనఁబడియెను. అంత నేనక్కాంతముఖానం బెట్టింగి యాయమ మొగంబునన చూడ్కి నిల్పి 'అనతి' మ్మని విన్నవింప 'వనదేవత యాలించునో' యని శంకించినదానివలెఁ బలువాఱు నిటు నటుఁ జూచి చెప్ప నిచ్చగల్గియు, లజ్జచే దగ్గుత్తిక నొంది చెప్పఁ జాలకుండెను. ప్రయత్నించినను నక్కాంతకుఁ బ్రజ్వలించుమదనాగ్నిచే దహింపఁబడియెనో, ప్రవహించు నయనోదకంబుచేఁ గొట్టుకొనిపోఁబడియెనో, పను

చున్న కామశరంబులచేఁ బొడిచేయఁబడియెనో, యన మాట వెలువడదయ్యె. 'దుఃఖసహస్రంబు లెక్కింపనట్లు కాతఁమాలి కంగల్పించుచుండె' నన నశ్రుబిందువులం గార్చుచుండెను. అంత నేను వేమాఱు ప్రార్థింప నెట్టకేలకు ని ట్లనియె:—

కాదంబరి పత్రలేఖల సంభాషణము.

'పత్రలేఖా, నిన్నుఁ గన్గొన్ననాటంగోలె నాకు నీ వెసఁ గలబాళి తలిదండ్రులయందును, మహాశ్వేతయందును, నా జీవితమునందును లేదు. నాడెంకంబు నిన్ను విశ్వసించెడిని. సఖి, ఎవ్వని నిందింతు? నాపరిభవం బెవ్వనికిఁ జెప్పుదు? దుస్సహం బైననాదుఃఖంబు నీ కిప్పుడు విన్నవించి ప్రాణంబులు విడిచెద. ఈవృత్తాంతంబు నామనంబునకే తెలిసె నని లజ్జ పడుదాన నొరులకుఁ దెలియుచో నేమి చెప్పవలయు? నావలె నెవ్వతె శశికరజాలంబువోలె స్వచ్ఛం బైనకులంబు నాఱడిచేఁ గలంకంబు నొందించును? లజ్జను ద్యజించును? లాఁతినాతులు కుచితం బైనయీచాపలంబు వహించును? తండ్రి సంకల్పించెనా? తల్లియనుమోదించెనా? ఏమైనవార్త నంపిరా? అనాథ వలెను, నీచురాలివలెను, చంద్రాపీడునివలన నిట్టివట్టిదూఱు గట్టుకొంటిని. చెలీ, బిసతంతువుపగిది సుకుమారం బైన నామనం బేచుట మాన్యుల కుచితంబె? పరిచయంబున కిది ఫలంబె? కన్యకల నేఁచుట కోడెకాండ్ర కిది న్యాయంబుకదా? మదనానలంబు తొలుత లజ్జను గాల్చి పిదప డెందంబు నెరి

ఋంచును. మారిశరంబులైననో మునుమున్న వినయాదుల ఖండించి పదంపడి మర్మాంబుల పఱవఱలు చేసెడిని. నాకు నీకంటెఁ బ్రాణప్రియ లేదుగాన క్రమ్మఱను నీతో జన్మాంతరసంగమంబు కోరెద. ఇప్పుడు ప్రాణపరిత్యాగరూపం బైన ప్రాయశ్చిత్తం బొనరించి నాకసటు గడిగికొనియెదను.' అన విని యేను భీతినొంది శోకంబున నిట్లువిన్నవించితి. 'దేవి కుసుమకోమలం బైననీడెందంబునకు నొప్పిగలుగ యువరాజేమి తప్పొనరించెనో?' అనతివిన్ను. విని యేను మున్నసురుల విడిచెద. పదంపడి నీవట్లొనరింతువుగాక.' నావిని మగుడ నిట్లనియె:—

'పక్కాణించెద సావహితచిత్తనయి వినుము. ప్రతి దివసంబును గలలోన వచ్చి చిలుకలతో, గోఱువంకలతోఁ గుట్టు మాటలం జెప్పి పుత్తెంచును. విదురించుతఱి వ్యర్థమనోరథ మోహితుండయి చెవ్వాకులందు సంకేతస్థానంబుల వ్రాయును. తనయనురాగంబు చేతంబలె లత్తుకచే నాయడుగులకు నన్నొ గట్టును. ఉపవనంబులయం దొంటిమెయిఁ జరించుతఱి నతండు పట్టుకొనునసతిలఁకి పఱచుచుండునంతఁ జివుళ్లం జిక్కు వడిన చెఱఁగు విడిపించుకొనుచో వెనుకనుండి వచ్చి కౌఁగిలించికొను ను. అశోకతరువుం గాలఁ దన్నునప్పు డక్కంబు వచ్చి ప్రతిగ్ర హించును. పత్రలేఖా, ఈనిశ్చేతను నెట్లు వారింపవలయు? వల దన్న ను నీసును గా నెంచును. దూషించినను స్మరణోపాయం

బుగా నిశ్చయించును. లోకాపవాదంబును గీర్తియని లెక్కించును.' అనుటయు నేనాలించి 'ఓహో, మదనుండు చంద్రాపీడు నుద్దేశించి కాదంబరిని పెనుదూరము గొంపోయెను. నిజంబుగఁ గాదంబరీమిషంబున మన్మథునిచిత్తవృత్తి యువరాజు నను గ్రహించెను.' అని యెంచి ప్రకాశంబుగ నవ్వి యిట్లంటిని. 'దేవి, ఇటు లేనిః గోపంబు విడువుము. ప్రసన్నతఁ జెందుము. నీవచించినవన్నియుఁ బంచబాణునితప్పులుగాని యువరాజుతప్పులు గానేఱవు. నావిని యమ్మానిని క్రమ్మఱఁ గాముండన నెవ్వఁడు? వానిరూప మెట్టిది? చెప్పుము.' అనుటయు నే నిట్లు విన్నవించితి. 'దేవి, ఇతనికి రూపమెక్కడిది? ఈతండు తనువులేని హుతాశనుండుకదా? కావున జ్వాలలం బ్రకాశింపఁ జేయకయ సంతాపంబు గలిగించును. పొగ తెగలం బ్రకటింపకయ కన్నుల నీరు గాఱంజేయును. బూదిఁ జూపింపకయ మేనెల్లవెల్లఁబాఱించును. ముజ్జగంబుల నితనిచూడ్కికి గుఱిగాని వానిం గాంచితిమె? కనుచున్నారమె? కనఁ గలమె? ఈతండు పూవిల్లు దాల్చి యెంతటి బలవంతునైన బాధించును. ఇతనిబాఱింబడి ప్రియునిముఖచంద్రసహస్రంబులం గాంచు నాతుల కాకసంబు శూన్యంబుగా, ప్రియునాకారంబుల వ్రాయుతొయ్యలులకు మహీమండలం బణువుగా, వల్లభుని గుణంబు లెన్నునన్నువలకు లెక్క దక్కువగా, ప్రాణప్రియుని సమాగమసుఖంబుం భావించుచంచలాక్షులకు గాలంబు జాల

నిదిగానుండును.' నావిని యత్తలోదరి క్షణముసే పాలోచించి యిట్లనియె:—' పత్రలేఖా, ఔను. నీచెప్పినట్ల యగు. మారుండు రాకుమారునియందుఁ బక్షపాతంబున న న్నిట్లు కాఱియ వెట్టెడిని. ఏ నిట్టి వార్తల నెఱుంగ. ఈవు నా మనంబుకంటె వెలిదానవు గాకుంటంజేసి నిన్నడిగెద. ఇప్పటికిఁ దగుకర్జంబు నీవ యుపదేశింపుము. నాడెందంబు గురుజననింద క్కోర్చి జీవించుటకంటెఁ ద్రెళ్లుటయ శ్రేయ మని యెంచెడిని. అన విని మగుడ నే నిట్లంటిని.

'దేవి, నిష్కారణమరణోద్యమంబు వలదు. నీవు పూజింపకున్నను కుసుమశరుండు తాన ప్రసన్నుండయి నీకు వరం బొసంగెను. ఇందు గురుజననింద యేమి కలదు? కన్య కను బంచశరుండు తండ్రివలె సంకల్పించును. తల్లివలె నను మోదించును. అన్నవలె నొసంగును. నెచ్చెలివలె నౌత్సు క్యంబు గలిగించును. తమంతన వతులవరించినకన్యకల నెందఱఁ జెప్పవలెను? ఇది యిట్లు గానిచో ధర్మశాస్త్రోపదిష్ట మైనస్వయం వరవిధి నిరర్థకంబకాదా? కాన ప్రసన్నవగుము. మరణోద్య మంబు వలదు. నీయకుగుడమ్ము లాన. సెల్ల వొసంగుము. ఏను వెడలి నీప్రియాతిముం జైనచంద్రాపీడుం గొనివచ్చెద.' అనుటయు విని యబ్బోటి ప్రీతిరసార్ద్రంబైనదృష్టిచే నన్నుఁ గాంచి యొకింతనాసఁ బూని మెల్లన నిట్లనియె:—

కాదంబరి చంద్రాపీడునకు సందేశ మంపుట.

సఖీ, నీకు నాయందుఁ గల ప్రేమాతిశయంబు నెఱుంగుదు. బాలభావంబున నున్న కుమారీజనంబునకుఁ బ్రాగల్భ్యం బెక్కడిది? తమంతన సందేశంబు నంపువారు సాహసకారిణులుగారె? బాలనుగాన సాహసింప లజ్జించెద. ఐనను ఏమి సందేశింపవలయును? ఈవు నాకతిప్రియుండ వని పల్కుదునా? పౌనరుక్తమగు. నీకు నేఁ బ్రియురాల నని వచింతునా? అనాగరత యగు. నాకు నీయందెక్కువ యనురాగంబు గల, దని వక్కాణింతునా? వేశ్యాలాపం బగు. నిన్ను విడిచి జీవింప నని చెప్పుదునా? అనుభవవిరోధము. మదనుండు నీకొసంగె నని భాషింతునా? అది సమీపింప నుపాయం బని భావింపంబడు. అవశ్యంబును గావలయు నని నుడువుదునా? అది సౌభాగ్యగర్వం బగు. ఏనువచ్చుచున్నదాన నని యాచింతునా? స్త్రీచాపలం బగు. మరణంబుచే నా మనఃప్రీతి నెఱుంగఁగల వని నివేదింతునా? అది యసంభావ్యమగు.

గ॥ ఇది శ్రీమద్భారద్వాజ గోత్రపవిత్ర - శ్రీమదుద్భట కులాబ్జమిత్ర - శ్రీమదఘోరనాథతనూభవ - జ్వాలాంబాగర్భశుక్తిభవ. విబుధజనారాధ్య - నాగలింగారాధ్యప్రణీతం బైన కాదంబరి యను నాఖ్యాయిక యందు పూర్వకాదంబరి.

సంపూర్ణము.



శివాభ్యాంనమః

# కాదంబరి.

## ఉత్తర భాగము.

ఇప్పుడు నీవు కుమారుం గొనివచ్చితేని లజ్జయె లజ్జ గాని దర్శనం బొసంగదు. వైలక్ష్యంబును మదనవేదనావిలత్వంబయి యుక్తిగోచరంబు గానేరదు. రాజసందర్శనపరాధంబున భీతిల్లి భీతియె సమ్ముఖంబు గాదు. ఇంక నతండు గురుజనంబు లెఱుంగెదరని లజ్జచేతనో? రాజకార్యానురోధంబుననో? బంధుజనదర్శనసుఖంబుననో? మిత్రదర్శనౌత్సుక్యంబుననో? జన్మభూమిస్నేహంబుననో? ఇచ్చలేమినో, రాకమసలెనేని నప్పుడు గొప్పయత్నంబు చేయునది. నీ పతనిపాతంబుల పయిం బడియుం దోడ్కొని రాంజాలవేని నప్పుడు మజ్జీవితంబు నిరర్థకంబు. మఱియు నిప్పు డేమి యధికంబు ప్రాప్తంబయ్యె. సర్వరమణీయంబులకును సందోహభూతం బైనహిమగృహాంబునం గుసుమశయ్య నధిశయించి రాకుమారునిచేం జూడంబడిన కాదంబరి నేనకదా? అత్తఱి నతని దిలకించి పునర్దర్శనంబు గోరినకన్నులు నివియెకదా! లోనం జొచ్చినయతనిం భరింప

నేరనిహతహృదయం బిదియకదా? ఆతనిసమీపంబున నుదా
సీనవృత్తి నవలంబించినశరీరం బిదియొకదా? గురుజనుల నపే
క్షించి గ్రహింప నియ్యకొననిపాణితలం బిదియొకాదె? ఇరు
మాఱు విచ్చేసి వెడలినచంద్రాపీడుం డతఁడెకదా? నాయందె
ప్రాణంబు లుపక్షీణంబులగుట లాఁతిచో నేమియుఁ జేయఁ
జాలనిపంచబాణుండు నీచెప్పినవాఁడె కదా? ఇది యుండ
నిమ్ము. 'నీవు దుఃఖితవయి యుండ నేను పాణిగ్రహంబు చేసి
కొన నని మహాశ్వేతతోఁ బ్రతిన సేసి యుంటిని.' అనుటయు
నే నిట్లంటిని. 'దేవి, ఇట్లు మనసునఁ దలంపకుము. ప్రియుండు
కనఁబడకున్న యెడఁ బ్రాణకారి యగుమకరకేతనుండు హృద
యానురాగంబునలనఁ బ్రాణంబుగూడ నపహరించెడిని జుమా?'
నావిని యాయతివ 'ఆ చెనటిమరుఁ డెట్టుచు నన్నుఁ జంపకున్న
వాఁడు గదే? దైవంబుచేతనో? విరహంబుచేతనో? యౌవ
నంబుచేతనో? అనురాగంబుచేతనో? హృదయంబుచేతనో?
మొదటఁగబడీసంకల్పమయుండయి యున్నరాకుమారుం డెవ్వరి
కింగానంబడక యెల్లప్పుడును నాకు సిద్ధునివలె దర్శన మొసంగె
డిని. ఇతం డాతనివలెఁ గఠినహృదయుండయి నన్నుఁ బరిత్యజిం
పఁడు. నావిరహంబునకు వెఱచి లజ్జ నపేక్షింపక, పుడమిం
గోరక, రే యనక, పవ లనక నాసన్నిధియందియె నిలిచినను,
కూర్చుండినను, నిదురించుచుండినను బ్రమోదం గనుపట్టెడిని.
ఇంక వంచకుఁ డగునానృపకుమారుల గొనివచ్చుముచ్చట

యేల?'అని పలికి కనుదమ్ములం గన్నీరు దొరలంగనోరుగుదిం చునవలంబించిన బాహులతపై మోమిడికొని యూరకుండెను.

నావిని యే నిట్లు చింతించితి. 'విరహిణులకు' నందు నుం గుమారికలకు సంకల్పమయుం డగుప్రియుండే నిజంబుగ జీవనాధారంబై యుండు. ఏలన, ఈతనితోడ దూతికాపాద పతనదైన్యంబు లేని సమాగమశతంబులును, శబ్దవిహీనంబు లగుచుంబనంబులును గలుగుచుండును. ఈప్రియునిం గాలు చీఁకటి మఱుఁగుపఱుపదు. జలధరధారాపాతంబు గప్పనేరదు.' అని చింతించుచుండఁగనె యనురాగకథారసంబుచేతనన దివ సంబు రక్తిమ నొందెను, రేపాలంతి పల్లవశయనంబుఁ బఱచెనన సాంధ్యరాగంబు రచించెను. ఇంతలో గంధతైలావసిక్తంబు ల గుకరదీపికలం బట్టుకొని బాలికలు చుట్టుకొనియుండిరి. అప్పు డంగలగ్నంబులయి ప్రజ్వలించు మదనసాయకశల్యంబులన నొడలిలావణ్యంబునం గానంబడుదీపికాప్రతిబింబంబుల వహిం చు నమ్మించుబోఁడిం గాంచి క్రమ్మఱ నిట్లు విన్నవించితి. "దేవి! అనుగ్రహింపుము. సంతాప మొందకుము, కోపంబు నుపసం హరింపుము. ఏ నరిగి చంద్రాపీడుం గొనివచ్చుతి నని విశ్వసిం పుము.' అనుటయు దేవరవారి నామగ్రహణంబు గలనా మాటచే విషాపహరణమంత్రంబుచే విషమూర్ఛితయుంబోలెఁ గన్నులు దెఱచి నన్నుఁ గాంచి 'పత్రలేఖా, నిన్నుఁగాం చుచు మేన నునుపులు దాల్చి యున్నదాన. ఐనను శక్యం

బగుచో సమీహితంబు సాధింపుము, అనిపలికి తనమేనితొ
డవులతోడఁ దాంబూలం బొసఁగి 'నన్నుఁ బనిచెను. దేవా,
దేవికతంబున దుఃఖితనై విన్నవించెద. 'అట్టి యవస్థయం
దున్న దేవిని దూరీకరించుట యాపన్నవత్సలం బగు దేవరవారి
ప్రకృతికిం దగునా?' అని సోపాలంభంబుగఁ బత్రలేఖ విన్న
వింప గంభీరంబును, సంతాపకరంబును, సపరిహాసంబును, సా
భ్యర్థనంబును, సానురాగంబును, సకోపంబును, మధురం
బయ్యు మశ్శ్రివంబును, సరసంబయ్యు శోషహేతువును, కో
మలంబయ్యుఁ గఠోరంబును నగు కాదంబరియాలాపంబు విని
విని చంద్రాపీడుండు ధీరప్రకృతి యయ్యు మిగులఁ బర్యాకులుం
డయి యిట్లనియె:—

### చంద్రాపీడుండు కాదంబరిని దలంచి దుఃఖించుట

'పత్రలేఖా, ఏమి చెప్పుదు? దురాత్ముండు, శృంగార
నృత్యాచార్యుండు నగు మనోభవుండు ప్రేరేప నబ్బాల యంత
ర్గతవికారంబుల నాకెఱిఁగింప యత్నించుచో నే నది యంతయుఁ
గాంచి, దివ్యకన్యకల నంతకుమున్నుఁ గాంచియుండమిని, నామ
నంబు విశ్వసింపమిని హావానురూపంబు లగునట్టిలీలలు సాజంబు
లని యెంచుటం జేసి యిట్టిదగు దేవిదుఃఖంబునకు, నీయుపాలంభ
మునకును గారణంబనయితి. నాకును మనోవ్యామోహాకరం బే
దియో యొండు శాపంబు గల దని తలంచెద. అట్లుగాదేని నట్టి
మొఱకుమానిసికైన సంశయకరంబులు గాని పరిస్ఫుటంబు

లగుమదనచిహ్నంబులు గానంబడుచుండ నామనం బెట్లు వ్యామోహంబు నొందును? అతిసూక్ష్మంబు లగుటం జేసి దుర్విభావ్యంబు లగుస్మితావలోకనాదివిలాసంబు లటుండం గాక. చిరకాలంబుననుండి తనకంఠసంసర్గంబు నొంది యున్న యాహారంబు నక్షత్రపుణ్యుండ నగునామెడయం దున్నచుటకంటె నొం డేమి తెలుపవలయు? మఱియు హిమగృహమునందలి వృత్తాంతము నీకుఁ బ్రత్యక్షముకదా? అది యంతయు విపరీతంబుగ నెంచుట నాదోషంబ. కాన యిప్పు డద్దేవి నన్నుఁ గఠినహృదయునిఁగా నెంచకుండునట్లు ప్రాణంబులచేనైన నుపచరించెద, అని నుడువుచుండఁగనె ప్రతీహారి వచ్చి 'యువరాజ' 'పత్రలేఖ వచ్చె నని పరిజనంబువలన వింటిని. చూడఁ గోరెద. గాన దానిం దోడ్కొనిరమ్ము, అని మహాదేవి విన్నవించెను.' నావిని చంద్రాపీడుండు తనమనంబున నిట్లు చింతించెను. 'ఆహా, నాజీవితము సంశయగ్రస్తము. ఇట్లు నాతల్లి నిమిషము నన్నుఁ జూడకున్నను దుఃఖపడుచుండును. కాదంబరియు నన్ను రమ్మని పత్రలేఖతోఁ జెప్పివంపించెను. జనకునిపాదసేవ విడువఁదగదు. మన్మథునిబాధ యోర్వరాదు. కులక్రమాగతు లగురాజులు నాముఖావలోకనంబు గోరుదురు. ఏను ప్రియాముఖావలోకనంబు గోరెద. ప్రజలకు నాయం దనురాగము. నాకు గంధర్వరాజనందనపయి యనురాగము. జన్మభూమి త్యజింపరాదు. కాదంబరీదేవి విడువఁదగదు. మనంబు కాలవిళంబనము సహిం

పడు. ఇచ్చటికి హేమకూటము బహుదూరము.' అనిచింతించుచునె ప్రతీహారి త్రోవఁ జూపుచుండఁ బత్రలేఖ చేయి పట్టుకొని తల్లిసమీపంబునకుం జని యచట జననీలాలనసుఖం బనుభవించుచునాపవలు గడపి సంప్రాప్తం బయినయాత్మచింతవలె రాత్రి దశదిశలఁ జీఁకటిఁ గప్పుచుండ శయనంబునం బన్నుండికన్నులు మూసికొనియు నిదురం జెందక స్మరాయతనభూతం బగు కాదంబరీరూపంబునె భావించుచు నిజభావంబున మండలీకృత కుసుమకార్ముకుం డగుమకరధ్వజుండు తనమనఃప్రియను బ్రహరించుచున్నట్లు గాంచి తానడ్డపడి ' నిర్దయ, మాలతీకుసుమ కోమలం బగుశరీరంబునఁ బ్రహరించుచు లజ్జింప వేల?' అని కుసుమచాపు నుపాలంభించువానివలెను, కమ్మవిల్తు నమ్ముల సొమ్మసిలినయమ్మగునను మూర్ఛదేర్చువానివలెను స్వేదజలంబు వహించి యతిదీర్ఘంబు లగునిశ్శ్వాసమారుతంబుల విడచెను. అమ్మానిని తెలిసికొంట సంతసపడినవానివలె గగ్గురుపాటు నెందెను. ప్రియాముఖంబు గాంచువానివలె నేదియుఁ జూడఁ డాయెను. అచ్చెలిపలుకుల వీనులు నిండి యుండెనన నొరులభాషితంబులఁ జెవి బెట్టఁ డాయెను. వీణాధ్వనులు వెలువటన యుండెను. సుభాషితంబులును లోనఁ బ్రవేశింప వాయెను. మిత్రవచనంబులును పరుషంబులవలె నుండెను. కామవికారంబు వెల్లడి యగునను భీతిచేఁ దొల్లింటివలె నెవ్వానికిని దర్శన మొసంగఁ డాయెను. మదనహుతభుజునిచే లోన నెల్లపుడు దహిం

పఁబడుచును గురుజనంబు లెదుఁగెద ‌రమలజ్జచే శిశిరోపచారర బులనొల్లకుండెను. ఇట్లు రేలుంబవళ్లు నాఱక జ్వలించుచును దహనరూపంబుగాక, దహించుచును స్నేహేంధనంబుల నిక్షే పంబు సేయక, దుఃఖము ననుభవింపఁ జేయనె భస్మంబు సేయనిమదనాగ్నిచే లోనను, వెలుపలను నుడికింపఁబడుచు శుష్కించుచుండెను. మఱియు నారాకొమరుండు శరీరము నకుఁ గార్శ్యము నంగీకరించెంగాని లజ్జకుఁ గార్శ్య మంగీకరింపఁ డాయెను. శరీరస్థితియందు యనాదర మంగీకరించెంగాని కుల క్రమస్థితియం దనాదర మంగీకరింపఁడాయెను. సుఖము నె నిర సించెంగాని, ధైర్యమును నిరసింపఁడాయెను. ఇట్లు గాదంబరి యం దనురాగంబుచే ముందరి కాకర్షింపఁబడుచును, గురుజన ప్రతిబంధంబుచే వెనుక కీడ్వఁబడుచును, నెట్టెట్లో గొన్ని దినంబులఁ గడపి యొక్కనాఁడు పురంబు వెడలి శిప్రానదీ పరిసరంబున బరిభ్రమించుచు దూరంబునఁ బెక్కుతురంగమం బులఁ గాంచి యది యెఱుంగుటకయి యొకపురుషుని మూఁదుగఁ బనిచెను.

శిప్రానదీతీరంబున జితాపీడుఁడు కేయూరకుని గాంచుట.

అంత నాశిప్రానదిం దాఁటి యచ్చటికా ద్రికేయభవనం బున నుండి యావాజిబృందంబు గాంచుచుఁ బత్రలేఖ నుద్దే శించి ‘లలనామణీ, అదె చూడుము. ఈవారువంబులనడుమ నెమ్మియాకెలగోడుగు పట్టుకొని వచ్చుచున్నవాఁడు కేయూర

తుండుగదా?' అని వచించుచుండ మున్ను నుపంబడిన పురుషుం డు వచ్చి 'ఈవచ్చువాఁడు కేయూరకుం' డని చెప్పుచుండు నంతలో నంతస్సంతాపసూచకం బగుచూపుచేఁ గష్ట మగు కాదంబరియవస్థను దెలుపుచున్న కేయూరకుం గాంచి యా దరమ్మున, 'రమ్ము రమ్ము' అని కరమ్మునఁ జేరం దివిచి కౌఁగి లించికొని యిట్లనియె:—'కేయూరక, నీదర్శనమ్ము చేత నె కాదంబరి తనపరివారమ్ముతోఁ గుశలమున నున్న దని తెలిసె డిని. ఈవు విశ్రమించి యాగమనకారణంబు దెలిపెదవు.' అని ప ల్కి పత్రలేఖా కేయూరకులతోఁ గరిణి నధిష్ఠించి నిజసదనం బున కరిగి దివసకృత్యంబు నిర్వర్తించి పత్రలేఖాద్వితీయుండై వల్లభోద్యానంబు ప్రవేశించి కేయూరకుం బిలిపించి 'కేయూర క, మహాశ్వేతాకాదంబరులసందేశం బెఱింగింపుము' అని య డుగఁ గేయూరకుం డిట్లనియె:—

కేయూరకుండు చంద్రాపీడునకుఁ గాదంబరీయవస్థల నెఱింగించుట.

'దేవ' ఏ మనివిన్నవింతు ? ఏను గాదంబరీమహాశ్వేతల సందేశంబు గొనివచ్చినవాఁడఁ గాను. పత్రలేఖను మేఘ నాదునొద్ద విడిచి మరలి హేమకూటంబుఁ జేరి దేవర వారుజ్జయిని కరిగినవృత్తాంతం బెఱిఁగింప వేఁడినిట్టూర్పుల విడుచుచు 'సిది యిట్లయ్యెనా?' అని మహాశ్వేత తనయాశ్రమంబునకుం జని యెను. కాదంబరీదేవియు నవ్వార్తచే హృదయంబున నినుప గుదియచేఁ గొట్టఁబడినపగిదిని, శిరంబునఁ బిడుగువడినవడువు

నను, సంతస్సంతాపంబున గనుఁగవ మూసికొని సామ్ర్యోఁయినరీతిని, అంతఃకరణంబుచే విడువఁబడినవిధంబునను మహాశ్వేత యరుగుటయు నెఱుంగక యొకింత సేపునకుఁ గన్నులువిచ్చి యవ్వార్త మహాశ్వేత కెఱిఁగింపు మని నాతోఁ బల్కి మదలేఖం గాంచి, 'మదలేఖా, చంద్రాపీడుఁడిమాడ్కి నెవ్వాని నిట్లొర్చెనే? ఒనర్పంగలఁడా? అని పల్కుచు లేచి, పరిజనులనెల్లరఁ బనిచి శయనంబునఁ బన్నుండి యుత్తరీయంబు తలకుఁ జుట్టుకొని మదలేఖతోనైన మాటాడనొల్లక యాదివసంబెల్ల గడపెను. మఱునాఁడు ప్రాతఃకాలంబున మ్రోల నిలిచియున్న నన్నుఁ గాంచి 'మీరందఱు దృఢతరశరీరులయి యుండియు నే నిట్టియవస్థ నొందవలసివచ్చెఁగదా!' యని నిందించుచుఁదనంబునను, 'ప్రక్క నున్న మీతో నేమికార్య' మని బెదరించునట్లును' 'నాయుంగల నేల నిలచెద' రని మన్యువేగంబున నదలించునట్లును, కన్నీరు గార్చుచుఁ బర్యాకులంబగుదృష్టిచే నన్నుఁ గాంచెను. అది గాంచి యే నానతి యొసఁగె ననియె య్యెంచి దేవికిఁ జెప్పక యు దేవరవారిచరణసన్నిధి కరుదెంచితిని. నాదువిన్నపం బవధరించి యనుగ్రహింపవలయు.

దేవా, మలయానిలంబుచేతం బలె నీదుప్రథమాగమనంబుచే నక్కన్యకాలతావనంబు చలించినప్పుడ వసంతునింబోలి సకలలోకమనోహరుండవైననిన్నుఁ గాంచి రక్తాశోక

లతంబలె మకరకేతనుం డక్కన్య నావహించెను. కాదంబరి యిప్పుడు నీకయి గొప్పయాయాసము ననుభవించెడిని. ప్రొద్దు వొడమినది మొదలుకొని యాకన్నియ తనువున, గాఢసాహాయ్యంబు లేకయ, పొగ గలిగింపకయ, బూది సేయకయ, సూర్యకాంతానలంబపోలె నిశ్శబ్దంబుగఁ బ్రజ్వలించుమదనానలంబు పరిజనులకరకమలంబులం గలలేఁదలిరులచాలనంబున నడంగదు. వీవనలకొనలవలనం గాఱుచల్లనినీటం దొలంగదు. మంచిగంధవుపూఁతచే నాఱదు. ఎల్లప్పుడు జలధారల గురియు ధారాగృహంబుచే శాంతింపదు. ఈ మదనపానకంబు వైద్యుతానలంబు నుం బోలె జలయంత్రధారలచేఁ దడిసినకొలఁది మండును. శిశిరోపచారంబు సేసినకొలఁది చెమ్మటం గలిగించును. అగ్నిచే నిర్మలంబు సేయఁబడినవసనంబునుంబోలె మదనాగ్నిచే లావణ్యంబు నిర్మలంబగుట కడుఁజిత్రము. స్త్రీజన హృదయంబు మృదుస్వభావంబయ్యు జలంబు ముక్తాఫలం బగు విధంబున నుత్కంఠచేఁ గఠినం బయ్యెడిని. కావుననె యట్టి సంతాపంబునను విలయ మొందదు. వల్లభజనసంగమాశ బలవతికదా! అదియ యమ్మదవతి జీవింప నాధారభూతంబు. ఏమి చేయుదునో చెప్పుము. ఆకన్నియ యుత్కంఠ నెట్లు చెప్పవలయు? ఎవ్విధంబున వర్ణింపవలయు? ఏయుపాయముచేఁ జూపవలయు? ఏవేదనతోఁ బోల్పవలయు? ప్రచండమార్తాండకిరణసహస్రంబు సహించుకమలంబుల నత్తన్వికి శయనం

బుగఁ బఱువ నయ్యావి వాడిపోయెడిని. ఇట్టు లద్దేవి తన యూష్మంబుచే దినకరమూర్తిని నిర్జించెను. నిష్కరుణుం డగు కామునిచే మథింపఁబడి యాయాచేష్టల సల్పెడిని. ఎటు లన, ఆలేమ కుసుమశయనంబుననుండి తనకాల్గులలత్తుక యంటుట నెఱ్ఱనైనశయ్యాకుసుమంబులచే హృదయమునుండి నెత్తుటం దొఁగిపడినమారశరంబులచేతంబలె సఖిజనంబునకు భయంబు గలిగించెడిని. ప్రతిక్షణంబును గ్రహించుచుఁ జరణయుగళంబుచే రశనాకలాపంబును, సమాగమాశచే హృదయంబును, హృదయంబుచే నిన్నును, ఉరంబుచే లేఁదామరాకును, కంఠంబుచే జీవితంబును, కరకమలంబుచేఁ గపోలంబును ధరించును. ప్రియసఖిచేతంబలె మూర్ఛచే మనంబునఁ బలుమాఱు స్పృశింపఁబడును. పరిచారికచేతంబలె పీడచే నడిపింపంబడును. ఒకప్పుడు లతాగుహాతల్పమున నుండును. ఒక్కవేళ స్థలనళినీవనంబునం బరుండును. వేఱొకప్పు డుద్యానంబు సేవించును. ఒకసమయంబున కొలనిజలంబునం బ్రవేశించును. అటనుండి లేచి కానుగుచెట్లవీథికిం బోవును. అట ముహూర్తమాత్రంబుండి సంగీతగృహంబుం జొచ్చును. అచ్చోటు వెలువడి జలధారలు గురియుధారాగృహంబునకు విచ్చేయును. అందుండి వెడలి యంతఃపురకమలినీతీరంబు సేరును. అందుఁ జక్రవాకంబులయఱుపులకు ఖేద మొందును. ఇట్టిమదనదుశ్చేష్టితాయాసంబులచే ధైర్యంబు తుదముట్టెను.

కమలమయంబో యన హృదయంబు మ్లానినొందెను. చంద్రకాంతమయంబో యన నయనయుగంబు స్రవించుచుండెను. సాగరజలమయంబులో యన నిట్టూర్పులు వృద్ధినొందెను. చక్రవాకమయంబులపోలె మనోరథంబులు సమకూడ వాయెను. సీత్కారంబులయందు దంతకాంతిమిషంబున, మన్మథశరంబులచేఁ జిల్లులువడినహృదయంబునం బ్రవేశించిన చంద్రకిరణంబులం గ్రక్కునటుల చూపట్టును. చంద్రకాంతమణిదర్పణంబులయందు ననేకప్రతిబింబమిషంబున, నూఱువక్కలుగఁ జీల్పఁబడినట్లు తోఁచును. కుసుమశయనంబులయందుఁ బరిమళంబుకొఱకు వచ్చిన తేఁటిగమిచేఁ గప్పఁబడి పొగ విడుచునట్లు గన్పట్టును. కమలశయనంబులయందుఁ గింజల్కరజంబు గ్రమ్మి మండునట్లు చూపట్టును. స్వేదప్రతీకారంబులయందుఁ గర్పూరపురజంబుచే దెల్లనై బూదియైనట్లు గానంబడును. ముగ్ధతచేతనో? విలాసంబుచేతనో? ఉన్మాదంబుచేతనో? ఎటులంగ, కేకప్రవేశము ననుశంకచే ధారాగృహంబులయందు మరకతమయంబులైన మయూరంబులముఖంబులు మూయును.

మఱియు సమస్తమునకుఁ గళంకసహితశశిబింబపోలె దక్షిణానిలంబుకొఱకుఁగూడ మోహంబు వచ్చును. చక్రవాకంబుల శాపంబపోలె రాత్రికొఱకుఁగూడ ప్రజాగరభయం బడుదెంచును. ప్రతిశబ్దంబులపోలె పంజరంబుల శుకులతోఁగూడ దుఃఖంబులు ప్రాప్తించును. మధుకరంబువలె నుపవనకుసుమామో

దంబుతోడ మరణాభిలాషం జేతెంచును. ఇదియునుంగాక, పద్మినీపలాశంబుననుండి జలకణికవలె వడంకును. తమ్మితీవ యుంబోలె శశికరస్పర్శంబుచే వాడును. హంసివలె మృణాళికాహారంబుచే జీవించును. రజనిచరులవలన జానకివలె పీత రక్తంబులైనచంపకాశోకంబులవలన భయ మొందును. ఉషాకన్యకవలె స్వప్నసమాగమంబుచే నైనఁ గృతార్థత నెన్నును. గ్రీష్మనిశవలె నానాటికి క్షీణించును. అన్నివిధంబుల నద్దేవికి మదనవేదనచే సంగంబులును, నలయరచనచేఁ దమ్మితూండ్లును, ఉపదేశంబులచే సఖీవచనంబులును, శయ్యాపరికల్పనంబుచే నుద్యానకుసుమంబులును, నిరంతరము విమచుటచే మదన సాయకంబులును నిశ్శేషంబుగ క్షీణంబు లయ్యెను. పలుమాట లేల? సఖీజను లందఱును నీపే రుచ్చరించువారె. సర్వరహస్యంబులు నీసంబద్ధంబులె. అందఱును గుంపులుగూడి నీయాగమనోపాయంబు నాలోచించువారె. పరిజను లందఱును నీ వృత్తాంతమును జెప్పికొనువారె. చిత్రవిద్యాభ్యాసంబు భావదాకారమయంబె, గాంధర్వసంగీతగానంబులు భవదుపాలంభగర్భంబులె. మోహావేగంబులు నీనామగ్రహణంబున నివర్తించునవియె యగు.' అని తెలుపు కేయూరకుం గాంచి 'ఉండనిమ్ము. ఇప్పుడే వినంజాల, నని చంద్రాపీడుండు కనుంగవ మూయు మూర్ఛ యాతని నాక్రమించెంగాని యవస్థానివేదనంబు పరిసమాప్తి నొంద దాయె. అట్లు చంద్రాపీడుండు

మూర్ఛానిమీలితనయనుఁడయి యక్కాదంబరిని ధ్యానించు వానివలె నుండి పత్రలేఖాకేయూరకులు చేసినశిశిరోపచారం బులచేఁ గొంతదడవునకుఁ దెప్పిఱిల్లి యక్కరంబులు తొట్రు పడుచుండ నిట్లనియె:—

చంద్రాపీడుండు కాదంబరి నుద్దేశించి దుఃఖించుట.

' కేయూరక, నన్నుఁ గఠినహృదయుని గను, ననురాగ రహితునిఁగను నెంచి కాదంబరి యేసందేశము చెప్పి యనుప దయ్యె. మహాశ్వేతామదలేఖలును నట్టె నిరాకరించిరి. ఇది యంతయుఁ బత్రలేఖాముఖంబున నెఱింగితి. కాదంబరి తన స్వభావంబు మహానుభావంబగుటఁ గాన తనభావంబు నంగీక రింపదు. చంద్రకలయాలోకంబునం జంద్రకాంతమణికి నార్ద్రీభా వంబు స్వాధీనంబుగాని తత్కారాకర్షణంబు దీనియధీనంబగునె? పక్షపాతినైనను మధుకరంబున కభిగమనంబె స్వాయత్తంబు గాని మకరందలాభంబునకుఁ గలికావికాసంబె నిమిత్తంబగు. మధువాసలక్ష్మి పరిగ్రహింపకున్న ననురాగంబును గనఁ బఱుపఁ బాదపం బేమి చేయఁ గలదు? ఏమి సెలవొసంగునో యని పెదవిగదలుట నెదుఱుసూచువాసజనునియందుఁ గని కరంబులేక దుఃఖదాయిని యైనవానిఁ బూనుట దేవితప్పని యొప్పక తప్పదు. అమ్మచ్చికంటి యిచ్చగింపకున్నను బలాత్కా రంబునసైనఁ బ్రవర్తింపఁ జేయమికి దేవిపరిజనంబునకును నీ వ్యామోహం బెట్లు కలిగె? అనుగులకడఁ బడియుండుదాన

జనంబునం దేమి సిబ్బితి? ఏటి గౌరవంబు? ఏమి మర్మంబు? అక్కట? మదలేఖయు నకాలమృత్యు వగుకామునిచే నాయాస పెట్టఁబడు దేవిశరీరము నెట్లు లుపేక్షించెను. అట నుండినప్పుడు నాచెవి యెఱుంగదాయె. 'ఇప్పుడు' వినియు దూరస్థవిషయం బున నేమిచేయనగు? వజ్రసారహృదయుల, మైనమముబోంట్ల కును సహింపరానిమారశరంబుల సుకుమారం బైన దేవిశరీరం బెట్లు సహించెడిని? నిమిషమాత్రంబున నే మగునో యెఱుఁగ. దుర్ఘటఘటనాపండితుండును, నిష్కారణకుపితుండును నగు హాతవిధి యింతమాత్రన నిలువఁ డని యెంచెద. అట్లు గాదేని నిప్పురియోజన మగునశ్వముఖమిథునంబు ననుసరించి యమానుషభూమికిఁ జనుటెక్కడ? అందు దప్పిగొని యచ్ఛోదం బును గాంచుటెక్కడ? అట విశ్రమించి యమానుషగీతధ్వని నాలించుటెక్కడ? దాని ననుసరించి చని మహాశ్వేతను జూచుటెక్కడ? ఆమహాశ్వేతతో హేమకూటంబునకు వచ్చు టెక్కడ? అందుఁ గాదంబరిని గాంచు టెక్కడ? ఈజనుని యందు దేవికి ననురాగోత్పత్తి గలుగుటెక్కడ? మనోరథంబు పరిపూర్తి నొందకయ యిటఁ జనుదెంచుటకుఁ దణ్డ్రియానతి వచ్చుటెక్కడ? అకార్యకారి యైనదగ్ధవిధి మమ్మె సుదూరం బునఁ బడనై చె. అయినను దేవిని సమ్మానింప యత్నింతుము. అని చంద్రాపీడుండు చెప్పుచుండఁగనె ' ఇతండు కాదంబరీ వృత్తాంతంబుచేత నే సంతాప మొందుచున్నవాఁడు. ఈతని

నేనును నిజదీప్తిచే నేల సంతాపపెట్టవలయు, నని కనికరించినవానివలె దినకరుం డస్తమించెను.

అంత సకలలోకాహ్లాదకారి యైనచంద్రుం డుదయింప నత్తఱిఁ జంద్రాపీడుండు వల్లభోద్యానంబునఁ జంద్రకాంతమణి శిలాతలంబునఁ బన్నుండి, పడంబు లొత్తుకేయూరకునితో నిట్లనియె:—' కేయూరక,నన్నుఁ గలవరపెట్ట నేల?ఏమువచ్చునందాఁక కాదంబరి మేనఁ బ్రాణంబుల ధరించునా? ఆ కన్యను మదలేఖ వినోదపెట్టఁ జాలునా? అత్తాయ్యాలి నూఱడింప మహాశ్వేత యరుదెంచునా? ఆలలనముఖంబు నేను గాంతు మా? వచింపుము.', అనుటయుఁ గేయూరకుం డిట్లనియె:—

' దేవ, ధైర్యము నవలంబించి ప్రయాణమునకయి యత్నింపవలయు. సఖిజనంబ టులుండుగాక. నిన్నుఁ జూడవలయు నను నిచ్ఛ యక్కన్యను గనుమూయనియ్యదు. హృదయంబు నవలంబించి యున్నసమాగమాశ నిట్టూర్పు విడువనీయదు. రోమాంచము క్షణమునే పైనశరీరంబును విడువదు. ప్రజాగరంబు రాత్రియందును గనిపట్టి చూచుచుండును. జీవితమె కంఠంబు వెలువడదు., అని కేయూరకుండు చెప్పుచుండఁ జంద్రాపీడునిచిత్తంబునఁ బ్రయాణచింత ప్రవేశించెను.

చంద్రాపీడుండు ప్రయాణంబునకయి చింతించుట.

ఏను తలిదండ్రులకుఁ జెప్పక, వారిచరణంబుల కెఱఁగక, వారలయాశీర్వాదంబులఁ గొనక, యుచ్ఛృంఖలంబుగ

నరుగుదునేని నరిగినను నాకు సుఖం బెటు కలుగు? శ్రేయం బెట్లు
సిద్ధించు? ఫలప్రాప్తి యెట్లగు? చిత్తం బెట్లు నిర్వృతినొందు? చని
న తరువాతిచింత యటుండుఁగాక. మొదట పోవుట యెట్లు?
నాతండ్రి తనభుజంబుననుండి రాజ్యభారంబు దించి నాయం దా
రోపించెను. ఇప్పు డేను చెప్పక యరుగు దాఁటుదునేని రాజు
లందఱును సకలసైన్యంబులతో నలుగడలకు నవశ్యంబును జను
వం గలరు. సేవాపరు లైనరాజు లెటుండుదురుగాక. ప్రజలును పుత్ర
దారాదులను విడిచి వెన్వెంటఁ బడఁ గలరని తోఁచెడిని. మఱియు
నేను చనఁగా పోనిత్తురా. పోయిన నేమని నాతండ్రి నా
యవిషయంబునకుఁ గోపించి నాయందలి స్నేహం బన్యునియందు
బెట్టుకొని యుండనైన నాతండ్రికి నోరుం జేవంబు కలదు?
నాతండ్రి వెన్వెంట నేతేరఁ బుడమి యెల్ల నేతెంచునని యె
యెన్నవలయు. అప్పుడు నే నెటకుఁ బోవలయు? నెందు విశ్ర
మింపవలయు? నెచ్చోట దాఁగికొనవలయు? పట్టువడి తండ్రి
మోమెట్లు చూడవలయు? అడిగినను నుత్తర మేమి చెప్ప
వలయు? మఱి దైవయోగంబునఁ జిక్కకపోదునేని నప్పుడును
నాయాసపెట్టఁ దగని నాతండ్రి నెట్లాయాసపెట్టుదు? దుఃఖంబు
నెఱింగియుండని నాతల్లి నెట్లు దుఃఖసాగరంబునఁ బడవైతును?
ఈపాపం బేమిసేసిన వాఁ డగు? ఇంక నాతలిదండ్రులకుఁ దెలిపి
వారియనుజ్ఞఁ గొని పోవుదునేని నేమి చెప్పుదు? గంధర్వరాజ
నందన నాయం దనురాగంబు చెంది మకరకేతునిచే నాయాస

పెట్టఁబడి దుఃఖించుచున్న దని చెప్పుదునా? దానియందు నాకు గొప్పయనురాగము గలదు; గాన దాని విడిచియేను ప్రాణంబుల ధరింపఁ జాల నని వచింతునా? అట్లుగాక, మా కిరువురకుఁ బరిణయంబు సేయ మహాశ్వేత వార్తయనిచె నని వక్కాణింతునా? ఎట్లును తల్లిదండ్రులకుఁ దెలిపి వారియనుజ్ఞ మెయి వెలువడశక్యంబుగాదు. ఏలన, దిగ్విజయయాత్రకు వెడలి యిప్పుడు మూఁడుసంవత్సరముల కేతెంచితిని. ఇప్పటికి సైన్యంబును జేరదాయెను. గమనకారణంబు సెప్పక తండ్రి యొద్ద నెట్లు సెలవుగొన నగు? సుహృత్సాధ్యం బగునిక్కార్యంబున ననర్థంబు ప్రాప్తంబయ్యె. ఒక్కండ నేమి సేయుదు? వైశంపాయనుండును సమీపంబున లేఁడు. ఏమి సేయుదు? ఏమని యడుగుదు? ఎవ్వనితో నాలోచింతు? నాకెవ్వం డుపదేశించు? ఎవ్వండు నాకార్యంబు నిర్దేశించు? ఇఁక నెవ్వనికి నాయం దెక్కుడుస్నేహంబు గలదు? ఏదుఃఖింప దానుదుఃఖించుచు, నే సుఖింప దానుసుఖించుచునుండువాఁ డెవ్వఁడు? మఱి యెవ్వండు నాకార్యంబునఁ బర్యాకులత్వంబు వహించును. ఇఁక నెవ్వనియందుఁ గార్యభారంబునిడి యే సుఖం బుందుదు! మఱి యెవ్వండు కోపించిననాతండ్రికిఁ దల్లికిని బోధించి నన్నుఁ గొనిపోవ సమర్థుం డగుఁ? అని చింతించుచుండ నారాత్రి గడచెను. ప్రాతఃకాలంబుననె స్కంధావారంబు దశపురి కరుదెంచె నని విని చిత్తంబున నూఱటగొని యిట్లు తలంచెను.

‘చిత్రము. ధన్యుండ నైతి. విధి కనుగ్రాహ్యుండ నైతి. ఏఁ జింతింపగనే నారెండవడెందము బైనవైశంపానుండు వచ్చెడు వార్త తెలిసె, నని ప్రహర్షపరవశుండై కేయూరకుంగాంచి ‘కేయూరక, కార్యంబు సిద్ధించె ననియె నిశ్చయింపుము. వైశంపాయనుండు వచ్చుచున్నవాఁ, డని వచింపఁ గేయూరకుం డిట్లనియె:—‘దేవ, మెఱుంగు గర్జారవంబును, వెల్లవారిన తూర్పుదెస చంద్రోదయంబును వసంతలక్ష్మి పల్లవోద్భేదంబును దెలుపునట్లీయవస్థయె దేవరవారియాగమనంబును దెలిపెడిని. దేవరవారి కవశ్యంబును దేవీప్రాప్తి కలుగవలయు. ఎవం డైన నెప్పుడేనిఁ జంద్రికారహితుండగుచంద్రునిఁగాని, కమలినీరహితంబగుకమలాకరంబుంగాని, లతాశూన్యం బగునుద్యానభాగంబునుగాని గాంచెనె? మధుమాసంబు సర్వజనసుభగంబయ్యు సహకారకుసుమమంజరీగ్రహణంబులేకయు, గజపతిముఖంబు మదలేఖాలక్ష్మి నొందకయుఁ బ్రకాశింపనేరదు. మఱియేమన, వైశంపాయనుఁ డరుదెంచి యాతనితో నేలిననారు గమనసన్నాహంబు సాధించునంతకుఁ గొంతకాలక్షేపం బగు. కాదంబరికిరావస్థ కాలక్షేపమునుసహింప దనివిన్నవించియె యుంటిని. దేవరవారి యాగమనవృత్తాంతంబు ముందుగనే నరిగి విన్నవింప నా కనుజ్ఞనొసంగ వేడెద.’ అని కేయూరకుండు విన్నవింపఁ జంద్రాపీడుం డిట్లనియె:—‘ఏమి చెప్పితివి? ఇట్టి దేశకాలజ్ఞత యెఁకనెవ్వనికిఁ గలదు. మాయం దిట్టి నిష్కపటభక్తి

గలవాఁ డవ్వాఁడు? కాన భాగుగ నాలోచించితివి. దేవి కివ్వార్త
చెప్పి యాశ్వాసింపఁజేయ నరుగుము. నీతోఁ బత్రలేఖయు రాఁ
గలదు. ఇయ్యదియు దేవి కనుగ్రహపాత్రమే.' యని పలికి
మేఘనాదునిఁ బిలిపించి 'మేఘనాద, పత్రలేఖం గొనివచ్చు
టకు నిన్ను నెచ్చోట నునిచితినో, అచ్చోటికి నీవు కేయూరకుని
తోఁ బత్రలేఖం గొనిపొమ్ము. ఏను వైశంపాయనుం గాంచి
వెన్వెంట నేతేరం గలను.' అని యానతిచ్చి కేయూరకుం
గాఁగిలించికొని 'కేయూరక, నీవు దేవీసందేశముం గొని
వచ్చినవాఁడవు గావు. కాన తదనుగుణంబుగ నే నేమి మాఱు
వల్కవలయు? అయినను బత్రలేఖ వచ్చి విన్నవింపఁ గలదు.'
అని పల్కి పత్రలేఖం గాంచి 'పత్రలేఖా, దోసిలియొగ్గి నా
విన్నపం బిట్లు కాదంబరికి విన్నవింపుము.

చంద్రాపీడుండు పత్రలేఖాముఖంబున కాదంబరికి సందేశంబు నంపుట.

'స్వభావంబు వాత్సల్యంబు గలదియగుటఁ బ్రథమ
దర్శనంబునన ప్రసాదాతిశయంబు గనఁబఱిచిన దేవినిఁ బ్రణా
మంబుచేనైన సంభావింపక యేతెంచిన యేను జాడ్యముచేఁ
బ్రజ్ఞను, మౌఢ్యముచే జ్ఞానమును, చాంచల్యముచే ధైర్యము
ను, లాఘవముచే గౌరవమును, పారుష్యముచే బ్రియంవదత్వ
మును, క్రౌర్యముచే దయాళుత్వమును, మాయాజాలముచే
నార్జవమును, అసత్యముచే సత్యమును, అవమానముచే
దృఢభక్తిని, ధార్ష్ట్యముచే లజ్జను, క్షుద్రతచే నౌదార్య

మును, కృతఘ్నతచేఁ గృతజ్ఞతను,, నిట్లు సకలగుణంబులను దోషంబులచే మార్చికొంటిని. అట్టి యే నీక నేగుణలేశము నవలంబించి మగుడఁ బరిగ్రహింప వేఁడెద? దేవి యైన నె ట్లంగీకరించును? 'లేనివినయంబు గనఁబఱిచి దేవిచిత్తంబు మోసపుచ్చ లే దని విన్నవింతునా? ప్రకృతిపేశలం బగుదేవి డెందం బపహరించి కొనిపోనైతి నని చెప్పిపుత్తునా? నిష్కారుణుండనై ప్రాణసంశయకరం బైన దేవిశరీరావస్థ నుపేక్షింప లే దని వార్త నంపుదునా? ఏ నే మని చెప్పిపుత్తెంతును? ఇట్లు సర్వగుణహీనుండ నైననాకు దేవిగుణంబులె యాధారంబు. సాజంబుగ సరసం బైననీసరళత్వము దూరమునం దున్నను మదనాగ్నిచేఁ గాల్పఁబడునన్నుఁ దప్పక రక్షింపఁ గలదు. నీస్నేహాలత్వము పలుమఱు నన్నవశ్యంబును బిలువ గలదు. నీస్థిరబుద్ధి నన్ను ముఖ్యంబుగఁ గైకొనంగలదు. నీవత్సలత్వము నన్నంగీకరింపఁగలదు. నీమహానుభావత్వము నన్నాదరింపఁగలదు. నీయుదారత్వము చిత్తంబున నవకాశం బొసంగఁ గలదు. ఇట్టియేను నిర్లజ్జహృదయుండనై వచ్చి, మగుడ మోము సూపుసాహసి బయ్యెకొననైన దేవిప్రసాదంబులె కారణం బగు. ఈప్రసాదంబులు నిర్మలంబు లగుటను, నుదారంబు లగుటను నన్నీ దేవిసేవకు యుత్సాహపెట్టెడిని. సేవానైపుణ్యమును నేర్పెడిని. ఆరాధనోపాయంబుల నుపదేశించెడిని. ఇట్టు లుండు మని యాజ్ఞాపించెడిని. లజ్జచేఁ బరుగిడువాని

బలాత్కారంబునఁ దోడ్కొనివచ్చెడిని. నీయనుజ్ఞ లేకున్నను, దూరంబునకుఁ దప్పించుకొనిపోయిననను వేఱుచోట తుణంబైన నుండనీయక దేవిపాదమూలంబునకుఁ జేర్చెడిని. కాన నాయాగమనంబు నిష్ఫలంబుగానియట్లును, జగంబు శూన్యంబుగానివగిదిని దేవిశరీరరక్షణంబునకయి దేవియె యత్నపడవలయు.' అని వార్త చెప్పి మగుడ నిట్లనియె:—

'పత్రలేఖా, నీ వరుగునప్పుడు శరీరసంస్కారంబున ననాదరంబు సేయవలదు. ఆహారవేళ నతిక్రమింపవలదు. ఎఱుఁగనిదారిం బోవలదు. తెలియనివారికి మన సియ్యవలదు. శరీరంబునెడఁ బ్రమాదంబు సెందవలదు. ఏమి సేయుదు? నీకంటెను నాకు దేవీప్రాణంబు లతిప్రియంబులు. కావుననె దేవీప్రాణసంధారణంబునకయి నిన్నొంటిమెయి విడుచుచున్నాఁడ. మఱియు నాజీవితంబును నీహస్తంబున నున్నది. కాన శరీరంబు యత్నంబునఁ గాచికొనునది, అని చెప్పి కేయూరకుం గాంచి 'దేవికి మదాగమనంబు దెల్పి నన్ను దోడ్కొనిపోవుటకయి క్రమ్మఱ నీవు మహాశ్వేతాశ్రమంబున కరుదెమ్ము.' అని యానతిచ్చి యనిచెను. ఇట్లు పత్రలేఖ కేయూరకునితో నరుగఁ జంద్రాపీడుండు 'స్కంధావారంబు శీఘ్రింబ వచ్చునా? విళంబించునా?' అనుచింతతో క్షణంబుండి యవ్వార్త యెఱుంగ వార్తాహరు ననిచి వైశంపాయను నెదుర్కొన సెలవుగొనవెంచి తండ్రియొద్ద కరిగి ప్రణమిల్లిన నంతఁ దారాపీడుండు నవజ

లధరధ్వనిగంభీరం బగుస్వరంబుతో రమ్మని పల్కి పాదపీఠంబు
నఁ గూర్చుండఁజేసి నిజకర్ణంబున నాతనియంగోపాంగంబులఁ
దడవుచు శుకనాసునకుఁ జూపి యిట్లనియె:—'మంత్రిముఖ్యా,
ప్రతాపానలంబుధూమరాజియు, మకరధ్వజవనంబుతమాల
వల్లియునై గంధగజంబునకు మదలేఖవలెను, కమలాకరంబు
నకు మధుకరావళివలెను బ్రకాశించునిక్కుమారుశ్మశ్రురా
జిం గంటివా? ఇతండు వివాహయోగ్యం బగుదశ నొందెను.
కాన విలాసవతితో నాలోచించి కులము, రూపము నుం గల
యొక్కరాకన్నియను నిశ్చయింపవలయు. కుమారునివదనంబు
గాంచితి. వధూముఖకమలదర్శనంబుచే నాడెందంబు నానంద
పెట్టుము.' అనుటయు శుకనాసుం డిట్లనియె: —' దేవరవారు
బాగుగ నాలోచించిరి. ఇతండు సకలవిద్యల హృదయంబున
నిలిపెను. సర్వకలల సమ్మానించెను. ప్రజలనెల్ల స్వీకరించెను. సక
లదిగ్వనితలకరంబులు గ్రహించెను. గృహిణింబోలె రాజలక్ష్మిని
నిశ్చలంబుగ నిలిపెను. చతురుదధిమేఖల యగుభూమిని వహిం
చెను. ఇతనికిఁ బరిణయంబు సేయకుంటకు శేషించినకార్యం బేమి
కలదు?' అని శుకనాసుండు వచించుచుండఁ జంద్రాపీడుండు లజ్జ
చే మోము వాంచి తనమనంబున నిట్లు వితర్కించెను. 'చిత్రము!
ఏమి యీ సంవాదము? ఏను గాదంబరీసమాగమంబున కుపా
యంబు నాలోచించునప్పుడ మజ్జనకున కిట్టి బుద్ధి కలిగెను. అం
ధకారంబునఁ బ్రవేశించినవానికిఁ బ్రకాశంబును, అడవినిఁ

ద్రోవఁ దప్పినదానికి మార్గదర్శకుండును, మహార్ణవంబునఁ బ డినవానికి యానపాత్రలాభంబును, మృతినొందువానిపై నమృతవృష్టియుంబలె నాకీసంభాషణం బానందజనకం బయ్యె, నని యెంచుచుండ దారాపీడుండు లేచి చంద్రాపీడుని భుజంబునఁ గరంబునిడి శుకనాసుండు దోడరా విలాసవతీభవనంబున కరిగెను. అంత నిందూదయంబు గాంచి విలోలం బైనసాగరవేలయుంబోలె వేగిరం బభ్యుత్థానంబు సేసిన విలాసవతి నవలోకించి నిల్చుండియె తారాపీడుం డిట్లనియె :—దేవి, నీవు వధూముఖావలోకనసుఖంబునకయి యాలోచింప వేల? యౌవనారంభసూచనియైనకుమారునిశ్మశ్రురాజి వివాహమంగళసంపాదనంబునకయి యాదేశించెడిని. ఇఁక నీ వేమి యాన తిచ్చెదవు? ఏ నడిగినను మాఱు సెప్ప వేల? ఈవు వరునకుఁ దల్లివి గదా? చంద్రాపీడునిపైఁ బ్రేమ నీ కేల లేదు?, అని యిట్టి నర్మాలాపంబులతో నానంద మొందుచుఁ గొంతదడవుండి యట నుండి వెడలెను. చంద్రాపీడుండును శుకనాసముఖంబునఁ దాను వైశంపాయను నెదుర్కొనఁ దండ్రియనుజ్ఞ వడసి ప్రయాణసంవిధానోద్యమంబున నాపవలు గడచి రాత్రియందు శయనగతుండయ్యు మేల్కనియె నడికిరేయి గడపి జ్యోత్స్నాప్రవాహంబు వర్షించునవియో యన రాజిల్లుచంద్రకిరణంబులచే గమనోత్సాహంబు నొంది యాత్రను సూచించుశంఖనాదంబునకయి యానతి యొసంగుటయుఁ దారదీర్ఘం బగుశంఖధ్వని వెడలెను.

### చంద్రాపీడుండు వైశంపాయను నెదుర్కొన నెంచి స్కంధావారంబున కరుగుట.

అనంతరము చంద్రాపీడుం డింద్రాయుధంబు నెక్కి తురంగసహస్రంబులతో నగరంబు వెలువడి దశపురీమార్గంబున నరుగుచుఁ వేగునంతకు మూఁడుయోజనంబులు గడచి దినకరోదయంబయిన పదంపడి 'రెండవభూసన్నివేశంబో? అపారం బగు రెండవమహాసముద్రంబో?' యనఁ దనరుస్కంధావారంబుం గాంచి తనమనంబున నిట్లు వితర్కించెను. 'ఆహా! ఇప్పుడనున నేరికిం దెలియనట్లే నరిగి నెచ్చెలి కి చ్చగునచ్చెరువు గలిగించెదను.' అని తలంచి యట గుఱ్ఱపుదళంబు నిలిపి రాజపుత్రులనందఱ యుండ నియోగించి మూఁడునాల్గువారువంబులతో వెడలి స్కంధావారంబు బ్రవేశించి 'వైశంపాయనుం డెం దున్నవాఁ' డని యడుగుచు నాఁదత్సమీపంబున నున్న కొందఱు స్త్రీలు 'భద్ర, ఏమి యడిగెదవు? ఇం దెట్లు వైశంపాయనుండు కలఁడు?' అనిపలుక 'అయ్యో! పాపులార, ఏమి యి ట్లసంబద్ధంబుగా వచించెదరు?' అని వారల నదలించుచు శూన్యహృదయుండై మఱి యెవ్వారి నడుగక జంకుగొనినజింకపిల్లవలె నేదియుఁ గానక, యేమియు మాటాడక, యొక్కచోనైన నిలువక 'ఎచ్చటికి వచ్చితిని? ఏమికతంబున వచ్చితిని? ఎక్కడకుఁ జనుచున్నాఁడను? ఏమి చూచుచున్నాఁడను? ఏ దెసకుఁ బోవలయు? ఏమి చేయవలయు?' నని యేదియుఁ దో

పక అబుధునివలెను, మూకునివలెను, సేనానివేశం బంతయుఁ దిరుగుచుండెను. అది గాంచి 'ఇంద్రాయుధంబుగుర్తునఁ జంద్రాపీడుం డని నిశ్చయించి పఱచుచు వచ్చి, లజ్జచేఁ బ్రణమిల్లు రాజసహస్రంబులఁ గాంచి 'వైశంపాయనుం డెక్కడ?, అని యడుగ వారందఱు తమలో నాలోచించుకొని 'దేవ, ఈతరుతలంబునఁ గూర్చుండుము. పిదప వైశంపాయనునివృత్తాంతము సెప్పఁగలము.' అని విన్నవించిరి. వారలు స్ఫుటంబుగఁ జెప్పినను గష్టతరం బైనయావచనంబుచే హృదయంబు దల్లడిల్లుటఁ జంద్రాపీడుండు సొమ్మసిలెను.

అంత నారాజన్యులు రాజనందను నశ్వంబుననుండి దించి కూర్చుండఁబెట్టి పట్టుకొని శైత్యోపచారంబులు సల్పుచుండఁ గొంతదడవునకుఁ దెలివినొంది వైశంపాయనుంగానక తన్ను గాంచి 'ఏమి యిది? ఏ నెందున్నాఁడ? ఏమి చేయుచున్నాఁడ?, నని యేదియు నెఱుఁగక, వైశంపాయనుండు లేక స్కంధావారంబుమాత్ర మే తెంచుటం జేసి యప్రియంబు నూహించి 'విలపింతునా? ఊరకుందునా? ప్రాణంబులు విడుతునా? ఒంటిమెయి నే దేనిదెస కరుగుదునా?, యని కర్తవ్యమును నిశ్చయింపఁ జాలక, లోలోనఁ గరఁగువానివలెను, దహింపఁబడువానివలెను దుఃఖంబుచే జిత్తంబున వేవిధంబుల వితర్కించెను. 'చిత్రము. రమ్యం బయ్యు నాకు జీవలోకం బరమ్యం బయ్యె. పుడమియుండియు శూన్యం బయ్యె. కన్ను

లుండినను దెసలు చీఁకట్లు గప్పెను. ఎవ్వనిఁ గనుఁగొందును? ఎవ్వనితో సుఖ ముండుదును? ఇప్పుడు నాకు జీవితంబుతో నైనఁ, గాదంబరితో నైన నేమి? వైశంపాయనునికయి యెందుఁ బోవుదు? ఎవ్వని నడుగుదు? ఎవ్వని వేఁడికొందు? నా కెవ్వం డట్టిమిత్రరత్నంబుం గనఁబడుచును, వైశంపాయనుని విడిచి నాతండ్రికి మో మెట్లు గాంతును? శుకనాసు నెట్లు గనుఁగొందు?, అని యుత్తలంగునఁ జింతించుచు నధోముఖుండయి తన్నపరాధినింబలెను, మహాపాతకినింబలెను దలంచుచు మోము చూపక మెల్లన వారల నిట్లడిగెను:—'ఏవచ్చినపదంపడి నడుమ నేదేని సంగ్రామంబు ప్రాప్తం బయ్యెనా? అసాధ్యరూపం బగు మహావ్యాధి కలిగెనా? ఏలయిట్టిబెట్టిదంపుమహావజ్రపతనం బుపనతం బయ్యె?, అనుటయుఁ జెవులు మూసికొని సైనికు లిట్లనిరి.

సైనికులు వైశంపాయనునివృత్తాంతంబు చెప్పుట.

'దేవ, దేవరవారివలె వైశంపాయనుండును శతాధిక వర్షంబులు జీవించెడిని., నావిని చంద్రాపీడుం డుజ్జీవించినవానివలె నానందాశ్రువు లొలుక వారల నట్టె కౌఁగిలించికొని యిట్లనియె :—'వైశంపాయనుండు జీవించియుండునెడ క్షణమున్నెప్పైన వేఱుచో, నుండనేరఁ డని భావించి యిట్లడిగితి. ఇప్పుడు జీవించియుండెడి ననునక్కరంబులు వీనులం బడియె. అతండు రానికతం బేమి? ఎం దున్నవాఁడు? అతని నొంటిగ

నెట్లు విడిచి వచ్చితిరి? మీరలు బలాత్కారంబునయిన నేలఁ గొని రాఁగైతిరి., ఈయర్థం బెఱింగ నాడెందం బుత్తలపాటొందెడిని, అని యడుగ వార లిట్లనిరి :—దేవ ? జరిగినవృత్తాంతంబు వినుము. సైన్యంబుతోఁ గలిసి మెల్లమెల్లగా వెనుక నరుదెంచు మ్మని వైశంపాయనునితో దేవరవా రనుజ్ఞయిచ్చి వెడలఁగా మఱునాఁడు ప్రయాణభేరి మ్రోయించి సైన్యంబు సన్నద్ధంబుసేయ ప్రాతఃకాలంబునను వైశంపాయనుఁ డిట్లనియె:—ఈయచ్ఛోదం బతిపుణ్యప్రదం బని పురాణంబుల వినంబడుచుండును. కాన యిక్కొలనం గ్రుంకి దీని తీరంబున వెలయుసిద్ధాయతనంబున భవాభవప్రభుండును, శశాంకశకలశేఖరుండును, భగవంతుండు నగుమహేశ్వరునికిఁ బ్రణమిల్లి యరుగుదము. ఇచ్ఛో టెవ్వండేని స్వప్నమందైనఁ గాంచి యుండెనే ?, అని పలికి పాదచారియయి యచ్ఛోదసరస్తీరంబు చేరెను. అందలిప్రదేశం బతిరమ్యం బగుటం జేసి నలుదెసలుఁ గాంచుచు నొకలతామండపంబు విలోకించెను. దానిం జూచి చిరకాలంబుననుండి చూడనిభ్రాతంబో లెను, పుత్రింబలెను,మిత్రుంబలెను తెప్పవేయక యట్టెచూచుచు స్తంభితునివలెను, లిఖితునివలెను నుండి మూర్ఛచే నాక్రమింపఁబడువానివలెను, ఇంద్రియంబులచే విడువఁబడువానివలెను నచ్చటం గూర్చుండి,కనుఁగొలంకుల నిరంతరాశ్రుధారలం గార్చుచు లోననేదియోధ్యానించువానివలె నధోముఖుండయి యుండెను.

అంత నేమతనిం గాంచి యితండు లేఁఛాయమున నున్నవాఁ
డగుట నతిమనోజ్ఞం బగువిప్రదేశంబుం జూడ నితనికిమనోవికా
రంబు గలిగె నని తలంచి 'ఇది రమణీయం బగుప్రదేశంబు. దీనిం
గాంచితివి. లెమ్ము. కాలం బతిక్రమించెను. సేనాసముదాయం
బు మీరాక నిరీక్షించెడిని. ఇంకను దడవు సేయ నేల?, అని
పలుక నతండు మాయాలాపంబు విననివానివలెను. జడునివ
లెను, మూకునివలెనునయి యేమియు మాఱు పల్కఁడయ్యె.
కేవలము నాలతామండపమునె కాంచుచుండెను. రమ్మని
యేము పలుమఱు బోధింప నందె దృష్టి నుంచి మాతోఁ గఠి
నంబుగ నిట్లనియె :—'ఏనీప్రదేశంబుననుండి రాఁ జాల. మీ
రలు సైన్యంబు దోడ్కొని పొండు. చంద్రాపీడుం డరుగఁగా
మీ రిందు క్షణంబైన నుండం దగదు.', అనుటయు నితనికి
దైవవశంబున వైరాగ్యకారణంబు గలిగె నని యెంచి పలు
మఱు బోధించి తుదకుఁ గఠినంబుగ నిట్లు చెప్పితిమి. 'ఆర్యుం
డగుశుకనాసునివలన జన్మంబు గాంచి చంద్రాపీడునితోఁ గూడ
నొక్కచోఁ బెఱిఁగి, యట్లు విద్యాగృహంబున మహాయత్నం
బున శిక్షితుండ వైననీ కిది యుక్తమా? ఈవు మిత్రుండవును,
గుణవంతుండవు, నని సర్వంబు నీయధీనంబు చేసి చంద్రాపీడమ
హారాజు చనియుండ నిది యంతయు విడిచి యిందుండ నగు
నా? మాకు నీయందు స్నేహంబును, భక్తియు నటుండఁగాక.
ఈశూన్యారణ్యంబున నిన్నొంటిమెయి విడిచి, చంద్రశీతలప్ర

కృతి యగు చంద్రాపీడమహారాజుచే నేమి మాటబడఁగల మో? చంద్రాపీడమహారాజును, నీవు నన వేఱు గలదె? ఈ సమ్మోహంబు విడిచి ప్రయాణంబు నిశ్చయింపుము., నావిని యతండు మమ్ముఁ గాంచి యి ట్లనియె:—'గమనంబునకయి మీరు బోధింప నింతమాత్రం బే నెఱుంగనె? ఇంతకు మున్న చంద్రాపీడుని విడిచి క్షణంబైన వేఱుచో నుంటినె? అయిన నేమి సేయుదు? ఈక్షణంబున నా కంతటను స్వాతంత్ర్యంబు విగళితం బయ్యె. ఎటులన, నామనం బేదియో స్మరించుచు వేఱువిషయంబునఁ బ్రవర్తింపదు. నాదృష్టి యేదియో గాంచుచు వేఱుచోఁ బ్రసరింపదు. డెందం బాసక్తం బైనట్టు లేమియు నెఱుంగదు. సంకెలలు వేయఁబడినయట్లు నాచరణంబు లింకొక్కయెడకు రాఁజాలవు. కాన నాయత్నంబున నేను రాఁజాలను. ఇఁక బలాత్కారంబున మీరలు నన్నుఁ గొనిపో నెంతురేని నిప్ప్రదేశంబునుండి కదలునెడ నాజీవితంబు నిలువనేర దని యెంచెద. కాన నన్ను నిర్బంధింపవలదు. మీ రరిగి యావజ్జీవంబును దనివితీఱఁ జంద్రాపీడముఖకమలదర్శనసుఖం బనుభవింపుఁడు. అల్పపుణ్యుండ నగునా కది ప్రాప్తించినను దానిం దైవంబు తనకరతలంబునఁ ద్రుంచివైచెను.' అని చెప్పుచుండ 'నిట్లేల చెప్పెదవు? యువరాజుసమీపంబునకు విచ్చేయు' మని యడుగ నతం డిట్లనియె:—'ఇది వచింప లజ్జించెద. ఏను రాఁ జాలనికారణం బేమియు నెఱుంగ. ఈ

యంశము మీకుఁ బ్రత్యక్షమకదా? నీ వెఱుఁగుదువని మిన్న కుండెను. అంతఁ గొంతదడవునకు నతని నేనాహారంబునకు బోధింప నిట్లనియె:— 'మిత్రుండగు చంద్రాపీడునకుఁ దన జీవితంబుకంటెను నీప్రాణంబు లతిప్రియంబులు. కాన యియ్యావి నన్ను విడిచి చనకుండ యత్నింపవలయు, నని లేచి స్నానంబు చేసి వనవాసోచితం బగునభ్యవహారంబు నొనరించెను. ఈ క్రమంబు నవలోకించి విస్మయంబు గొని యాతనివర్తనం బుఁగాంచుచు మూఁడుదినము లుండి నిరాశులమై యంతఁ గొంతబలం బునిచి యే మరుదెంచితిమి.' అనుటయుఁ గలశో న్నైవఁదలంపరానియా వైశంపాయనవైరాగ్యవృత్తాంతంబు వినఁ గనె చంద్రాపీడునిచిత్తంబున నిట్లు చింత వొడమెను.

చంద్రాపీడుండు వైశంపాయను నుద్దేశించి చింతించుట.

'సర్వపరిత్యాగకారణంబయు, వనవాసైకశరణం బైన వైరాగ్యం బీతనికిఁ గలుగ నేమి కారణము? నాలోపంబు నెట్టుంగ. నాతండ్రి యనుగ్రహంబున రాజులు నన్నుంబలె నతనిని నర్చింతురు. అతనికిని వాంఛాధికంబు లైనసర్వభోగం బులయందును గొంచెమేనిఁ గొఱంతవడదు. నాయందుం బలె నతనియందును సకలసంపదలును వాసము చేసెడిని. మఱి వచ్చినప్పుడు తండ్రిగాని, తల్లిగాని యప్రియంబు పలికి యుండిరె? అతండు గురుజనంబుపయి భక్తిలేనివాఁడా? గుణ రహితుండా? చలచిత్తుండా? ఏకపుత్రత్వదుర్లలితుండా? ఏమికతం

బున జన్మంబు మొద లన్నివిధంబుల నుపకరించిన గురుజనంబు పయిఁ బ్రేమ విడిచి వారికి ఖేదంబు గలిగించెడిని? ప్రశాంతికైన నిది యొడనుగాదు. ఏలన, ఇతండు విద్వజ్జనోచితం బగుగార్హస్థ్యమునకైనఁ బ్రవేశింపఁ డయ్యె. దేవపితృమనుష్యులఋణత్రయంబు దీర్పఁ డయ్యె. ఋణత్రయబద్ధుం డెక్కడికిఁ బోఁగలఁడు? అతండు పుత్రపౌత్రసంతతిచే వంశంబు నిలిపెనే? మహాక్రతువులఁ జేసెనే? సప్తసంతానంబులచే మేదిని నలంకరించెనే? కీర్తిని గణించెనా, గురువులఁ దనియించెనే? సాధువులఁ బూజించెనే? భృత్యులఁ బెనిచెనే? స్త్రీలను గని, విని యేనినెఱింగెనే? జీవలోకసుఖంబు లనుభవించెనే? ధర్మార్థకామమోక్షంబు లనుపురుషార్థంబులలో నొక్కటేని నార్జించెనే? ఈతం డేమి చేసె? నని దుఃఖించుచు నాచెట్టుక్రింద శూన్యహృదయుండనయి యుండి రాజలోకంబునకు సెల వొసంగి తత్కాలకల్పితం బగుపటమండపమునఁ బ్రవేశించి శయనీయంబు చేరి యిట్లు చింతించెను. 'ఏ నిత్తెఱి నాతలిదండ్రులకుఁ జెప్పక, శుకనాసుం జూడక, మనోరమ నూఱడింపక యిట నుండియే పోవుదు నేని నప్పుడేనును వైశంపాయను ననుసరించిన వాఁడనే యగుదును. ఊరు చేరుదునేని మరలి యేతెంచుట సంభవింపదని నామనం బాశంకించెడిని. కాన యేమి చేయుదు? ఆలోచింపఁగా, వైశంపాయనునికయి పోవునన్ను నాతలిదండ్రులుగాని, శుకనాసుఁడుగాని వారింపఁజాలరు. కాఁబట్టి

నగరంబు చేరియె మరలి యే తేరఁగలను.' అని నిశ్చయించి పునరాగమనంబు కాదంబరీసమాగమోపాయంబుగాన వైశం పాయనవియోగదుఃఖంబును పరిణామసుఖం బగునౌషధంబుం బలె బహుమానించుచు ముహూర్తం బుండి యాహారకృత్యం బు నిర్వర్తించి యారేయి సేనానికాయంబుతో వెడలి ప్రభా తసమయంబునకు నుజ్జయిని ప్రవేశించెను.

చంద్రాపీడుండు నగరంబు చేరుట.

అంత గుంపులుగూడినవారలును, అధోముఖులును, ఉద్బాష్పనేత్రులును నగు జనులచేతను, మునులచేతను, ముము క్షువులచేతను, నిస్పృహులచేతను, దుర్జనులచేతను, తలిదండ్రుల చేతనుంబలెను, మిత్రులచేతనుంబలెను నడుగఁబడుచును, వచిం పఁబడుచును, వర్ణింపఁబడుచు నున్న వైశంపాయనవృత్తాంతంబు నాకర్ణించుచు చిత్తంబున నిట్లు వితర్కించెను. 'బాహ్యజనం బునకె యిట్టిచింత కలిగియుండ బాల్యంబు మొదలుకొని యం కంబున లాలించుచుం బెంచినతల్లిదండ్రుల కెంత చింత యుండ వలయు? అట్టివారల నే నెట్లు గాంతు?' నని చింతించుచు నానాగ్రంబున దృష్టి నునిచి సర్వవృత్తాంతంబు లక్షింపక రాజకులంబుప్రవేశించి ద్వారంబున వారువంబు దిగి లోనఁ బ్రవేశించుచు 'మహారాజు విలాసవతితో శుకనాసునివీటి కరిగె, నని వినియటనుండి మరలి శుకనాసభవనంబున కరిగి యందు 'హా, వత్స, వైశంపాయన, ఇప్పటికిని నాయంకంబున లాలింపఁ

బడవర్షుండ వైనబాలుండవెగదా? ఇట్టి నీ వొంటిమెయి వ్యాళసహస్రభీషణం బయినశూన్యారణ్యంబున నెట్లున్న వాఁడవు. నీకు నట శరీరరక్ష యెవ్వండొనరించు? నీ కాహారం బెవ్వాఁడుసంపాదించు?నీకు నిద్రాసుఖప్రదం బయినశయనీయం బెవ్వాఁడుకల్పించు? నీ వాకలిగొన్నను, దప్పిగొన్నను నెవ్వాఁడు విచారించు? వధువునేనిఁ బరిగ్రహింప వైతివి? నీవు రాఁగనె నీ తండ్రినిఁ బ్రార్థించి కోడలిమోము గాంతునని యాలోచించు మందభాగ్య నైననాకు నది లేక పోవ నీముఖదర్శనంబును దుర్లభం బయ్యె. కుమార,నీకెందు రుచించెనో, నీతండ్రికి విన్నవించి యటకు నన్నును గొనిపొమ్ము. నిన్నుఁ జూడక జీవింపఁ జాల, తండ్రీ, నీవు నన్ను బాల్యంబుననైన నవమానింప వైతివి. నీ కిట్టినైష్ఠుర్యం బెట్లు కలిగె? నన్నుఁ బరిత్యజించి యుండ నాపై నీకిట్టికోపం బేల కలిగె? నీకంటె మాకెవ్వరు గలరు? దేశాంతరపరిచయంబున మాయందు స్నేహంబు భంగం బయ్యెనా? చంద్రాపీడునిపై నీ కిట్టి నిస్నేహత యెట్లు గల్గె? సుఖపెట్టఁ దగినతలిదండ్రుల నెల్ల దుఃఖపెట్టితివి? ఇట్లు చేసి నీ వేమియార్జించెదో ఎఱుంగ.' అని మనోరమ విలపించుచుండ నాలించి యతిదీనం బగునవ్విలాపంబుచే నిశ్చేతనుండయి యెట్టకేల్లో తెప్పిఱిలి లోనఁ బ్రవేశించి తండ్రి కేని మోము సూప లజ్జించుచుఁ బ్రణమిల్లి దూరంబుననె కూర్చుండెను.

తారాపీడుండు చంద్రాపీడునియందు నిందమోపుట.

కూర్చుండిన చంద్రాపీడునిం గాంచి తారాపీడుండు 'వత్స, చంద్రాపీడ, నీకు వైశంపాయనునందు జీవితమున కంటెను నెక్కుడు ప్రీతి కల దని యెన్నుచుంటిని. ఇప్పుడు మిత్రునియెడ జన్మంబునకును, స్నేహంబునకును, శీలంబు నకును, శాస్త్రంబునకును ననుచితం బైననీవృత్తాంతంబు విన నాడెందము నీదోషంబుగా శంకించెడిని.' అని పలుకుచుండ నవ్వచనంబు నాక్షేపించి శుకనాసుం డిట్లనియె:—

{ శుకనాసుండు చంద్రాపీడుని ప్రశంసించి వైశంపాయనుని దూషించుట. }

'దేవ, చంద్రునియందు నౌష్ణ్యంబును, అగ్నియందు శైత్యంబును, సూర్యునియందుఁ జీకటియు, సాగరంబున శోషంబును, సజ్జనునియం దప్రియవచనంబును సంభవించు నేని యువరాజునందు దోష ముండును. అట్లుండ విచారింపక మూఢప్రకృతియు, దుర్జాతుండును, మాతాపితృఘాతియు, మిత్రద్రోహియు, కృతఘ్నుండును, కర్మచండాలుండు నైన మహాపాతకికతంబునఁ గృతయుగంబున నవతరింప నశ్యుండును, మీకంటెనుగుణవంతుండును,నుదారచరితుండు నగు చంద్రాపీడు నియందు దేవరవా రిట్లు సంభావింపనగునా? గుణంబులయందు దోషంబు నారోపించుటకంటెఁ గష్టతరంబును, బీడాకరంబును నొండేమికలదు? జన్మంబు మొదలు దేవరవారియంకలాలనంబు చే నైన గ్రహింపఁబడక వాయువుంబలె దుర్గ్రాహ్యప్రకృతి యగు

వాని ఁ జంద్రాపీడుండైన నేమి సేయును? శరీరసంభవంబు లైనమహాక్రిములును, సర్వదోషాశ్రయంబు లైనమహావ్యాధులును, వినాశహేతువు లైనమహోత్పాతంబులును, వక్రచారు లైనమహాగ్రహంబులును, నిస్సంజ్ఞకంబు లగుపశువులును నిట్లి తమయంతన పుట్టుచుండును. మఱియు స్నిగ్ధులయెడఁ బరుషులును, ఋజువులయెడ వక్రులును, సాధువులయెడ నసాధువులును, గుణవంతులయెడ దుష్టప్రకృతులును, అనురక్తులయెడఁ గ్రుద్ధులును, మిత్రులయెడ ద్రోహులును, విశ్వాసులయెడ ఘాతుకులును, ప్రీతిపరులయెడ ద్వేషులును, వినీతులయెడ నుద్ధతులును, దయాపరులయెడ నిర్దయులును, స్త్రీలయెడ శూరులును, భృత్యులయెడఁ గ్రూరులును, దీనులయెడ దారుణులును నిట్లి జన్మింతురు. ఈవిపరీతులకు గురువులె లఘువులు. నీచులె ఘనులు. అగమ్యులె గమ్యులు. కుదృష్టియె సుదృష్టి. అకార్యమె కార్యము. అన్యాయమె న్యాయము అనాచారంబె యాచారంబు. అయుక్తంబె యుక్తంబు, అవిద్యయె విద్య. అవినయంబె వినయంబు. దౌశ్శీల్యంబె సౌశీల్యంబు. అధర్మంబె ధర్మంబు. అసత్యంబె సత్యంబు. ఈ క్షుద్రులకుఁ బ్రజ్ఞ పరవంచనంబునకె కాని, జ్ఞానంబునకుఁ గాదు. శాస్త్రంబు వివాదంబునకె కాని ఉపశమనంబునకుగాదు. పరాక్రమంబు పరపీడనంబునకెగాని యుపకారంబునకుఁగాదు. ఉత్సాహంబు ధనార్జనంబునకె కాని యశంబునకుఁ గాదు. ధనప

రిత్యాగంబు కామంబునకె గాని ధర్మంబునకుఁ గాదు. పలుమాట లేల? వారలకు సకలంబును దోషంబునకె కాని గుణంబునకుఁ గాదు. ఈతెండును నిట్టియపుణ్యుండై జనించెను. ఏలన, మిత్రుఁడగు చంద్రాపీడునకు ద్రోహం బెట్లు చేయుదునని యెన్నఁ డామె. మఱియు నమార్గంబునఁ జనునెడఁ దారాపీడమహారాజు కోపించుననియుఁ దలంపఁ డాయె. తల్లికి నేనొక్కండఁ జన్మించితి. నన్ను విడిచి తల్లి యెట్లు జీవించుననియు నీనృశంసునకుఁ దోఁపదాయె. నాతండ్రికి నేనొక్కండ వంశసంతానంబునకయి పిండప్రదుండనై జన్మించితి. తండ్రియనుమతిం గొనక యెట్లు సర్వపరిత్యాగంబు సేయుదునని యూహింపఁ డాయె. కాన యీయజ్ఞానతిమిరాంధునకయి యేమి చేయ నగు? ఈతిర్యగంతువు శుకంబునుంబోలెఁ జదివింపంబడియె. దేవరచే బోధింపం బడియె. అట్లు గాకున్న తిర్యగ్జంతువుల యెడను శిక్షణాయాసంబు సఫలంబయ్యగు. అవియుఁ బోషింపఁబడి పోషించినవానియందు స్నేహంబు నిడును. అవియు మేలు నెఱుంగును. అవియుఁ దలిదండ్రుల యెడ స్నేహంబుం గనఁబఱుచును. ఉభయలోకభ్రష్టుం డగునీ దుర్జాతునకుఁ జేసినసర్వంబును నేలపాలాయె. ఇట్టివాఁడు తిర్యగ్జాతియందు జన్మించియుండినను మే లగు. ఏ మిట్టిదుఃఖార్ణవంబునఁ బడకుందుము. వీఁడు కేవలము మాదుఃఖమునకె జన్మించెఁగదా!, యని యుద్బాష్పదృష్టియయి పెదవు లదర వెచ్చనూర్చుచుండెను.

తారాపీడుండు శుకనాసు నూఱడించుట.

అంత శుకనాసుం గాంచి తారాపీడుం డి ట్లనియె:—'దీపంబుచే నగ్నినిఁ బ్రకాశింపఁ జేయుటయు, మంచుచేఁ జందురునకు శైత్యంబు గలిగించుటయు, మేఘోదకంబుచే సాగరంబు నించుటయు, వ్యజనానిలంబుచేఁ బ్రభంజనుని వృద్ధిపఱుచుటయు నెట్లో, మనుబోంట్లార్యునకు బోధించుటయు నట్లయగు. ఐనను బ్రాజ్ఞునకు, వివేకికి, ధీరునకు, సర్వజనంబునకును దుఃఖాతిశయంబుచేఁ జిత్తంబు కొలను వర్షజలంబుచేఁ గలుషం బగు నట్లు కలుషం బయ్యెడిని. మానసంబు కలుషీకృతంబయిన నిది యేమి యనుజ్ఞానంబు నశించును. చిత్తం బాలోచింపదు. బుద్ధి తెలిసికొనదు. వివేకంబు వివేచింపదు. ఇంతటి జీవలోకంబునను నిర్వికారచిత్తుం డెందేనిఁ గలఁడే? యౌవనారంభంబున బాల్యంబుతోఁగూడ స్నేహంబు జాఱిపోవును. వత్సంబుతోఁగూడ కోరిక విస్తరించును. బలంబుతోఁగూడ మదంబు వృద్ధిగాంచును. బాహుయుగంబుతోఁగూడ నవినయంబు పెంపొందును. శ్మశ్రువులతోఁగూడ మాలిన్యహేతు వగు మోహ మ్ముద్రేకించును. ఆకారంబుతోఁగూడ వికారంబు లావిర్భవించును. ఎటులన, కన్ను ధవళంబయ్యు నరాగంబయి దీర్ఘంబయ్యు దీర్ఘంబు గాననేరదు. బాధిర్యంబు లేకున్నను శ్రోత్రంబున గురూపదేశంబు చొరనేరదు. పరిత్యాజ్యంబు లగు విషయంబులయం దాసంగము గలుగును. మఱియు దివసంబు

దోషాగమనంబునకుఁ గారణం బగుగాని దోషాగమం బా లోకంబునకుఁ గారణంబు గాదు. ఆలోకంబులేమి యసద్దృష్టికి నిమిత్తం బగు. అసద్దృష్టి యవివేకంబునకు మూలము. అవివేకం బసన్మార్గప్రవృత్తికి హేతువు. అసన్మార్గప్రవృత్తం బయి భ్రమించునట్టిచిత్తం బవశ్యంబును జలించు. చిత్తము చలింప లజ్జ తొలఁగు. లజ్జావరణంబు తొలంగ సర్వావినయ హేతు వగుమీనకేతుండు ప్రవేశించు. మీనకేతననిశితమార్గణంబులచే ఛిద్రశతంబులు గలుగ సత్త్వం బధోగతి కేగును. సత్త్వం బధోగతి కేగిన శీలంబు దేని నాశ్రయించి జాఱకుండును. శీలంబు జాఱిపోవ వినయంబున కేమి యవలంబంబు గలదు? అప్పుడు నిరాధారం బైనధైర్యం బేమి సేయును? బుద్ధి దేనియం దడుగువెట్టును? దేని నవలంబించి చిత్తంబు నిరోధింపవలయు? ఇంద్రియంబుల నియమించినవా రెవరు? దుశ్చరితంబుల వారించినవా రెవరు? ప్రథమవయస్సున మాలిన్యము నెట్లు విడువ నగు? మఱియు వార్ధకంబున నతిపుణ్యావంతులకుఁ గొందఱకుమాత్రమె వెండ్రుకలతోడఁ జరితంబులు ధావళ్యంబు నొందెడిని. అటులుండ విషమవిషయవిషధురంధరంబును, సకలదుశ్చరితచక్రవర్తియు నగుతారుణ్యం బవతరింపఁ జాపల్యంబు సంభవింపకుండునే? మీర లిట్లు లాలనీయుం డైన శిశుజనునిమీఁద నలిగి నిందించెద రేల? స్వప్నమం దైన గురువుల ముఖంబునుండి శుభంబుగాని, యశుభంబుగాని యెద్ది వెడ

లునో, అది యథార్థంబగును ఫలించు. తల్లిదండ్రులు బాలురకు దైవతంబులుగదా? వారలకు గురుజనాశీర్వాదంబులు వరంబులగున ట్లాక్రోశంబులును శాపంబు లయ్యెడిని. కాన వైశంపాయను నుద్దేశించి మీ రతికఠినంబుగ నుడువుచుండ నాచిత్తంబునకు గొప్పపీడ కలిగెడిని.తమపెనిచినచెట్లయందును స్నేహంబుండుననుచో నంగసంభవంబులైన యపత్యంబులయెడ నేమి చెప్పవలయు? నిజం బెఱుంగక దూషింపఁ దగదు. తెలిసికొని రప్పింప యత్నింతము., అనుటయు విని శుకనాసుండు 'దేవర వారు వాత్సల్యంబున నిట్లు వచించెదరుగాని నాఁ డెన్నండేనియు వరాజును విడిచి తనయిచ్చచే వేఱుచో క్షణంబైన నుండెనా?, అని పలుకుచుండఁ జంద్రాపీడుండు తనయందు జనకుండు దోషంబు శంకించుటచేఁ గశాభిఘాతంబు నొందినవానివలెఁ గనుఁగవ నశ్రువు లొలుక శుకనాసునితో ని ట్లనియె:—

చంద్రాపీడుండు వైశంపాయనునికై యరుగ సెలవు గొనుట.

'ఆర్యా, వైశంపాయనుండు రాకుండుట నాదోషంబునఁ గా దని బాగుగ నే నెఱుఁగుదు. అసత్యంబైనను లోకంబు వాడుకొనునెడ నది నిజంబె యగు. అందును దండ్రి వచించు నెడ విశేషించి దూషిపదు. అది దూషిపదుట యిందుఁ గీర్తికరంబుగాని, యపకీర్తికరంబుగాని గుణదోషంబులఁ బెట్టి పరలోకంబున ఫలం బిడుపరమార్థంబున కిందు నుపయోగం బేమి ? తమ రీ దోషసంభావనకై నాకుఁ బ్రాయశ్చిత్తము నిరూపింప నగు.ఏను

వైశంపాయనునిఁ గొనివచ్చుటకుఁ బోనెంచెద. అట్లుగాక నాకు దోషంబు పోనేరదు. వైశంపాయనుండు రానిచో మజ్జనకున కుం గలిగిన దోషసంభావనచే నేనును రాఁ గూడదు. వైశం పాయనుండు వచ్చినను రావలయు. అన్యుండు వైశంపాయనుం దోడ్కొని రాఁజాలఁడు. మఱియు నితండు స్కంధావారంబు దోడ్కొని రాఁగలఁ డని యెంచి విడిచి వచ్చితిఁగాని యట్లు గాదేని జన్మంబు మొదలు నే నతని విడిచి యెటకేనిఁ బోయితినే? క్రీడించితినే? భుజించితినె? నిద్రించితినే? కాన యార్యుం డి ప్పుడు నాకు సెల విప్పింపవలయు., అన విని శుకనాసుండు మహారాజుం గాంచి 'యువరాజు వైశంపాయనునకై యరుగ విన్నవించెడిని. దేవరవారేమి సెల వొసంగెదరో, అన విని తారాపీడుం డి ట్లనియె:— ' ఆర్య, ఈదినంబులయందుఁ గోడలిం జూడవలయు నని యేఁ దలంచుచుండ విఘ్నకారియగు విధాత్రుఁడు నడుమ వైశంపాయనవృత్తాంతంబు దెచ్చిపెట్టెను. ఇతండె యతనిఁ దోడ్కొని రాఁజాలునుగాని యన్యుండు తోడ్కొని రాఁజాలఁడు. అతని విడిచి యితండిచట నిలువఁ జాలఁడు. ఈవ్యసనార్ణవం బీపోతంబుచే నిస్తరింపవలయు. వైశంపాయనుం దోడ్కొని వచ్చుటకు విలాసవతియు సెల వొసంగు ననియే నానిశ్చయము. కాన యితండరుగును గాక. ఇంక నేమన, బహుదూరంబు చనవలయుఁగాన మహా హూర్తికుల రావించి దివసంబును లగ్నంబును నిర్ణయింపవ

లతము., అని పలికి 'వత్స, నీవ గోని కరిగి మనోరమం గూడియున్న నీతల్లికి నీగమనవృత్తాంతం బెఱిఁగింపుము.', అని వచించి శుకనాసునితో నిజభవనంబునకుం జనియె. చంద్రాపీడుండు మనోరమం దర్శించి 'అమ్మ, ఊఱడిలుము. వైశంపాయనుం దోడ్కొని రా నాకు జనకుం డానతిచ్చె. కాన వైశంపాయనుం జూడ వేడుకసేయు నన్ను విడువుము.', అన విని మనోరమ యి ట్లనియె:—'తండ్రీ, నీవు నే నరిగెద నని నన్నూఱడించెదవా? నాకు నీయందును వానియందును నేమి భేదము? నీవైనం గ్రేవనుండిన నా వైశంపాయనుం డుండినట్లె భావించెద. నీయొక్కనిచే నే మిద్వారమును బుత్రవతుల మగుదుము. అనిష్ఠురాత్ముండు రాకున్నఁ బోనిమ్ము.', అన విని విలాసవతి యి ట్లనియె:—'ప్రియసఖి, నీకు, నాకును నీ చెప్పినట్ల యగు. కాని వైశంపాయనుండు లేకున్న నీతం డెవ్వనిఁ జూచి యూఱడిల్లును? వీని నేల వారించెదవు? వారించినను నీతం డుండ నేర్చునె? ఇదియ యాలోచించి జనకుండు సెల వొసంగె నని యెంచెద. కాన యతనిఁ బ్రయాణంబు సేయుటకై యురుగుదము రమ్ము.' అని పలికెను.

చంద్రాపీడుం డటనుండి తరలి నిజగృహంబునకు జని గమనంబునకు వేగిరపా టొందుచుండఁ బాప గణకులఁ బిలిపించి యేకాంతంబున నిట్లనియె:—'నా కవిలంబంబుగ గమనంబు సంభవించునట్లు దినంబు నిర్దేశించి శుకనాసునకును,

జనకునకును దెలుపుఁడు., అనవిని వార లి ట్లనిరి. 'దేవ, గ్ర
హంబులయునికింబట్టి ప్రకృతంబున గమనంబె ప్రశస్తంబు
గాదు. ఇఁకఁ గర్మానురోధంబున రాజేచ్ఛయె యుక్తకాలం
బుగాన యహర్నిరూపణంబుతోఁ బని లేదు. రాజా కాలస్య
కారణం మ్మన వినవె? దానం జేసి యెక్కాలంబున మనంబు
సోత్సాహంబై యుండునో, అదియ సర్వకార్యంబులకును
యుక్తకాలము., అని నివేదింపఁ జంద్రాపీడుండు 'ఇట్లు తండ్రి
సెల వొసంగె నని చెప్పితి, ఇంతియ కాని ప్రతిక్షణంబును ననేక
కార్యపరుల మగుమాకు దివసనిరూపణం బెట్లు సమకూడును.
కాన రేపకడన ప్రయాణంబు సాగునట్లాలోచింపు' డని య
భ్యవహారంబునకై వెడలెను. అతండు కృతాభ్యవహారుం డైన
పదంపడి మౌహూర్తికు లి ట్లనిరి. 'దేవ, రేపటిరాత్రి యిట
నుండి వెడలవలయు., నన విని చంద్రాపీడుండు బాగని పొగడి
'వైశంపాయనుని, గాదంబరిని, జూచితి' ననియె యెంచుచు
నాదినం బెట్లో గడపి మఱునాఁడు ప్రయాణోద్యమంబునఁదల్లిం
గాంచి ప్రణమిల్లుటయు విలాసవతి యి ట్లనియె: —'తండ్రీ,
అంకలాలితుండవగు నీకు ప్రథమగమనంబున నామనంబు బాధ
నొందుట యుచితంబె. ఇయ్యెడ నాకుఁ గలమనోవేదన ప్రథమ
గమనంబునను గలుగ దయ్యె. ఎట్టులన, గుండియ వగులునట్లును,
మర్మంబులు భేదింపఁబడునట్లును, మనసు బుడుకునట్లును, ప్రా
ణంబులు వెడలునట్లును దోఁచెడిని. కన్నీరు నిలిపినను నిలువ

దు: చిత్తము నాపినను నాగదు. ఇట్టి హృదయపీడ యేల కలిగెనో యెఱుంగ. నావాఁడె వైశంపాయనునిఁ దోడ్కొని రానరుగునిన్ను వారింపఁజాలదు. మనం బియ్యకొనదు. కానతొల్లింటివలె దీర్ఘకాలంబుండఁగూడదు., అనిచెప్పి శిరంబు మూర్కొని పనిచెను. అనంతరము చంద్రాపీడుండు జనకునొద్దకుఁ జని నమస్కరింపఁ దారాపీడుం డి ట్లనియె:—

తారాపీడుండు చంద్రాపీడునకు రాజనీతి నుపదేశించుట.

'కుమార, తండ్రిచే ననర్హదోషంబున సంభావింపఁబడితి, నని మనఁబున నుపకుము. వినయాధానంబు మొదలు బాగుగఁ బరీక్షింపఁ బడితివి. గుణగణంబులచేఁ బరీక్షించి రాజ్యభారం బారోపింపనగుఁగాని తనయస్నేహంబుననె యారోపింపఁదగదు. రాజ్యం బనఁ బృథ్వీభారంబుచేతనె యతి దుర్వహంబు. భూధరసంబాధంబుచేతనె యతిసంకటంబు. కుటిలనీతిప్రచారంబుచేతనె యతిదుస్సంచరంబు. అపర్యవసానకార్యజాలంబుచేతనె యతిగహనంబు. అహితసహస్రోద్ధరణంబుచేతనె యతిదుష్కరంబు నగు. ఇయ్యది యస్థిర ప్రకృతియందును, అవిక్రాంతునియందును, అవివేకియందును, అకృతజ్ఞునియందును, అప్రియవాదియందును, అనుత్సాహునియందును, అబ్రహ్మణ్యునందును, అమిత్రవత్సలునందును, అజితేంద్రియునందును నడుగు బెట్టనేరదు. వివ్వంకు సమగ్రంబులగు గుణంబులచే చంచలప్రకృతి యగునీరాజ్యభరంబును బ్రతిబంధింపఁజాలునో,

వానియందు గురుజనులు నిర్భయంబుగ, రాజ్యభారంబు నిడు దుగా. కాన యీ వెఱంగవలయు. నాయందు దోషంబు లేదు. మఱియు నిట్టేడ నీవీభారం బెవరియందునిచి దోషం బెయ్యదైన నాచరించెదవు? నీవు సర్వలోకానురంజనశీలుండవై యత్నింపవలయు. మాకుఁగాలంబు గతించె. ఏను చిరకాలం బుననుండి పాలించుచుంటి. లోభంబుచేఁ బ్రజలఁ బీడింప నైతి. అవమానంబుచే గురువుల గోపింపఁజేయనైతి. మదంబుచే స జ్జనుల విముఖులఁగావింపనైతి. క్రోధంబుచేఁ బ్రాణుల భయ పెట్టనైతి. కామంబుచేఁ బరలోకంబు హింసింపనైతి. మఱియు రాజధర్మంబు ననురోధించితిగాని స్వరుచినిగాదు. వృద్ధుల సేవిం చితిగాని వ్యసనంబులఁగాదు. సజ్జనచరితంబు లనుసరించితిగాని యింద్రియంబులఁ గాదు. వృత్తంబు రక్షించితిగాని శరీరంబుగా దు. నిందకు భీతిల్లితి గాని మరణంబునకుఁగాదు. యౌవనంబున సు రలోకంబునను దుర్లభంబు లగుభోగంబుల ననుభవించితి. నీజ న్మంబుచేఁ గృతార్థుండ నైతి. ఇంక నా కిదియ వాంఛితంబు. ఏమన, దారపరిగ్రహంబుగాంచిననీయందు సకలరాజ్యభారంబు నిచి తొల్లిటిరాజర్షులు చనినమార్గంబు ననుసరింపఁగలేనని యెం చుచుండ దానికి వైశంపాయనవృత్తాంతంబు నిరోధకంబయ్యె. కాన యీ వఱిగినను దడవు సేయవలదు., అని పలికి తాం బూలంబు నొసఁగి యనిపెను. అంతఁ జంద్రాపీడుండు మనో రమావిలాసవతులవలనను సెలవుగొని నగరంబు వెడలి శిప్రానదిం దాఁటి చనుచు మనంబున నిట్లు వితర్కించెను.

## చంద్రాపీడునితలంపులు.

‘ వైశంపాయనుండు నన్నుఁగని సిగ్గునఁ బఱచెనేని నతనివెన్నంటి కౌఁగిలించుకొని సుహృత్సమాగమసుఖం బనుభవించెదను. అతనిం గూడి మహాశ్వేతం గాంచెదను. అట సైన్యం బునిచి మహాశ్వేతతో హేమకూటంబున కరిగెదను. అంత నన్నుఁ గాంచి కుసుమశయనంబుననుండి లేచు కాదంబరిం జూచి కనుఁగవఁ గృతార్థత నొందించెదను. మదలేఖాపత్రలేఖల నాదరించెదను. మహాశ్వేత మాయిర్వురకును బరిణయంబు యత్నింపఁ బాణిగ్రహణంబు నిర్వర్తించెదను. ఆగంధర్వరాజనంతనతో సహస్రవారానుభూతంబయ్యు నపునరుక్తంబునై యపరప్రకారం బైన నిర్వాణసుఖంబుం బోలు సమాగమసుఖం బనుభవించుచు నాసుందరితో నారమ్యప్రదేశంబులయందు విహరించుచుండెదను., అని యాలోచించుచు నాఁకలి దప్పుల నైన లెక్కఁ గొనక రేలుంబవళ్లుఁ బ్రయాణంబు సేయుచుండెను.

## వర్షర్తువర్ణనము.

అంత గంతవ్యప్రదేశం బతిదూరం బగుటం జేసి మధ్యమార్గంబుననే మార్గంబునకుఁ గాలసర్పంబును, చంద్రునకు రాహువును, మదనవారణంబునకు మదాగమనంబును, విరహులకు మహాంధతమసప్రవేశంబును, పాంథులకు నిగడబంధనంబును నగు వర్షర్తువు నిరంతరంబు ధారాసారంబుల వర్షించుచు గమనంబునకు విఘ్నకారి యయ్యెను. అప్పుడు గగనంబున

గర్జించుమేఘంబులచేతను, నంతరాళంబున నఱచుచాతకంబులచేతను, పుడమియందు నారావంబు సేయుదర్దురంబులచేతను, దెసలయందు వీచుమేఘవాతంబులచేతను, వనంబులయందుఁ గేకారవంబులిడు నెమ్ములచేతను, గిరులయందుఁ బ్రవహించునిర్ఝరంబులచేతను విస్తృతంబైనధారారావంబుచే నుత్కంఠితుండై యెందును విశ్రమింపక నడుచుచు దారిలో మేఘనాదునిఁ గాంచి 'పత్రలేఖావృత్తాంతం బనల నడుగ నగు. తొలుత వైశంపాయనునివృత్తాంతం బడుగుదు నని యెంచి ' నీవచ్ఛోదసరస్తీరంబున వైశంపాయనుం గాంచితివా ? అం దుండుటకుఁ గారణం బడిగితివా? దాని కతం డేమి చెప్పెను? అతండు నాప్రస్తావంబు దెచ్చెనా? తలిదండ్రుల కేమైన వార్త యనిచెనా? నీవు బోధించితివా? అతనియభిప్రాయం బెఱింగితివా ? అటనుండి వెడలిపోనేరఁడుగదా? దర్శనం బొసంగునా? నాయనునయం బాలించునా? అతం డేమి చేయుచుండును ? ఎట్లు కాలంబు గడపుచుండును?, అన విని వాఁ డిట్లనియె:—

'దేవ, దేవరవారియానతిచొప్పునఁ బత్రలేఖ నందు విడిచి వచ్చితిఁగాని యేనేమియు నెఱుంగ, నని చెప్పుచుండఁ గాదంబరిని దలంచి వైవశ్యంబు నొంది, జలధరంబులఁ గాలపురుషులఁగను, స్ఫూర్జితంబులఁ బ్రేతపతిపటహధ్వానంబులుగను, వర్షధారల స్మరశరంబులుగను భావించుచు, భయంబుచే సత్త్వంబును, కార్శ్యంబుచే బలంబును, వైవర్ణ్యంబుచేఁ గాంతిని,

మోహంబుచే మతిని, విషాదంబుచే ధైర్యంబును, బాష్పంబుచేఁ గన్నుఁగవను శూన్యంబు గావించి యెట్లట్లో జీవితంబు ధరించి యచ్ఛోదంబు ప్రవేశించెను. ప్రవేశించుచు నె యూశ్వికులతో ని ట్లనియె :—' ఒకవేళ నీవైశంపాయనుండు మమ్ముఁ గాంచి లజ్జచేఁ బఱచును, కాన మీరలు నాలుగుప్రక్కల నవహితులై యుండవలయు,' నని వచించి తురగారూఢుండై లతాగహనంబులను, తరుమూలంబులను, శిలాతలంబులను, లతామండపములను జూచుచు నంతటఁ బరిభ్రమించెను. 'నిశ్చయంబుగ నితండు పత్రలేఖాముఖంబున నాయాగమనవృత్తాంతంబు విని ముందుగ నెయిటనుండి తొలఁగిచనియె. అట్లుగా దేని నతం డున్న చిహ్నం బైన నేలకానం బడదు? కాన కష్టంబు ప్రాప్తం బయ్యె. వైశంపాయనుం గానక యడుగిడఁ బాదంబు లుత్సహింపవు. మన్మథశరవిద్ధంబులై కాదంబరిం జూడఁ దమకిం చనా ప్రాణంబులు క్షణం బైనవిలంబంబు సహింపవు. అన్నింట వినష్టుండ నైతి.,' అని చింతించి ' యొకవేళ నతనివృత్తాంతంబు మహాశ్వేతకుఁ దెలిసి యుండెడినో,' యని తదాశ్రమంబునకు నరుగ నెంచి సమీపమున సైన్యంబు నిలిపి మహాశ్వేతాశ్రమంబునకుం జని రాజపుత్రులు కొందఱు తోడరా లోనఁ బ్రవేశింప గుహాద్వారంబునని శిలాతలంబున నధోముఖయై కూర్చుండి తరళిక..తనశరీరంబు పట్టుకొని యుండ నిరంతరము నశ్రుధారలు గార్చుచున్న మహాశ్వేతం గాంచి చంద్రాపీ

డుండు తనచి త్తంబున నిట్లు తలంచెను. 'కాదంబరికే యనిష్టం బు ప్రాప్తంబయి యుండ్ల. నోపు. అట్లుగాదేని మహాశ్వేత కిట్టియవస్థ యేల పొడము?, నని యెంచి యాశిలాతలంబున నొక్కచో( గూర్చుండి 'ఏమి యిది?' యని తరళిక నడుగ నది మహాశ్వేతముఖంబు నవలోకించె. నంత మహాశ్వేత గద్గదస్వ రంబున ని ట్లనియె :—

మహాశ్వేత చంద్రాపీడునకు వైశంపాయనుని మరణంబు దెల్పుట.

'మహాభాగ, ఏమని విన్నవింతు, ఏను కేయూరకుని వలన నీ వుజ్జయిని కరిగితి నని విని చిత్రరథుని మనోరథంబును, నాయిష్టంబును నెఱవేరదాయె, నని చింతించి వైరాగ్యంబున నతితపంబు సేయ నిశ్చయించి వచ్చి యిట రూపంబునను, వయస్సునను నీ కెనయగు బ్రాహ్మణకుమారుం గాంచితి. అతండు నన్నుఁ జూచి యపరిచితుండయ్యుఁ బరిచితునివలెను, ఊరకుండియుఁ బ్రార్థించువానివలెను, భయపడువానివలెను, దుఃఖించువానివలెను, ఏమియొ స్మరించువానివలెను, ఆక ర్షించువానివలెను తెప్ప వ్రేయక నన్నుఁ గాంచి యి ట్లనియె:—

'సుతనూ, సకల మర్త్యప్రాణిజాతంబును జన్మంబునకును, వయ స్సునకును, ఆకృతికిని సదృశంబు నాచరించుచు నింద్యత నొందనేరదు. నీ కిట్టి యసదృశం బగుయత్నం బేల? మాలతీ కుసుమసుకుమారం బైనయీతనువుం దనుచితం బగుతపశ్చర ణాయాసంబుచే మ్లాని నొందింపనేల? రూపగుణహీనుండైనను

జన్మించినవానికి జీవలోక సుఖంబు లనుభవింపఁబడి శోభిల్లును. ఇఁక నాకృతిమంతుఁ డగుజనున, కేమి చెప్పవలయు? నినుబోఁటి కన్యక యైహికసుఖంబులకు విముఖయై తపంబునఁ దనువల్లి నాయాసపఱచునెడఁ గుసుమకార్ముకుండు విల్లువట్టుట వ్యర్థంబ కదా? చంద్రుం డుదయించుట రిత్తకే కదా? వసంతాగమంబు నిరర్థకంబు. ఉపవనమలయానిలంబుతో నేమి కార్యము?, అనుటయు నేను పుండరీకునివృత్తాంతంబున నిరుత్సుకురా లగుటం జేసి యతం డట్లు పలుకుచున్నను 'నీ వెవ్వఁడవు? ఇచ్చటి కేల వచ్చితివి? నన్నేల యిట్లు పలికెదవని పల్కక వేరు చోటి కరిగి దేవతార్చనకుసుమంబులఁ గోయుచుఁ దరళికతో నిట్లంటిని. 'తరళిక, ఈబ్రాహ్మణకుమారుం డెవ్వఁడు? ఈతని యభిప్రాయంబుజూడ వేఱుగాఁ దోఁచెడిని. కాన యితఁ డిటకు మగుడ రాకుండునట్లు వారింపుము. నివారితుండయ్యు నిటకు వచ్చునెడ వానికి యప్రియంబు గలిగెడిని., అన విని తరళికవారించినను నతండు మదనునిదోషంబుచేతనో, అనర్థంబు గానుండుట చేతనో యనుబంధంబు విడువఁ డాయెను. అంత నొకనాఁటి రాత్రి వెన్నెల గాయుచుండఁగను, తరళిక నిద్రించుచుండఁగను, ఏనీ శిలాతలంబునఁ బన్నుండి పుండరీకునిఁ దలఁచి 'మందభాగ్య నగునాయభాగ్యంబున దివ్యపురుషునిభాషితంబు నసత్యంబయ్యె. అమ్మహాత్ముండు దయదలఁచి యిది యెట్లో జీవించుత, మని యూఱడించి యుండును., అని తలంచుచు

మేల్కాంచియే యుంటిని. అప్పుడున్మాదంబున మత్తునిపలెను, నావిష్టునివలెను వచ్చినయక్కుమారకుంగాంచిభయపడి చిత్తంబున నిట్లు వితర్కించితి. ' అయ్యో? కష్టంబు ప్రాప్తం బయ్యె. ఇతం డున్మాదంబున నేతెంచి నన్నుఁ బాణిచే స్పృశించినను నే నీ శరీరంబు విడువవలసివచ్చును. అప్పుడు పుండరీకునిదర్శనంబు గోరి చిరకాలంబుననుండి దుఃఖంబుల సహించి ప్రాణంబుల ధరించుట వ్యర్థమే యగు., అని యే నాలోచించుచుండఁగనె వాఁడు సమీపించి యి ట్లనియె:—' చంద్రముఖి? చంద్రుండు కుసుమశరసహాయుండై నన్ను వధింప నుద్యమించుచున్న వాఁడు. కాన శరణంబు సొచ్చితి. ఆర్తుఁడ నగునన్ను రక్షింపుము. నాజీవితంబు నీయధీనంబు. శరణాగతరక్షణంబు తపోవంతులకును ధర్మంబె కదా? నన్ను శరీరదానంబున మన్నింపవేని నీయిందుకందర్పులచే హతుని గాఁ దలంపుము., అనుటయు విని యేను శీఘ్రంబ రోషానలంబుచేఁ గాల్చునట్లు వానిం గాంచి క్రోధాతిశయంబునఁ గఠినంబుగ ని ట్లంటిని. 'ఆ! పాప్మా, న న్నిట్లు పలుకునీతలప్పై పిడుగేల పడదు? నీ నాలుక వేవిధంబుల నేల చీలదు? నీవ్రాణి యేల పడదు, నీతనువున శుభాశుభసాక్షిభూతంబు లగుపంచమహాభూతంబులు లేవని తలంచెద. అవి యుండు నెడ నిట్లు పలుకు నిన్ను నగ్ని యేల భస్మంబుసేయదు? వాయు వేల యపహరింపదు? జలం బేల ముంపదు? పుడమి యేల పాతాళంబు చేర్పదు? ఆకాశం బేల శూన్యంబు గావిం

ఏదు? వ్యవస్థితం బగునిజ్జగంబునఁ గామచారి యగుతిర్యగ్జాతివ లె నేమియునెఱుఁగని నీ వెట్లు జన్మించితివి ? స్థానాస్థానంబు లెఱుంగకపల్కు-చిలుకవోలె నెవ్వనిచే మాటలు నేర్పఁబడితివి? నీ వట్టిశుకజాతియందుఁ బుట్టియుండితేని మముబోంట్లఁ గామించి మాకుఁ గ్రోధంబు గలిగింపకుండుదువుగదా.? అని పల్కి- చంద్రాభిముఖనై దోసిలి యొగ్గి ‹ పరమేశ్వర, లోకపాలులార, ఏను పుండరీకునిఁ గాంచినది మొదలు మనంబునన్నైన నొరునిఁ జింతింపనైతినేని నవ్వా డీసత్యవచనంబున నీతం డేఁ జెప్పిన జాతి యందవఁడుఁగాత, మని యేఁ బలికిన యనంతరమె యతం డనవ్యాం బగుమదనజ్వరవేగంబుననో? పద్యస్కాలంబునఁ బరిపక్వంబైనతనపాతకంబుగౌరవంబుననో, అట్లుగాక నావచనంబుసామర్థ్యంబుననో? ఎఱుంగ. మొదలుతెగఁగొట్టఁబడిన చెట్టువలె నిశ్చేతనుండై పుడమిపయిఁ బడియెను. అతం డట్లు నిర్జీవితుం డగుడు నాక్రందనంబు సేయునతని పరిజనులవలన నితండు మహాభాగుని మిత్రంబె యని విని లజ్జించి కన్నీరు గార్చుచు వగచుచున్నదానను.,

చంద్రాపీడుండు వైశంపాయనునిమృతి విని ప్రాణంబులు విడుచుట.

అన విని చంద్రాపీడుండు కనుఁగవ మూసికొని భగవతి నీవు యత్నించినను నాకీజన్మంబునఁ గాదంబరీసమాగమ సుఖంబు ప్రాప్తింపఁ గాదు. గాన జన్మాంతరమం దైనఁ గలుగఁ జేసెదుగాత., అని పలుకుచు గుండియ వగులుట

నసువుల విడిచెను. అంతఁ దరళిక మహాశ్వేతశరీరంబు విడిచి చంద్రాపీడుని శరీరంబు పట్టుకొని 'భర్తృదారిక, చంద్రాపీడునిఁ జూడ వేఱువిధంబుగఁ దోఁచెడి. కదలించినను కదలఁడు. కన్నులు దెఱవఁడు. నిట్టూర్పు విడువఁడు.

తరళికయు, రాజపుత్రులును చంద్రాపీడు నుద్దేశించి శోకించుట.

'హా! చంద్రాపీడ, కాదంబరీప్రియ, ఇప్పుడ కాదంబరిని విడిచి యెట కేగెదవు?, అని తరళిక దీనారావంబు సేయుచుండఁ జంద్రాపీడుం గాంచి మహాశ్వేత నిశ్చేష్టిత యయి యుండ, ఆ మహాపాపా, దుష్టతాపసి, ఎంతపని చేసితివి? సకల జగత్పీడ నపహరించిన తారాపీడుని కులంబు నిర్మూలము సేసితిగదా? ప్రజలనాథులైరి. ఇప్పుడు లక్ష్మి యెవ్వనిముఖంబు చూచెడిని? భూమి కెవ్వం డాధారం బగు? సేవకు లెవ్వని సేవించెడిని? దేవ, చంద్రాపీడ, ఈవు సర్వంబు విడిచి యెట్లు కథామాత్రావశేషుండ వైతివి? ప్రజ లిప్పు డెవ్వనిఁ జేరుదురు? సాధువులకు గతి యెవ్వఁడు? నీవు విపన్నుండ వైన తారాపీడునిచే వహింపఁబడుభూభారం బెవ్వఁడు వహింపఁ గలఁడు? ధీరుండ వైనను భీరువునకుంబలె దుఃఖంబుచే డెందం బెట్లు భిన్నంబయ్యె? దయాళుండ వైనను నీకు మాయందు నిర్దయత యెట్లు గలిగెను? దేవ, ప్రసన్నుండ వగుము. ప్రాణంబుల ధరింపుము. నిన్ను విడిచి తారాపీడమహారాజును, విలాసవతియు, శుకనాసుండును, మనోరమయు, రాజులు, ప్రజలును క్షణం బైనఁ బ్రా

ణంబుల ధరింపరు. ఇంద్రజను విడిచి యొక్కండ వెక్కడి కరిగెదవు? నీ కిట్టికఠినత్వం బెట్లు గలిగె, నని పరిజనం బాక్రం దించుచుండ 'హా! హా! ఇదియే మిట్లు వచ్చె, నని రాజపుత్ర లోకం బుద్భ్రాంతి నొందెను. అప్పు డింద్రాయుధంబు చం ద్రాపీడునివదనంబునఁ జూడ్కి నిడి యతిదీనంబుగ హేషారవం బు సేయుచు దురంగమత్వంబు విడువఁ దలంచి నటు లుండెను.

కాదంబరి మహాశ్వేతాశ్రమంబుకు వచ్చుట.

అంత నక్కడ చంద్రాపీడుండు వచ్చె నని పత్రలేఖ వచింప విని కాదంబరి శృంగారవేషంబు దాల్చి పత్రలేఖ చేయి పట్టుకొని మదలేఖతో మహాశ్వేతాశ్రమంబునకుఁ జను దెంచుచు 'మదలేఖా, పత్రలేఖ యేమో చెప్పుచున్నది. అ కఠినహృదయుం డరుదెంచు నని యేను విశ్వసింపను. హిమ గృహంబున నట్టియవస్థఁ గాంచియు విశ్వసింపక యతండు సేసినవక్రభాషితంబు దలంచెదుగదా? మరణంబు నొందె నని వినియు నాయవస్థ విశ్వసింపఁడు. ఇయ్యది నాకయి యిట్టిట్టి దుఃఖమొందెడి నని యతని మనంబున నుండునెడ రానె రా నేరఁడు. కాన యతండు వచ్చినను నేను చూడను. సంభా షింపను. పాదంబులపైఁ బడినను నతనిప్రార్థన నంగీకరింపను. నీవు నన్నుఁ బ్రసాదింపవలదు.' అని పలుకుచునె చంద్రాపీడ దర్శనాత్సుక్యంబున గమనాయాసంబుం దలంపక యచ్చోటు చేరెను. వచ్చి యమృతంబు నెత్తినరత్నాకరంబపోలెను,

ఇందు రహితం బైననిశాప్రబంధంబునుంబోలెను, నాయక మణిరహితం బగుహారంబునుంబోలెను జీవితరహితం బైయున్న చంద్రాపీడశరీరంబుం గాంచుచునె తలవాంచి నేలపైఁ బడుచుండ మదలేఖ కాదంబరిని పట్టుకొనియెను. అప్పుడు పత్రలేఖ కాదంబరిచేతినుండి చేయి విడిపించుకొని స్మృతి దప్పి పుడమిపైఁ బడియెను. కొంతసేపునకుఁ గాదంబరి తెలివి నొంది యల్లె మూఢవలె నిట్టూర్పు విడువను మఱచి నిశ్చలదృష్టియై స్త్రీ స్వభావవిరుద్ధం బగుచిత్తంబుతో నుండెను. అట్లున్న కాదంబరిం గాంచి మదలేఖ యార్తనాదంబు సేయుచుఁ బాదంబులపై బడి యిట్లనియె:—‘ప్రియసఖి, ప్రసన్న వగుము. దుఃఖ భారంబు విడువుము. దుఃఖభారంబును బాష్పమోక్షంబున విడువనియెడ నధికజలంబునఁ బీడితం బైనతటాకంబుపగిది నీ హృదయంబు వేయితునుక లయ్యెడిని. మదిరను, చిత్రరథుని నపేక్షింపుము. నిన్ను విడిచి యాకులద్వయంబును జీవింప నేరదు సుమా?, యని పలుక కాదంబరి నవ్వి యిట్లనియె:—

కాదంబరి మదలేఖ కప్పగింతలు చెప్పుట.

‘ఓసి, యున్మత్తా, చూడఁగనే వేయితునుకలుగాని వజ్ర సారం బైనయీకఠినహృదయ మెట్లు వగులును? మఱియు నెవ్వత జీవించునో, దానికిఁ దల్లి, తండ్రి, సఖులు, పరిజనం బు నిదియంతయుఁ గలదుగాని మృతినొందు నాకేల? ఎట్లో నాకుఁ బ్రియతమశరీరంబు దొరకెను. జీవించినశరీరంబును

సంభోగంబుచేతనో? నిర్జీవంబగు శరీరంబు ననుమరణంబుచేత నో రెండువిధంబులను సర్వదుఃఖంబులు నుపశాంతి నొందెడిని. కాన దుఃఖింపనేల? స్వర్గగమనోన్ముఖుం డగు దేవునకు రోదనంబుచే నమంగళం బెట్లాచరింతును? పాదధూళివలెఁ బాదంబుల ననుగమించు సంతోషసమయంబున నెట్లు రోదనంబు సేయుదును? నాకు దుఃఖ మేమి? నాకిపుడు సర్వదుఃఖంబులును దూరీకృతంబు లాయె. ఇప్పుడును రోదనము సేయ నేల? ఎవ్వనికయి కులక్రమంబు గణింప నైతినో, గురువుల నపేక్షింపనైతినో, ధర్మం బనురోధింప నైతినో, జనాపవాదంబునకు వెఱవనైతినో, లజ్జను పరిత్యజించితినో, శిశిరోపచారంబులచే సఖీజనంబును దుఃఖపెట్టితినో, ప్రియసఖ యైనమహాశ్వేత నాయాసపెట్టితినో, మహాశ్వేతకతంబున చేసినపతిననుగూడ వేఱువిధంబు సేసితినో, అట్టిప్రాణేశ్వరుండు నాకయి ప్రాణంబులు విడువ నేను ప్రాణంబుల నెట్లు వహింతును? నాకిపుడు మరణంబు శ్రేయంబుగాక లజ్జాకరం బైనజీవితంబు శ్రేయంబుగాదు. నీకు నాయందు స్నేహం బుండునేడ నాతలిదండ్రులు శరీరమును విడువనట్లు చేయుము. వారలకు నాయందు గలమనోరథంబు నీయందు దీర్చికొను నట్లొనరింపుము. ఏను పరలోకంబున కరిగినను నాసఖీజనంబును, పరిజనంబును శూన్యం బగునాభవనంబు గాంచి దెసల కరుగకుండున ట్లాచరింపుము. నాపుత్రుం డగుసహకారపోతంబునకు మాధవీలతతో

వివాహమంగళంబు నీవ నిర్వర్తింపుము. ఏను చరణతలంబు చేలాలించిన బాలాశోకవిటపంబు పల్లవంబును గర్ణపూరంబునకయినఁ గ్రుంపకుము. నాపెనిచినమాలతీలతకుసుమంబులను దేవతార్చనకై కోయవలయు. గృహపరిచయంబు లేనియడవి మనుజాని నడవియందె విడువవలయును. నాక్రీడాపర్వతంబు నొకతపసి కొసంగవలయు. నాశరీరోపకరణంబుల బ్రాహ్మణుల కర్పింపవలయు. నావీణియ నీవ యునుచుకొనవలయు. కడమ కృత్యంబులు నీకు రుచించిన ట్లాచరించునది. ఏను జంద్రాపీడుని కంఠంబు గ్రహించి చితానలంబున శరీరంబు విడువఁగలను, అని పలుకుచుఁ దన్నుఁ బట్టుకొనియుండిన మదలేఖను విదలించుకొని మహాశ్వేతకంఠంబు గాఁగిలించికొని నిర్వికారవదనయయి యిట్లనియె.

"ప్రియసఖ" నీ కెట్టిదో యాశ కలదు. దానిచేత నె యనురాగపరవశవయి పునస్సమాగమంబునుఁ గోరియున్న దానవు. నాకట్టియాశ లేదు. కాఁబట్టి మగుడ జన్మాంతర సమాగమనంబునకయి వేఁడెదను. అని పలికి మరలి వచ్చి శిరంబుచేఁ జంద్రాపీడుని చరణంబ్బులకు వందనంబు చేసి తనచేతులతో నతనిపాదంబులఁ దనయంకంబున నిడికొని యుండెను. అంతఁ గాదంబరీకరతల స్పర్శంబుచేఁ జంద్రాపీడ దేహంబుననుండి చంద్రధవళం బగునొక తేజంబు వెలువడినట్లు తోఁచెను. అనంతర మంతరిక్షంబున నశరీరవాణి విన నయ్యెను.

### దివ్యపురుషుండు కాదంబరి నూఱడించుట.

"వత్సా, మహాశ్వేతా," ఇంతకు మున్ను నేన నిన్నూఱడించితిని. పుండరీకుని శరీరంబు నాలోకంబున నున్నది. చంద్రాపీడుని శరీరంబును శాపదోషంబున నాత్మచే విడువఁబడినను గాదంబరీకరతలస్పర్శంబుచే నాప్యాయమానంబయి యోగిశరీరంబునుంబోలె నుండును. మీాసమ్మిగకయి శాపక్షయం బగునందాఁక నిత్తను వంద యుండవలయు. జలమునందుఁగాని యగ్నియందుఁగాని ప్రవేయక సమాగమప్రాప్తి యగునందాఁక ప్రయత్నంబునఁ బాలించుచుండవలయు, అనువచనంబు నాలించి పత్రలేఖ దక్క నెల్లరును గగనంబు గాంచుచుండిరి. అంత నత్తేజంబుచేఁ బత్రలేఖ తెప్పిఱిలి లేచి వేగంబునఁ బరుగిడి యింద్రాయుధంబుం బట్టుకొని దేవుండు దూరం బరుగ నీవిచట నొంటిమై శోభింప వనుచు నింద్రాయుధంబుతోఁ గూడ నచ్ఛోదంబునం బడియెను.

అనంతరమె యచ్ఛోదంబుననుండి యొకతాపసకుమారుండు వెడలి వచ్చి మహాశ్వేతం గాంచి 'గంధర్వరాజపుత్రి' జన్మాంతరం బొందిననన్నెఱుంగుదువా?' అనుటయు మహాశ్వేత లేచి శోకానందమధ్యవర్తినియై ప్రణమిల్లి 'భగవంతుఁడా, కపింజల, ఈయభాగ్యను దలంప వైతివిగదా? అట్లుగాదేనిఁ బుండరీకుండు స్వర్గగతుఁడైనను జీవించి యున్ననన్నుఁ దలంపకుంట యుచితంబ యగు. కాన చెప్పుము. పుండరీకశరీరంబు

గొంపోయినవా రెవరు? ఏల కొంపోయెను? అతనివృత్తాంత మేమి? అతం డెందున్నవాఁడు? నీ వెఱుంగుదువా? ఇందాఁక వార్తయైన నేల చెప్పవైతివి? నన్నొల్లని విడిచి నీ వొంటిమెయి నేల వచ్చితివి?, అని యడుగఁ గాదంబరీపరిజనంబును రాజపుత్రలోకంబును నచ్చెరువునఁ గాంచుచుండఁ గపింజలుం డిట్ల నియె:—

కపింజలుండు మహాశ్వేతకుఁ బుండరీకాదుల శాపదోషంబు నెఱింగించుట.

'గంధర్వరాజనందన! వినుము. ఆట్లార్తప్రలాపంబు సేయుని న్నొంటిమెయి విడిచి వయస్యస్నేహంబున 'నాప్రియసుహృదు నెటకుఁ గొనిపోయె, దని యాపురుషువెన్వెంట నరిగితి. ఆపురుషుండు నాకు మాఱువల్కక యె చంద్రలోకంబున కరిగెను. అచ్చట మహోదయం బనుసభలోన నిందుకాంతమణిమయం బగుగొప్పపర్యంకంబునఁ బుండరీకశరీరం బునిచి నాతోఁ ని ట్లనియె:—'కపింజల! నన్నుఁ జంద్రునిగా నెఱుంగుము. ఏను జగదనుగ్రహంబునకయి యుదయించి నాకృత్యంబు నిర్వర్తించుచుండఁ గామదోషంబున నీప్రియమిత్రుఁడు నన్ను శపించెను, 'నీవు నన్నుఁ గరంబులచే సంతాపపఱిచి ప్రియాసమాగమసుఖంబు నొందకమున్న ప్రాణవియుక్తుఁ గావించితివి. కాన నీవును గర్మభూమి యగుభారతవర్షంబునఁ బ్రతిజన్మంబునను ననురక్తి నొంది ప్రియాసమాగమసుఖంబు నొందకయ తీవ్రం బగుహృదయవేదన ననుభవించి జీవితంబు

విడిచెదుగాత., నావిని యేను శాపాగ్నిచే మండిపడి యీని ర్వివేకబుద్ధి నిరపరాధి నగున న్నేల శపించె, నని కోపించి 'నీ వును నాకు సమంబుగ సుఖదుఃఖంబుల నొందు చుండెదగ, వని వానికిఁ బ్రతిశాప మిచ్చితి, కోపంబు దొలంగిన పదంపడి యిట్లు విమర్శించితి, 'మహాశ్వేత నాకిరణంబులవలనఁ గలిగినయప్స రసల కులంబున జన్మించినగౌరియందుఁ బుట్టెను. అక్కన్య తనంతన యితని భర్తనుగా వరించెను. ఇతండు స్వయంకృతంబ గుశాపదోషంబున మర్త్యలోకంబున నిరువురు పుట్టవలెను. అట్లుగా దేనిఁ బ్రతిజన్మంబున ననువిప్ప చరితార్థంబు గానేర దు. కాన యీశాపదోషంబు విడుచునంతకు జీవరహితం బగునీశరీరంబునకు వినాశంబు గలుగకుండుత, మనియేఁ గొని వచ్చితి. మహాశ్వేత నూఱడించితి. ఈశరీరంబు నాతేజంబున నాప్యాయనంబు గొనుచుండును. నీ విప్పుడు చని యీవృత్తాం తంబు శ్వేతకేతున కెఱింగింపుము. అతం డీదేనిఁ బ్రతిక్రియ సేసినఁ జేయంగలఁడు., అని పలికి నాకు సెలవొసంగెను. ఏను వయస్యుని విడిచి శోకాంధుండనై చనుచు మార్గంబున నతికోపి యగునొక్కవైమానికు నుల్లంఘించితి. అతండు నన్నుఁ గాల్చుచూపులవలెఁ గాంచి యిట్లనియె:—'దురాత్మా మిథ్యాతపోబలగర్వితా, గగనమార్గంబు విస్తీర్ణంబయియున్న ను నీవు తురంగంబునుంబోలె నన్నతిక్రమించితివి. కాన తురం గమంబవై మర్త్యలోకంబున నవతరింపుము., అన విని యేను

గన్నీ రొలుకదోసిలి యొగ్గి 'భగవంతుఁడా, ఏను వయస్యశో
కాంధుండనై నిన్నతిక్రమించితిగాని యవమానబుద్ధిచే గాదు.
కాన శాపం బుపసంహరింపుము, నావిని యతం డిట్లనియె:—
'ఇచ్చినశాపంబు తొలఁగింప వలనుపడదు. సకిది కొం
తకాలంబు మాత్రమె యుండునట్లు చేసెద. నీ వెవ్వనికి వాహ
నంబ వగుదువో, వానియవసానంబున స్నానంబు చేసి విగత
శాపుండ వయ్యెదు., అన విని యే నిట్ల డిగితి. 'దేవ అస్లైనను
నామిత్రునితోడను, చంద్రునితోడను శాపదోషంబున మర్త్య
లోకంబుననె జన్మించున ట్లనుగ్రహింపవలయు, ననవిని యమ్మ
హాత్ముండు ముహూర్తమాత్రంబు దివ్యదృష్టి నవలోకించి నా
తో నిట్లనియె:—'ఉజ్జయినీనగరంబున సంతానార్థము తపం
బుసేయు తారాపీడుం డనుభూపాలునకుఁ జంద్రుండు తనయుం
డై జన్మింపఁ గలఁడు. నీవయస్యుం డగుపుండరీకుండును నాత
నిమంత్రి యగు శుకనాసునకుఁ దనయుం డగును. నీ వారా
జనందనునకు వాహనత్వ మొందఁగలవు., అనుటయు నంతట
నేను క్రింద నున్నసాగరంబునం బడితి. అటనుండి వ్వారువంబ
నై వెడలితి. అశ్వజన్మంబునను నాకుఁబూర్వజాతిజ్ఞానంబు గల
దు. దాననె యికార్యంబు నెఱిఁగియుఁ గిన్నరమిథునంబు వెం
బడి యీప్రదేశంబునకు జంద్రాపీడుం గొనివచ్చితి. కాన యీ
చంద్రాపీడుండు చంద్రునియవతారము. మఱియుఁ దొల్లింటియ
నురాగసంస్కారంబున నిన్నుఁ గోరి, యెఱుంగని నీచే శాపా

గ్నిదగ్ధుం డైనవైశంపాయనుండు పుండరీకునియవతారము.,
అనవిని మహాశ్వేత 'హా! దేవ' పుండరీక, జన్మాంతరగతుండవయ్యు నాయం దనురాగంబు విడువవైతివా? నీవు లోకాంతరగతుండవైనను నీప్రాణంబులకు నేన రాక్షసినై జన్మించితి. ఆవిధాతృండు నన్నుఁ బుట్టించుటకును, నాకు దీర్ఘజీవితం బొసంగుటకును నిన్ను పలుమాఱు హింసించుటయు ప్రయోజనంబయ్యె. పాపకారిణి నేన నిన్నుఁ జంపుకొని యెవ్వని నిందింతు? ఎవ్వనికిఁ జెప్పుదు? ఎవ్వని శరణుఁ జొత్తు? న న్నెవ్వఁడు దయఁ జూచు? నని విలపించుచుండఁ గపింజలుం డి ట్లనియె :—'గంధర్వరాజపుత్రి, ఇందు నీదోషం బేమి కలదు? శాపదోషంబున మీయిర్వురకును దుఃఖంబు ప్రాప్తించె నని వచించితిగదా? మఱియు మీరు చంద్రునిభాషితంబు విని యుంటిరి. కాన యిర్వుర శ్రేయంబునకయి తపం బంగీకరించితివి. తపంబున కసాధ్యం బేమి కలదు? అని బోధింపఁ గాదంబరి కపింజలునితో ని ట్లనియె :—

'భగవంతుఁడా, కపింజల, పత్రలేఖయు నీవును గొలనం గ్రుంకితిరిగదా? పత్రలేఖావృత్తాంతంబు దెలిపి యనుగ్రహింపుము. అని యడుగ నతం డిట్లనియె:—'భగవతి, సలిలంబునఁ బ్రవేశించిన పదంపడివృత్తాంతంబు నేమియు నెఱుంగ. కాన చంద్రాపీడునియాత్మ యెం దుండెనో? వైశంపాయనుని జీవుం డెందు జన్మించెనో? పత్రలేఖవృత్తాంత మెద్దియో?

సకలంబు నెఱుంగ శ్వేతకేతునిపాదమూలంబున కిరుగుచున్నాఁడ, నని వచించుచు నెగసెను. అంత సందఱు నాశ్చర్యంబున నాకసంబు చూచుచుండఁ గాదంబరి మహాశ్వేతతో ని ట్లనియె:—

కాదంబరి చంద్రాపీడ శరీరము నుపచరించుట.

'ప్రియసఖి' సమానదుఃఖత్వముం గలిగించిన విధాత్రిచేఁ జిరకాలంబునకు సుఖంబుగ నిలుపఁ బడితిని. ఇప్పుడు నీకు ముఖంబు గనఁబఱిచి ప్రియసఖి యని పలుకుచు లజ్జింపను. నీకును నే నిప్పు డ ప్రియసఖి నైతిని. కాన యిప్పుడు నాకు జీవితంబైనను మరణంబైనను దుఃఖప్రదంబు గాదు. ఇం దేది యావశ్యకంబనియే నెవ్వరి నడుగుదు? నా కెవ్వ రుపదేశింతురు? ఇందెద్ది శ్రేయమో నీవ యుపదేశింపుము., అనుటయు మహాశ్వేత యి ట్లనియె:—'ప్రియసఖి' ప్రశ్నంబుతో నేమి? ఉపదేశంబుతో నైన నేమి? ప్రియతమసమాగమప్రత్యాశ దుర్లంఘ్య మగు. అదియ సర్వంబుఁ జేయుంచు. పుండరీకునివృత్తాంతంబు కపింజలునివలన స్పష్ట మయ్యెఁగదా? అప్పుడు దివ్యపురుషుని వచనమాత్రంబునను నేను దుఃఖంబు సహించియుంటిని. నీకు విశ్వాసస్థానం బగుప్రియతమశరీరంబు నీయంకంబునందునుండ నీకు చింతతో నేమి? ఈశరీరంబు వినాశంబు నొందకుందునందాఁక నన్య మేమి సేయ నగు? అ ప్రత్యక్షంబు లైన దేవతలను మృచ్ఛిలాదినిర్మితంబు లైనప్రతిమలయందు శ్రేయంబునకయి పూజా

నమస్కారాదులచే నుపచరించుచుండఁ బ్రత్యక్షదైవం బగు చంద్రునిమూర్తి లభింప నేమిచెప్పవలయు? నని పలుకఁ జంద్రాపీడశరీరంబు నొకశిలాతలంబున నునిచి తాను స్నానంబు చేసి శుచియై యాశరీరమును బూజించెను.

కాదంబరి చంద్రాపీడునిశరీరము కాంతియుక్తముగా నున్న దని మదలేఖకుఁ జెప్పుట.

అంత మఱునాఁడు ప్రాతఃకాలంబున మదలేఖను బిలిచి 'మదలేఖా, నా కీశరీరంబు తొల్లింటియట్ల కానంబడియెడి. కాన నీవు చూచి నిరూపింపుము.' అనవిని మదలేఖ 'ప్రియసఖ, ఇందు నిరూపింప నేమి కలదు? అంతరాత్మ లేమిచే నిత్తనువునకు వ్యాపారం బుపరతి నొందెఁగాని ముఖంబు శోభను విడువక తొల్లింటివిధంబుననె చూపట్టుచున్నది, తక్కినంగంబులును నట్లె కానంబడియెడిని.' అనుటయు సంతసించి మహాశ్వేతకును రాజపుత్రలోకంబునకును గనఁబఱుచుటయు రాజపుత్రులు సంతసించి యిట్లనిరి. 'దేవి, దేవుం డపుణ్యుల మగుమమ్ము విడిచి పోయినను నాతనిమోముదమ్మి చంద్రబింబంబునుం బోలెఁ బ్రకాశించు చుండుట్ల నీప్రభావంబు,' అని వచింప వారల నాహారంబు గ్రహింపఁజేసి తానును మహాశ్వేతాదులతో శరీరస్థితి నాచరించెను. మఱునాఁడు కాదంబరి మదలేఖను బిలిచి 'ప్రియసఖి, దేవునిశరీరము నుపచరించుచు శాపక్షయం బగునందాఁక నే నిందుండవలయు. కాన నీవు

చని యద్భుతం బగు నీవృత్తాంతంబు నాతలిదండ్రులకుఁ జెప్పి వారలు నన్ను వేఱువిధంబుగఁ దలంపనియట్లును, ఇప్పు డిచ్చటికి వచ్చి దుఃఖిత నగునన్నుఁ జూడకుండునట్లును నొనరింపుము. తల్లిదండ్రులఁ గాంచునెడ దుఃఖవేగంబు భరింపఁజాలను. దేవుండు మృతినొందినప్పుడును గన్నీరు గార్పనిదాన; దేవుండు నిస్సంశయముగ జీవించునని తెలిసి యెట్లు గంట నీరుఁబెట్టుదు?, వని వచించి యనిచెను. అంత నది యరిగి మరలి వచ్చి యిట్లనియె:—'ప్రియసఖి, నీవాంఛితంబు సిద్ధించెను. నీతలిదండ్రు లిట్లు చెప్పి పుత్తెంచిరి. 'అల్లునితోఁ గూడినకూఁతుం జూడవలయునని మాకోరిక కావున నీ వ ప్రియునివరించుట మాకుఁ బరమానందంబు. అందును లోకపాలుఁ డగుచంద్రుని యవతార మగుట యుత్తమము. అట్లుగాన కొంతకాలంబున నె శాపం బవసానంబు నొంద వరునితోఁ గూడియున్ననీదువదనారవిందంబు గాంచెదము.', నావిని కాదంబరి చంద్రాపీడుని శరీరంబు దైవతంబునుంబలె నుపచరించుచుండెను.

తారాపీడునొద్దనుండి వార్తాహరులు వచ్చిరని మేఘనాదుండు కాదంబరితో జెప్పుట.

అంత నొకనాఁడు మేఘనాదుండు కాదంబరిం గాంచి యిట్లనియె:—'దేవి, యువరాజు రాఁ దడవయ్యె నని తారాపీడమహారాజు వార్తాహరుల ననిచెను. వారు వచ్చి చంద్రాపీడుం జూడఁగోరిన వారితో నిచ్చటివృత్తాంతంబు దెల్పి యి

త్తెఱం గెఱిఁగింపుమనిన వారు 'నీచెప్పినవా_ర్తయ టుండని మ్ము. స్నేహంబో? భక్తియో? యనువృత్తియో? యువరాజుం జూడబలాత్కరించెడిని. కాన దేవికి విన్నవించి దేవుని పాదప్రణామంబుచే మాయాగమనప్రయాసంబు సఫలంబు సేయు, మని విన్నవించుచున్నారు., అని విన్నవింప శ్వశురకులంబునకుఁ గలిగినదుఃఖంబుం దలపోసి కాదంబరి యి ట్లనియె:— 'వారలు చూడఁ గోరుట యుక్తమే. దేవునిఁ జూడకయ యరిగి యట నేమి చెప్పఁగలరు? లోకాతీతం బగునట్టివృత్తాంతంబు గనినను విశ్వాసంబు గలుగుట యరిది. ఇఁకఁ జూడనిచో నేమి చెప్పవలయు?, కాన వారల నిటఁ బ్రవేశపెట్టుము, అని యానతిచ్చినయనంతరము. మేఘనాదునిచేఁ బ్రవేశపెట్టఁబడి సాష్టాంగదండప్రణామంబు సేసినయాసద్భృత్యులఁ గాంచి కాదంబరి యి ట్లనియె:—'భద్రముఖులారా, తొల్లింటిచందంబున సశోభం బగువదనంబు గంటిరి గదా? ఇప్పుడు తారాపీడునొద్ద కరుగుఁడు. మృతశరీరంబు వినాశంబు నొందని వృత్తాంతంబు మీరు ప్రత్యక్షంబుగఁ గాంచినను వెల్లడి చేయవలదు. ఇఁక నచ్ఛోదసరస్తీరంబునఁ జంద్రాపీడుం గాంచితి, మని యె వచింపుఁడు. జరిగినవృత్తాంతంబు వచించుచెడ మృతిని మాత్రము విశ్వసింతురుగాని, శరీరము వశింపకుంటను విశ్వసింపరు. ఈవృత్తాంతంబు దెల్పి దూరంబుననున్నగురుజనంబును మరణసంశయం బగుకష్టంబునఁ బడవైచుఁటయం దేమి

ప్రయోజనంబు గలదు? జీవితేశ్వరుండు జీవింప నీయద్భుతవృత్తాంతంబు తనంతన ప్రకటంబు గాఁగలదు., నావిని వారలిట్లనిరి :—

'దేవి, ఏ మని విన్నవింతుము? ఏ మచ్చటి. కరుగకుండుటచేఁగాని, అరిగి చెప్పకుండుటచే.గాని యువ్వార్త తెలుపకుండుట సంభవించు. ఈరెండును సంభవింపవు. ఏమన, యువరాజవైశంపాయనులవార్త తెలియక తారాపీడమహారాజుచేఁ జెప్పి పనుపఁబడినయేము వారిచేరువకు నరలిపోవకుండుడెట్లు? అరిగియుఁ బుత్రులవార్త నెఱుఁగ నుత్సుకులగు తారాపీడశుకనాసులవదనంబు లవలోకించి యేము నిర్వికారవదనులమై యుండుటయు నెట్లు? అని వచింపఁ గాదంబరి మేఘనాదునితో ని ట్లనియె:—'పరిచిత మగుజనంబున కిది యుచితంబు గాదని యెఱుంగుదు. ఐనను గురుజనంబునకు మనఃపరితాపంబు గలుగునని యెంచి యే నిట్లు వచించితి. కాన యిచ్చట నడచినసకలవృత్తాంతంబును బ్రత్యక్షంబుగఁ గాంచినసత్యవచనుండు భృత్యులతో నరుగుఁ గాత, మనుటయు మేఘనాదుం డి ట్లనియె:—'దేవి, రాజలోకంబువార్త యేమి? ఈ. భృత్యవర్గం బంతయుఁ గందమూలంబులఁ గుడుచుచు 'మాలో నొక్కండేని యువరాజును విడిచి నగరంబున కరుగఁ గూడ, దని నిశ్చయంబు సేసికొనియుండెను. మఱియు నెవ్వారలు సంపదయందును, నాపదయందును నేకవిధంబున సేవింతురో, ప్ర

శంసింపఁబడియు గర్వింపరో, చెప్పకయ చేయుదురో, చేసియుఁ జెప్పికొనరో, పరాక్రమించి పొగడికొనరో, పొగడఁబడి లజ్జింతురో, సంగ్రామంబులయందు ధ్వజంబులపోలె ముందు నిలుతురో, దానకాలంబున వెనుక డాఁగియుందురో, నిజగృహంబుకంటె స్వామిపాదమూలంబున సుఖం బుండుదురో, వారలె భృత్యులుగాక మఱి యెవరు చూచుచును నంధులవలెను, వినుచును బధిరులవలెను నుండువారు భృత్యులె, కాన భృత్యవర్గం బంతయు నిచ్చట నయుండఁగల దని విన్నవించి త్వరితకుం డనుకుమారసేవకునిఁ బిలిచి వానిని వార్తాహరుల తోసనిచెను.

### వార్తాహరు లుజ్జయిని ప్రవేశించుట.

అంతఁ బెక్కుదినంబులు గడచినను విలాసవతి పుత్రునివార్త తెలియక పరితపించుచు నవంతీనగరదేవతల నర్చింప మాతృకాయతనంబునకు విచ్చేసి 'దేవి' అదృష్టము ఫలించెను. మాతృకలు ప్రసన్నులైరి. వార్తాహరులు వచ్చుచున్నారని పరిజనంబువలన విని యానందబాష్పంబులు గ్రమ్మినదృష్టిచే దెసలం గాంచి వాక్షేపంబున నాచెవిలోన నిట్టియమృతంబు నెవరు గ్రిల్లపిరి? ఎవరు చూచిరి? ఏమి చెప్పిరి?, అని యడుగుచునె చూచుచుండెను. ఆసమయంబున వార్తాహరులను గాంచి పురజనులు, 'యువరాజు వచ్చుచుండెనా? ఎంత దూరంబున నున్నవాఁడు? మీరు గంటిరా? వైశంపాయనుండు

గలసెనా? అతండును వచ్చుచుండెనా?, అని యడుగుచున్నను మాఱు వల్కక నాసాగ్రంబున దృష్టి నునిచికొని శ్రమంబున కాశ్రమంబులవలెను, ప్రవాసంబుల కావాసులవలెను, సర్వ దుఃఖంబుల కాస్పదంబులవలెను వచ్చెడులేఖహారకులం గాంచి విలాసవతి మాతృకాలయంబు ముంగిటిలోన నుండి వారలం బిలిపించెను. అప్పుడు తలంపకయ విలాసవతిని గాంచుటంజేసి దుఃఖావేగం బిమ్మడియగుట నింద్రియరహితులవలెను, దారు ప్రతిమలవలెను, నిర్జీవితులనలెను నరుదెంచిన వార్తాహరు లను గాంచి కొన్నియడుగు లెదురేగి యిట్లడిగెను. 'భద్ర ముఖులారా, తొలుత నాకుట్టినవార్త దెలుపుఁడు. నాడెందం బు వేయువిధంబులఁ దలంచెడిని. కుమారకుం గంటిరా? అని యడుగ వారలు ప్రణమిల్లి యిట్లనిరి. 'దేవి' ఏ మచ్చట సర స్తీరంబున యువరాజుం గంటిమి. తక్కంగలవార్త త్వరితకుం డు నివేదింపం గలఁడు., నావిని విలాసవతి కనుదమ్ముల నశ్రు వులురుల నిట్లనియె:—

విలాసవతి చంద్రాపీడు నుద్దేశించి విలపించుట.

'దూరంబుననుండియుఁ బ్రహార్షరిబు లేనిమిూరాకచేత ను, ప్రతిలేఖ లేనిశిరంబులచేతను, ప్రయత్నంబున నశ్రుమో క్షంబు నిరోధించు లోచనంబులచేతను దెలుపవలసిన దంతయు మీారె తెల్పితిరి. వాఁడింక నేమి చెప్పఁగలఁడు? 'హా! వత్స! జగదేకచంద్ర, చంద్రాపీడ, చంద్రానన, చంద్రశీతలప్రకృతీ,

చంద్రాభిరామగుణ, ఏమి జరిగె? ఏల రానైతివి? తండ్రీ. చం ద్రాపీడ, 'అమ్మ' నిన్ను విడిచి వేఱుచో విలంబంబు సేయ, నని వచించి యుంటివే, ఇది నీకుఁ దగునా? ఈ వగుగునప్పుడు మగుడ బాలుని ముఖావలోకనంబు దుర్లభం బని నాడెందం బునకె తోఁచె. బలాత్కారంబున నరిగితివిగదా? నీదు జన్మం బుమొదలు శైశవఁబు దలఁచి శోకింతునా? యౌవనంబున వ ర్తించు నీరురూపసంపదను దలపోసి దుఃఖింతునా? రాఁగల ప్రభుత్వము నూహించి చింతింతునా? ఎఱుంగ., నని విలపిం చుచు మూర్ఛ నొందెను.

తారాపీడుండు విలాసవతియొద్దకు వచ్చుట.

అంత విలాసవతిపరిజనంబు వేగంబునఁజని యావృత్తాం తంబు నివేదింపఁ దారాపీడుం డుద్భ్రాంతి నొంది వేగిరంబ లేచి శుకనాసునితోన కరేణుక నెక్కి యతివేగంబునఁ జను చుండ రాజమార్గంబున 'ఇది' యేమను కలకలస్వనంబుతో జనంబులు పఱుచుచుండ వెడలి మాతృకాలయంబునఁ బ్రవే శించి ధేనుక నవరోహించి 'కదళీదళంబులచే వీవఁబడుచును. జలార్ద్రంబు లగుపాణిపల్లవంబులచే స్పృశింపఁబడుచును పరి జనంబుచే మూర్ఛ దేర్పంబడు విలాసవతిం గాంచి కన్నీరు గా ర్చుచుఁ గూర్చుండి విలాసవతిని స్పృశించుచు గద్గదస్వరంబున మెల్లమెల్ల నిట్లనియె:-

తారాపీడుండు విలాసవతి నూఱడించుట.

'దేవి! నిజంబుగఁ జంద్రాపీడునకు వేఱువిధం బగున ప్రియంబు ప్రాప్తించినను నతనికై యిట్లు వైవశ్యంబు నొంద నేల? మనము శుభకర్మంబుల నింతమాత్రం బాచరించితిమి' ఇంత కెక్కుడు సుఖంబునకుఁ బాత్రులము గాము. హృదయం బు ద్రవ్యయ్యలు చేసికొనినను నలభ్యంబు లభించునే? మనము దుర్లభం బగుకుమారుని జన్మోత్సవంబు గంటిమి. అంకంబున నిడికొని వానిముఖం బవలోకించితిమి. స్పర్శసుఖం బనుభవించి తిమి. అవ్యక్తమనోహరంబు లగుప్రథమజల్పితంబుల నాలించి తిమి. అతండు విద్యల గ్రహింప వానిగుణగణం బభినందించి తిమి. అతనికి యౌవనంబు ప్రాప్తింప నమానుషం బగురూ పంబును, శక్తిని గాంచితిమి. యౌవరాజ్యంబున నభిషిక్తుం డగునాతనిశిరంబు మూర్కొంటిమి. దిగ్విజయంబు సేసి యరు దెంచినవానియంగంబుల నాశ్లేషించితిమి. ఇంక వధూసమే తుం డగువానిని రాజ్యంబునఁ బ్రతిష్ఠితుం జేసి తపోవనంబున కరుగవలయు ననునొక్కమనోరథంబు సమకూడదాయె. సకల మనోరథంబులఁ బడయుగలుగుట యెంతటిపుణ్యవంతునకో గదా? మఱియు నీలేఖహారకులతోఁ గుమారుని సేవకుం డరుదెం చెననియు, వానికి సకలంబు దెలియుననియుఁ బరిజనంబువలన వింటిని. కాన వానిమాట యాలించి పిమ్మట జీవితంబో? మర ణంబో? నిశ్చయింపఁ గలము.' అని పలుకుచుండఁ బ్రతీహారి

త్వరితంబుగఁ ద్వరితకుం డేతెంచి వచ్చి రాజునకుం గనఁబఱిచెను. అంత భూకాంతుండు వానిం గాంచి చంద్రాపీడస్నేహంబున తనకరంబుచే వానిశిరంబు స్పృశించుచు 'భద్ర' కుమారునివృత్తాంతంబు చెప్పుము. ఏనును, తల్లియు, మంత్రిముఖ్యుండును వేగిరంబ రమ్మని వ్రాసి యనిచినను నేల రాఁడాయెను? రానికారణంబైన నేల వ్రాసి యనుపఁడాయెను?, అని యడుగ వాఁ డరిగినదిమొదలు జరిగినవృత్తాంతంబు చెప్పఁదొడంగెను. క్రమంబుగఁ జంద్రాపీడుని హృదయంబు వగిలినవృత్తాంతంబు నివేదింప విని తారాపీడుం డార్తస్వనంబున వానితో ని ట్లనియె:—

తారాపీడుండు పుత్రునుద్దేశించి శోకించుట.

'భద్ర' విరమింపుము. ఈవు చెప్పవలసినవార్త చెప్పితివి. ఏను వినవలసినవార్త వింటిని. ప్రశ్నకౌతుకంబు పూర్ణంబయ్యె. శ్రవణయుగంబు కృతార్థత నొందె. హృదయం బానందంబు వహించె. సుఖం బున్నవాఁడ. హా! వత్స, నీదు డెందంబు వగులుటం జేసి నీకు వైశంపాయనునియందుఁ గలప్రేమంబు వెల్లడి సేసితివి. ఏము క్రూరులము, కఠినచిత్తులము, కర్మచండాలురము! కావుననె నీవృత్తాంతంబు వినినమాడెందంబు వేయితునుకలు గాదయ్యె. ఈప్రాణంబులు మరణదుఃఖంబునకు వెఱచి తమయంతన చంద్రాపీడుని వెంబడి యరుగనేరవు. పుత్రుం డొంటిమై దూరంబు సేరకమున్న యతనితోఁ గలి

యుటకై యత్నింతము. ఆ! శుకనాస, స్నేహంబున కిది కాలము. కాన మహాకాలదేవు దేవళంబు సమీపంబునఁ జితిఁ బేర్పింపుము. కంచుకులారా, అగ్నిప్రవేశోపకరణంబులం గొనిరండు. నిష్కారణ రోదనంబులతో నేమి? ధనం బెల్ల విప్రుల కొసంగుఁడు. భూమిపాలులారా, మీయిచ్ఛం జనుఁడు. అని విలపించు తారాపీడునిఁ గాంచి త్వరితకుండు 'దేవ' నీవు డెందంబునఁ దలంచినట్లు గాదు, హృదయంబు వగిలినను యువరాజుశరీరంబు నాశమొందదు. కారణం బాలింపుము, అని సకలవృత్తాంతంబు నివేదింప విని తారాపీడుండు శుకనాసు నవలోకించెను. 'సుహృదులు తాము దుఃఖితు లయ్యుఁ దమదుఃఖము దలంపక మిత్రదుఃఖంబు నడంప యత్నింతురు. కాన శుకనాసుండు స్వస్థుని వలెఁ దారాపీడునితో నిట్లనియె:—

శుకనాసుండు తారాపీడు నూఱడించుట.

'దేవ, చిత్రం బగునీసంసారంబున సుఖదుఃఖమోహమయంబు లగు దేవతిర్యఙ్మానవజాతులు వర్తించుచుండఁ ద్రిగుణాత్మకం బగు ప్రధానంబు పరిణామంబుననో, శుభాశుభకర్మంబులవిపాకంబుననో యనేకప్రకారంబులఁ జన్మించుచు, నశించుచు నుండు స్థావరజంగమంబులకు సంభవింపనియవస్థయె లేదు. ఈయంశంబులు యుక్తిచే విమర్శింప యుక్తిరహితంబు లాగమప్రామాణ్యంబున నెన్ని కనఁబడియుండిని ? ముద్రాబంధంబుననో? ధ్యానంబుననో, శివమూర్ఛితుని స్వస్థునిఁ జేయు

టయం దేమి యుక్తి కలదు? పలువిధంబు లగుకర్మంబులసిద్ధి
విషయంబునను శాస్త్రంబు ప్రమాణం బగు. అట్టి శాస్త్రం
బులయందును, సకలపురాణంబులయందును ననేకశాపవార్త
లు వినుచునె యున్నారము. ఎట్లన, మహేంద్రపదంబున ను
న్ననహుషునకు నగస్త్యముని శాపంబున నజగరత్వము సంభ
వించెను. శుక్రునిశాపంబున యయాతికిఁ దారుణ్యంబుననె ము
దిమి ప్రాపించె. అష్టవసువులును శాపదోషంబున గంగయందు
జన్మించిరి. భగవంతుఁ డగునారాయణుండును దశరథునకుఁ
బుత్రుండై యుద్భవించెను. కావున మానవులయందు దేవతల
యుత్పత్తి యసంభావితము గాదు. మఱియు గర్భారంభసమ
యంబున దేవరవారు విలాసవతినోరఁ జంద్రుండు ప్రవేశించు
నట్లు కలఁ గంటిరి. ఏనును స్వప్నంబునఁ బుండరీకంబు గని
యుంటిని. కాన యిందు సందియము లేదు. అట్లుగాన దేవర
వారు శాపావసానంబున వధూసహితుండై యరుదెంచి శర
ణంబుల కెరగినపుత్రునిం జూడఁ గలరు. వారలశాపంబు మన
లకు వరంబ యాయె. కాన దీనికై దేవరవారును, దేవేరియుఁ
గొంచె మేని శోకింపఁ బనిలేదు. కావున నిప్పు డభిమతదేవ
తారాధనంబునకై యత్నింపవలయు. శ్రేయస్కరంబుగ
నెద్ది వినంబడునో? అది యంతయుఁ జేయువలయు. వైదికంబు
లు నవైదికంబు లగుకర్మంబుల కసాధ్యంబు లేదు. తొలుత
వారలజన్మంబును నిట్టికృత్యంబులచేతన కలిగెఁగదా! యని

శుకనాసుండు తెలుపఁ దారాపీడుండు సశోకుండై యి ట్లనియె:—'నీచెప్పిన దంతయు నిక్కంబు. ఇది యంతయు నీకం టె నెఱింగినవా రెవరు? మాకు బోధించువా రెవరు? అయినను గుమారుముఖం బవలోకింపక యిందు నే నిలువఁజాల.,
అనుటయు విలాసవతి పేరెలుంగున ని ట్లనియె:—'ఆర్యపుత్ర, అటులేని విలంబ మేల ? శీఘ్రంబ ప్రయాణం బనుసంధింపుము., అని వచించుచుండ శుకనాసున కాప్తుం డగునొకవిప్రుండు వచ్చి యిట్లు విన్నవించెను.

' దేవి, అస్పష్టం బగువార్తాకలకలంబుచే డెందంబు వ్యాకులం బగుట మనోరమ తా నరుదెంచి యిట మహారాజువా రున్నా రని లజ్జచే మాత్ర కాలయంబు వెనుక నిలిచి దేవి నడిగెడిని. 'వార్తాహరు లేమి చెప్పిరి. వైశంపాయనుండు జీవించియున్నవాఁడె? స్వస్థశరీరుండెనె యువరాజు వా ర్త యేమి? ఎం దున్నవాఁడు? వార లగు వెంతురా? ఎన్ని దినములకు వత్తురు?, నావిని యారాజు వారలమరణవా ర్తకం బెను గష్టతరం బగునీప్రశ్న వా ర్త నాలించి శతగుణం బగుదుఃఖంబుచేఁ గన్నీరు పర్షించుచు విలాసవతిని గాంచి యి ట్లనియె:—'దేవి, నీప్రియసఖ, బాలకులవృత్తాంతం బేమియు నెఱుఁగదు. అన్యునివలన వినునెడ. జీవితంబు వీడిచెడిని. కాన నీవ యరిగి తెలిపియూదార్చుము., అని యనిచి శుకనాసునితోఁ దాను ప్రయాణంబు సేయ యత్నించెను.

### తారాపీడుం డచ్ఛోదంబునకు వచ్చుట.

అప్పుడు రాజునందలి యనురాగంబునను, చంద్రాపీడునం దలిస్నేహంబునను, ఆశ్చర్యంబు చూడవలయు ననుకుతూహలంబువలనను, గృహరక్షకులు గాక తక్కుంగలజనంబు లెల్ల నుజ్జయినినుండి వెడలిరి. అత్తఱిఁ దారాపీడుండు శీఘ్రగమనంబునకు విఘాతహేతువులైనవారల వారించి స్వల్పపరికరంబుతో వెడలి కొంచెము దూరమరుదెంచి యెందాఁక వచ్చితిమి? ఇంక నెంతదూరము చనవలయు? నని యడుగుచు కతిపయదినంబులకే యచ్ఛోదంబు చేరెను. అప్పుడు తారాపీడుండు తనచిత్తంబు వికల్పశతంబుల భావించుచుండ మహాశ్వేతాశ్రమంబునకుఁ దొలుత త్వరితకు ననిచి యట మలినీకృతశరీరంబైన సకలరాజపుత్రలోకంబుం గాంచి విలాసవతితో నిట్లనియె:—'దేవి, అదృష్టము ఫలించె. రాజపుత్రులు చంద్రాపీడునిఁ గాచికొనియున్నవారు. కాన కుమారునిశరీరంబు ధరింపఁబడియుండె నని తోఁచెడిని., అన విని యద్దేవి తనకరతలంబుచే నావరణవసనంబు దొలఁగించికొని రాజపుత్రులం గాంచి 'హా! వత్స, శైశవంబు మొదలుకొని పాంసుక్రీడ లాడు రాజపుత్రులనేడ్వుర నీవొక్కరుండవె కానరావుగదా?, అని శోకించుచుండ భూపాలుండూఱడించి మేఘనాదునితో నిట్లనియె:—'మేఘనాద, కుమారునివార్త యెఱిఁగింపుము. అనవిని వాఁ డిట్లనియె:—'దేవ, శరీరంబునఁ జైతన్యంబు

లేమిచేఁ జేష్టలు మాత్రము లేవుగాని శరీరంబునానాఁటికిఁ గాంతియుక్తమై కన్పట్టుచున్న దనుటయు విని తారాపీడుండు విశ్వసించి మహాశ్వేతాశ్రమంబున కరిగెను. అటఁ జంద్రాపీడుని తలిదండ్రులు వచ్చిరని విని మహాశ్వేత దుఃఖించి గుహాభ్యంతరంబు ప్రవేశించెను.

విలాసవతి పుత్రు నుద్దేశించి విలపించుట.

అంతఁ దారాపీడుండు శుకనాసునితో నాశ్రమపదంబు ప్రవేశించి పుత్రుని గాంచునంతలో మనోరమతోడ విలాసవతియుఁ బ్రవేశించి 'పుత్రా, చిరకాలంబునకుఁ గంటిని. మాఱు వల్కుము. బాల్యంబునను నామాట విననివాఁడవు. ఇప్పుడు ప్రలపించినను విన వేల? కుమార, నీకయి యతిదూరంబున కరుదెంచినతండ్రిపాదంబులకుఁ బ్రణమిల్లుము. నీకు గురుజనంబుపైఁ గలయాభక్తి యెటఁబోయెను? గుణంబు లెటఁబోయె? స్నేహం బెటఁబోయె? నాయభాగ్యంబున సర్వంబు విడిచి యౌదాసీన్యం బవలంబించి యుంటివా?, అని విలపించెను. అత్తఱిఁ దారాపీడుం డి ట్లనియె. 'దేవి, ఇతండు మునపుణ్యాతిబులచేఁ బుత్రత్వ మొందినను దేవతామూర్తిగాన శోకింపఁ దగదు. కావున శోకంబు విడువుము. శోకించినను గుత్తుకయు వగలుగాని హృదయంబు వగులదు. శోరిన్నుండి నిరర్థకం బగు ప్రలాపంబ వెడలుగాని జీవితంబు వెడలదు. నేత్రజలంబపడిపోవుగాని శరీరంబు పడిపో నేరదు. మఱియు నెవ్వతప్రభా

వంబునఁ గ్రమ్మఱఁ గుమారునకుఁ బునర్జీవితంబు గలుగునో, అట్టి కోడలు మదాగమనంబు విని శోకవేగంబున సొమ్మసిల్లి సఖులు యత్నించినను తెలివి నొందదయ్యె. కాన తొలుత నీకన్నియను మూర్ఛ దేర్పుము. పిమ్మట యథేచ్ఛంబుగ రోదింపనగు ననవిని విలాసవతి, 'నా పుత్రునకు మగుడ జీవితప్రాప్తికి నిమిత్తభూత యగు గంధర్వరాజపుత్రి యెక్కడ నని పఱుగిడి కాదంబరినిఁ బట్టుకొని లేవనెత్తి యంకంబున నునిచికొని, 'అమ్మా, ఈవు నా పుత్రుడగు చంద్రాపీడుని శరీరంబు ధరించి యున్న దానవుగదా?, యనుటయుఁ జంద్రాపీడనామగ్రహణంబుచేఁ దెలివిగొని గురుజనంబులకుఁ గ్రమంబుగ వందనంబు చేసెను. 'ఆయుష్మతీ, దీర్ఘకాలము సుమంగలివగు, మని యాశీర్వదింపఁబడి విలాసవతి వెనుకఁ గూర్చుండెను. అట్లు గాదంబరి తెప్పిఱిలుటఁ జంద్రాపీడుండె జీవించి నట్లు లెంచి తారాపీడుండు మదలేఖను బిలిచి యి ట్లనియె:— 'ఇవ్విధ మెవ్విధ మగునుపచారముచే నిందాఁక నుపచరించుచుండెనో, ఆయుపచారంబు మాయుపరోధంబునం గాని, లజ్జచేఁ గాని విడువఁ దగదు. ఏము నిష్ప్రయోజనంబుగఁ జూచువారమె యగుదుము. ఏ యింట నుండిన నేమి? లేకున్న నేమి? ఏవధువు కరతలస్పర్శంబునఁ గుమారుని తను విందాఁక నాప్యాయితంబై యుండెనో, ఆకన్యయె యతని పార్శ్వంబున నుండుఁగాక., అని వచించి వెడలి యందుఁ దనకుఁ గల్పితం బగు నావాసంబునకుఁ జనక యాశ్రమంబు సమీపంబునఁ

దపస్వివాసోచితం బగునొకతరులతామండపమునఁ గూర్చుండి సకల మగురాజచక్రంబుం బిల్చి యి ట్లనియె:—

తారాపీడుండు వానప్రస్థాశ్రమమునఁ బ్రవేశించుట.

'ఏను శోకవేగంబున నిది యంగీకరించితి నని మీరు తలంపవలదు. ఇక్కార్యంబు పూర్వచింతితంబయ్యెను. ఏదన 'ఏను వధూసమేతుం డగుచంద్రాపీడునివదనంబు గాంచి రాజ్యభారం బతనియం దునిచి యేదేనొకయాశ్రమంబునఁ బశ్చిమవయసు గడపవలయు, నని యెన్నుచుంటిని. ఆమనోరథంబును విధి విహాపంబు లగుకర్మంబులచేనైన నొనంగెను. ఇఁక నేమి చేయవలయు? నియతి దురతిక్రమణీయంబు. కాన చిరకాంక్షితం బగునామనోరథంబు నించికొన నెంచెద. నిష్ప్రయోజనంబును, మాంసపిండమాత్రంబు నగునీశరీరంబుచే బరలోకసుఖంబు లార్జించుటయ లాభము.; అని పల్కి సన్నిహితంబులైనను నుపభోగసుఖంబుల విడిచి వన్యంబులగు తపోవనదుఃఖంబుల నంగీకరించి యుండెను. ఎటులన, హార్మ్యబుద్ధిని వృక్షమూలంబులయందును, అంతఃపురస్త్రీభావమును లతలయందును, పరిచితజనస్నేహమును మృగములయందును, వసనాసక్తిని నారచీరలయందును, ఆహారసౌఖ్యమును గందమూలములయందును, జయేచ్ఛను బరలోకంబునందును, కోశబుద్ధిని తపంబునందును, ఆజ్ఞను మౌనవ్రతంబునందును, తనయస్నేహమును దరువులయందును సంక్రమింపఁ జేసికొని, తపస్విజనో

చితంబుల నాచరించుచు సాయంప్రాతఃకాలములయందుఁ జం ద్రాపీడుం గాంచుచు నందే వసించి యుండెను., అని వచించి జాబాలిమునీంద్రుండు ముదిమిచే విచ్ఛాయం బగుహాసంబుఁ జేసి హారీతప్రముఖుల నందఱ నవలోకించి యి ట్లనియె:—

జాబాలిమునీంద్రుండు వైశంపాయనుని జన్మమూలంబు దెల్పుట.

'అంతఃకరణంబు నపహరించుకథారసంబు నాక్షేపసా మర్థ్యంబు గంటిరా? ఎద్ది చెప్ప నుపక్రమించితినో, అది విడిచి యె కథారసంబువలన నతిదూరం బతిక్రమించితి. కాన కా మోపహతచిత్తుం డగునప్పుండరీకుండు స్వయంకృతం బగునవి నయంబున నె దివ్యలోకంబుననుండి పరిభ్రష్టుండై మర్త్యలోకం బునందు వైశంపాయననామంబున శుకనాసునితనయుండై జన్మించెను. అతండె మగుడఁ గుపితుం డగుజనకుని యాక్రోశం బువలనను, మహాశ్వేత సత్యవచనంబువలనను శుకయోనియం దుఁ బుట్టెను., అని జాబాలిమునీంద్రుండు పలుకుచుండఁగనె న్నిద్రించి మేల్కాంచినవానికింబలెఁ బూర్వజన్మోపాత్తంబు లగునెల్లవిద్యలును జిహ్వాగ్రంబున నుండెను. సకలకలలయందుఁ గౌశలంబును, మనుజునకుంబలె విస్పష్టవర్ణం బగువాణియు, సర్వవస్తువిషయం బగుజ్ఞానంబును లభించె. పలుమాట లేల? మనుష్యశరీరంబు దక్కఁ దక్కుంగలసకలంబు నప్పుడే ప్రాపిం చె. అదియె చంద్రాపీడునిపై స్నేహంబును, అదియె కామపర త్వంబును, అదియె మహాశ్వేతయం దనురాగంబును, అదియె

తత్ప్రాప్తికయి యాత్మసాక్ష్యంబును గలిగి యుండెను. తప్పుడు జాబాలిం గాంచి మెల్లన నిట్లు విన్నవించితి. 'భగవంతుఁడా, నీయనుగ్రహంబున జ్ఞానంబు గలిగె. పూర్వబంధువులఁ దలంచితి. నామృతిని వినినంతన యెవ్వని హృదయంబు వగిలెనో, ఆచంద్రాపీడునిఁ దలంప నాహృదయంబు వగులునటులు తోఁచెడిని. కాన కనికరించి యాతనిజన్మంబును జెప్పి యనుగ్రహింతురు గాక. ఏనతనితోఁ గూడియుందునేని నాకుఁ దిర్యగ్జాతివాసంబును బీడాకరంబు గాదు.', అని విన్నవింప నమ్ముని కుపితుండునుంబోలె నన్నుఁ గాంచి యిట్లనియె:—'దురాత్మా, ఈ వెట్టిచిత్తచాంచల్యంబుచే నిట్టిదశ నొందితివో. దానిని విడువవేల? ఇప్పుడు రెక్కలెరా వాయె. నీవు పోఁ జాలినంతవాఁడవై నన్నడుగుము.', అని పలికి 'ఆహా! కథారసాక్షేపంబున మనకుఁ దెలియకయె రాత్రి తెల్లవారెనని వచించుచు గోష్ఠిని చెదరవిడిచి లేచెను. అట్లు జాబాలిమునీంద్రుండు లేవఁగా వీతరాగయు, నిష్కాముకయు, మోక్షమార్గావస్థితయు నగుసమస్తం బైనమునిసభయు గథారసంబునఁ బారవశ్యంబు నొంది స్తంభితయుంబోలెఁ జిరకాల ముండి యథాస్థానంబునకుం జనియె. మునికుమారకులున్నను హారీతుండు తనకరతలంబునఁనె నన్ను నెత్తితనపర్ణశాలకుఁ గొంపోయి యుంచునిచి ప్రాతఃకాలికకృత్యంబులు నిర్వర్తింపనరిగెను.

అప్పుడే నిట్లని చింతించితి. 'అనేకజన్మాంతరకృతసు

కృతశతసమధిగమ్యం బగుమానుష్యంబె దుర్లభంబు. అందును బ్రాహ్మణ్యంబు సకలజాతివిశిష్టంబు.. అందును మునిత్వంబు దుష్ప్రాపంబు. దానికిని దివ్యలోకవాసిత్వమలంకారము. ఇట్టి స్థానంబుననుండి స్వదోషంబుచేతన భ్రష్టుండ నైతి. ఈతిర్యగ్జాతినుండి యెట్టు లుద్ధరింపఁబడుదు? పూర్వజన్మబంధువులతో నెట్లు సమాగమసుఖం బనుభవింతు? అట్టిసుఖం బనుభవింపక నిష్ప్రయోజనం బైనయీజీవితంబు రక్షించిననేమి ? ఈతను వెందేనిఁ బడివోవుత. నా కెల్లప్పుడు దుఃఖ మొసఁగఁ జింతిల్లువిధిమనోరథంబు పరిపూర్ణం బగుత, మని చింతించుచుండ హారీతుండు సంతసంబున వికసించుముఖంబుతోఁ బరుగిడుచు వచ్చి 'తమ్ముఁడా, వైశంపాయన, నీతండ్రి యగుశ్వేతకేతు నొద్దనుండి కపింజలుండు నిన్ను వెదకుచు వచ్చెను., నావిని యేను మెడ యెత్తి కాంచుచు 'నితం డెక్కడ, నని యడుగ 'నితండు తాతపాదంబులసమీపంబున నున్నవాఁ డని వచించె. అంతనేను 'నన్నును నచ్చటికిఁ గొనిపొమ్మని పల్కుచు దురాత్ముఁడ నగునే నమ్మహాత్ముఁ గపింజలుం గాంచితి. చూచుచునె కన్నీరు గార్చుచు ని ట్లంటి.

వైశంపాయన కపింజలుల సంభాషణము.

'సఖుఁడా, కపింజల, రెండుజన్మంబులనుండి గానంబడనినిన్నుఁ గాంచి వేగిరఁబ లేచి దూరంబున నుండియె చేతులు సాఁచి గాఢాలింగనసుఖం బనుభవింతునా? చేతితోఁ బట్టు

కాని కూర్చుండఁ బెట్టుదునా?, సుఖాసీనుండ వగునీదు శరీర
సంవాహనంబుచే నధ్వశ్రమంబు దీర్తునా?, అని దుఃఖించున
న్నుఁగాంచి కపింజలుం డిరుగేల నన్ను లేవనెత్తి వక్షంబున
ను, శిరంబున నునిచికొని యెలుఁగునిడి రోదనంబుచేసెను.
అట్లు రోదనంబు సేయునతనిం గాంచి యే నిట్లంటిని. 'సఖుఁ
డా, కపింజల, నీవారంభించినయవి మందమతి నగునాకుఁ దగు
గాని నీకుఁ దగదు. నీవు బాలుండవయ్యు సంసారబంధరూపం
బులును, మోక్షమార్గవిరుద్ధంబులు నగురాగాదిదోషంబులచేఁ
స్పృశింపఁబడ వైతివి. కాన మూఢజనులు పోవు నీమార్గం
బుతో నేమి! కూర్చుండుము. తాతపాదంబులకుఁ గుశలమా?
ఆయన నన్నుఁ దలంచునా? నాదుఃఖంబుచే దుఃఖించునా?
నావృత్తాంతంబు విని యే మనియెను? కోపించెనా? లేదా చె
ప్పుము, అని యడుగ నతం డిట్లనియె:— సఖుఁడా, వైశం
పాయన, నీజనకునకుఁ గుశలము. అమ్మహాత్ముం డీవృత్తాంతం
బు దివ్యదృష్టిచేఁ గాంచి ప్రతిక్రియకై కర్మ మారంభించెను.
దానన యేను తురంగభావంబుననుండి విముక్తుండనై యమ్మ
హానీయు పాదమూలంబున కఱిగి భయంబున దూరంబుననె
యుండ నన్నుఁ జేరువకుఁ బిల్చి యిట్లనియె:— 'వత్స, క
పింజల, ఇందు నీదోషం బేమియు లేదు. ఏ నెఱిఁగియుం
డియు నుత్పత్తిసమయంబుననె యాయుష్కరం బగునిక్క
ర్మంబు నెఱవేర్పకుండుట నిదియంతయు నాదోషంబెయగు.

కాన ఋది పరిసమా ప్తినొందునంతకు నిచట న యుండుము.,
అనుటయు భయంబు విడిచి యేనిట్లువిన్నవించితి. ' తండ్రీ,
నానెచ్చెలి యెందు జన్మించి యుండెనో, అందు నేను నరిగి
యుండునటు లనుగ్రహింపుము., అన విని ' వత్స, వీఁడు శు
కజాతియందుఁ బుట్టియుండె. నీ వరిగియు నతనిం దెలిసికొనఁ
జాలవు. అతండును ని న్నెఱుంగఁడు. కాన యింద యుండు
ము., అని వచించెను. మఱియు నేఁడు ప్రాతఃకాలంబున న
న్నుఁ బిలిచి యి ట్లనియె:— 'వత్స, కపింజలుఁడా, నీమి
త్రుండు మహాముని యగుజాబాలియాశ్రమంబున నున్నవాఁ
డు. జన్మాంతరస్మృతిని గాంచె. కాన నీ విప్పుడచటి కరిగి
నాయాశీర్వాదంబుచే ననుగ్రహించి ' వత్స, ఈకర్మంబుపరిస
మా ప్తి నొందునందాఁక నయ్యాశ్రమంబునన యుండు., మని
యానతిచ్చె నని వచించి డెందంబునఁ బరితపించుచుండెను.
అంత నే నతనిం గాంచి ' నఖుఁడా, కపింజల, ఏల పరితపిం
చెదవు? మందపుణ్యుండ నగు నాకతన నీవు తురంగత్వమును
బొంది పరాధీనవృ త్తివై బహుతరదుఃఖంబుల ననుభవించితివి.
సోమపానంబున కుచితం బగునీనోరఁ గళ్లెపుగంట్ల నెట్లు సహిం
చితివి ! మె త్తనిలేఁదలిరులదలిమంబున కుచితం బగునీవీపునఁ
బల్యాణంపుభార మెట్లు సహించితివి ? సుకుమారంబు లగునీ
యంగంబులయందుఁ గశాభిఘాతం బెట్లు లోర్చితివి? బ్రహ్మసూ
త్రంబు వహింప నర్హం బగునీదేహంబున తంగువాఱుచేఁ గలి

గీనపీడ నెట్లు పడితివి?, అని యిట్టియాలాపంబులతో నక్కాలంబునఁ దిర్యగ్జాతిదుఃఖంబుం దలంపక సుఖం బుంటిని. అంత మధ్యాహ్నం బగుటయు హారీతుండు కపింజలునితో నన్ను యథోచితం బగునాహారంబు చేయించెను. కపింజలుండు కృతాహారుండై క్షణంబుండి నాతో నిట్లనియె:— "నీతండ్రి యారంభించినకర్మంబు పరిసమాప్తినొందిన వర్తమానంబు నే వచ్చి చెప్పునందాఁక నీ వింద యుండునది.", యని చెప్పి వెడలెను. కపింజలుం డరిగినపిదప హారీతుండు నన్నుఁ బెనుచుచుండఁ గొన్నిదినంబులకు ఱెక్కలు పొడముట నెగయుటకు శక్తి గలవాఁడనై యిట్లు చింతించితి.

### చిలుక జాబాల్యాశ్రమంబు వెడలుట.

"ఇప్పు డరుగ శక్తుఁడ నైతి. చంద్రాపీడునుత్పత్తి యెచటనో యెఱుంగ. అమ్మహాశ్వేతయె యటనున్నదిగదా? వను నట కేఁ జని యుందు నని నిశ్చయించి యొకనాఁటిప్రభాతంబున విహారంబుమిషచే వెడలి కేవల ముత్తరదిశ నవలంబించి యరిగితి. స్వల్పదినములనుండియే గమనం బభ్యసించుచున్నవాఁడనగుటఁ గొంచెము దూరం బరుగఁగనె యంగములు భంగంబు నొందు నటులయ్యె. దప్పిచే ముకుదొప్ప యెండుకొనిపోయె. బెట్టునిట్టూర్పుచు నిటఁ బడుదు, నిటఁ బడుదు నని యెంచుచు నొకనేరేడుచెట్టుమీఁద నిలిచి మెల్లన దిగువఁజేరి యాచెట్టు

మొదట సర్వాశ్రమంబున నిద్రించితి. చిరకాలంబునకు మే ల్కాంచి చూచునంతలో విడిపించుకొనవశక్యంబు లగువల్ల త్రాళ్లచేఁ గట్టఁబడి యుంటిని. ఎదుట మోహమునను, జ్ఞానంబు నను జీఁకటి గ్రమ్మినవాఁడును, వర్ణంబునను, చరితంబునను గృష్ణుండును, వసనంబునను, గర్మంబునను మలినుండును, వపు వునను, వచనంబునను గఠినుండునునై రెండవయముండో యన నఁ దనరు నొకపురుషుం గాంచితి. వానిం జూడఁగనె తనువుపై నిరాశుండనై యి ట్లడిగితి.

వైశంపాయనుండు చండాలునిచే గ్రహింపఁబడుట.

'భద్ర, నీ వెవ్వఁడవు? నన్నేల పట్టితివి? మాంసాశచేఁ బట్టితి వేని నిద్రించునప్పుడే యేల కడతేర్ప వైతివి? అట్లుగాక కౌతుకంబునఁ బట్టితివేని నేను బంధుజనంబులఁ జూచువేడుక తో నరుగుచున్నాఁడఁ గాన నన్ను విడువుము. నీవును బ్రాణి ధర్మంబున నున్నాఁడవుగదా ?', నావిని వాఁ డిట్లనియె:— 'ఏను గ్రూరకర్ముండను. జాతిచేఁ జండాలుండను. ఏను నిన్ను మాంసాశచేగాని, కుతూహలంబునఁగాని పట్టినవాఁడఁగాను. ప్రభువ, ఇటకు సమీపంబున మాతంగవసతియందు మాస్వా మి కలఁడు, అతనికొక కూఁతురు కౌతుకమయం బగుప్రథమ వయస్సున నుండెను. అకన్నియ యెవ్వండో దురాత్ముండు జాబాల్యాశ్రమంబున నిట్టిశుకంబు గలదని బోధించె. దాన నాకన్నియకుఁ గౌతుకంబు గలుగుట నిన్ను గ్రహింప నను

బోంట్లు పలువు రనుపఁబడిరి. ఇప్పుడు, నాపుణ్యంబులచేఁ బట్టు వడితివి. నిన్ను బంధింపను గాని, విడువను గాని యీయము దుగాక నేను శక్తుండఁగాను, నావిని దే నిట్లు చింతింపఁదితి. 'అయ్యో! మందభాగ్యుఁడ నగునాకర్మంబులవిపాకం బెంతదారుణంబు. ఏ మన, సురాసురవందితచరణ యగుసిరికి జన్మించి భువనత్రయవంద్యుఁ డగు శ్వేతకేతుని నిజహస్తంబుచే సంవర్ధితుండ నై, దివ్యలోకాశ్రమంబులఁ జరించునేను మ్లేచ్ఛజాతుల చేతను దూరంబుగ విడువఁబడుమాతంగనివేశంబు చూడవలయు. చండాలులగూడి యొక్కచో నుండవలయు. మాతంగస్త్రీలొసఁగునాహారంబు మెసవవలయు. హా! దురాత్మా, పుండరీకహతక, నీజన్మలాభం బెంతనింద్యం బయ్యె. ఏకర్మంబుల కిట్టిపరిణామంబు గలిగె? ప్రథమగర్భంబునన యేల వేవిధంబులఁ జీల వైతివి? అమ్మ, లక్ష్మి, అతిగహనం బగునీనరకంబువలనఁ గావుము. తండ్రీ, నీవ కదా నన్నుఁ బెనిచితివి? నీకులతంతువును గాచికొనుము. కపింజల, ఇవు డీవు క్రమ్మఱ వచ్చి యీపాతకంబువలనఁ బాప వైతేని జన్మాంతరమందైన నానమాగమంబున నాశ పెట్టికొనకుము,' అని విలపించి వానితో ని ట్లంటిని. 'భద్రముఖుఁడా, ఏనుఁ బూర్వజన్మజ్ఞానంబు గలముని ని. న న్నీసంకటంబువలన నుద్ధరించి తేని నీకుఁ బుణ్యంబు గలుగును. ఇచట నెవ్వారును జూచువారు లేరుగాన నన్ను విడిచి నను నీకుఁ బ్రత్యవాయంబు లేదు. కాన నన్ను విడువుము.' అని

పలుకుచువానిపాదంబులపైఁ బడితిని. అంత వాఁడు నన్నుఁ గాంచి నగి యిట్లనియెః— 'ఓరి! మోహాంధ, శుభాశుభకర్మంబులకు సాక్షిభూతంబు లగు పంచమహాభూతంబులు నీశరీరంబునందు లేవా? అవి గానవా? ఏను స్వామ్యాజ్ఞచేఁ గొనిపోయెద,' నని పల్కుచు నె పక్కణంబునకుఁ గొంపోయి చండాలకన్యకకుఁ గనఁబఱిచెను. ఆకన్యకయు మంచిపని చేసితివని వానిచేతినుండి తాను తనకరయుగంబుచే నన్నుఁ గైకొని 'ఆ! పుత్రక, లభించితివి. ఇప్పుడెక్కడికిఁ బోయెదవు? నీకామచారిత్వము నడంతు' నని పల్కి దారుమయపంజరమున నునిచి యిందు సుఖంబుండు మని యూరకుండెను. అప్పుడు చిత్తంబున నే నిట్లు చింతించితి.

వైశంపాయనుండు చింతించుట.

'అయ్యో! సంకటంబునఁబడితి. ఏను నావృత్తాంతంబు దెల్పి శిరంబునఁ బ్రణమిల్లి విడువు మని విన్నవింతు నేని నప్పుడు మిగుల బాధకం బగు. ఏమన, బాగుగ ముచ్చటించు పక్షి యిది నన్ను బంధనంబున నునిచె. నదియుఁబో ద్విగుణితంబగుఁ గదా? నాబంధనదుఃఖంబున నెవ్వతకు దుఃఖంబు గలుగు? ఏను దీనికిఁ బుత్రుండనా? తమ్ముఁడనా? బంధువుండనా? కాను. కాన మౌనం బవలంబించి యుండెద. అప్పుడును జాతి యతిక్రూరంబు గావ శౌర్యంబున నింత కెక్కుడవస్థ నొందించు నెడఁ జండాలురతో వాఙ్మిశ్రణంబు నొందక తనువు దొఱంగుటయ శ్రేయము

ఇదియు నుంగాక, నేను మానము నవలంబించి యుండి నిదివి
సివి విడిచిన విశువఁగలదు. మఱియు దివ్యలోకంబుననుండి జా
ఱుటయు, మర్త్యలోకంబున జన్మించుటయు, తిర్యగ్జాతియందుఁ
బడుటయు, చండాలహస్తంబు నొందుటయు, ఇట్టిపంజరబంధ
దుఃఖంబు గాంచుటయు నిదియంతయు నజితేంద్రియత్వంబు
దోషంబె కదా? ,అని యెంచి మానము నవలంబించినవాఁడనై
న న్నాచండాలదారిక పలుకరించినను, బెదరించినను, అడిచిన
ను, బాడిచినను నేమియుఁ బలుకక పెద్దగఁ జీత్కారంబె చే
యుచు నయ్యది పానాశనంబుల నొసంగినను గ్రహింపకయె
యాదినంబు గడపితి. మఱునాఁ డాకన్యక కొన్ని ఫలంబులను,
పానీయంబును గొనివచ్చి నన్నుఁ గాంచి యిట్లనియె;—

చండాలకన్యక వైశంపాయను నపహసించుట.

‘ఆఁకలిడప్పులు గల పశుపక్షులు ప్రాప్తించిన యాహా
రంబు గ్రహింప కుండుట సంభవింపదు. ఇఁక నీవు పూర్వజన్మ
జ్ఞానంబున భక్ష్యాభక్ష్యవివేకశాలివై యే మొసంగు నాహా
రంబు గ్రహింపవా? అయినను భక్ష్యాభక్ష్యవివేకరహితంబగు
తిర్యగ్జాతియం దున్ననీకు భక్ష్యం బేమి కలదు? ఇంతటి వివేక
శాలివి యిట్టితిర్యగ్జాతియందుఁబడ నర్హంబగుకర్మం బెట్లుచేసి
తివి? మొదలు నీచిత్తంబునె వివేకస్థానంబైన నిలువవైతివి.
ఇఁక దేని విచారింతువు? ఇప్పుడు నిజకర్మంబున బ్రాప్తంబైన
జాతికిఁ దగునట్లు నేసిన యెడ నీకు దోషంబు లేదు. కాన యాఁ

కలిదప్పులచే శరీరం బేల యాయాసపఱిచెదవు? మునిజనోచితంబు లగుఫలంబు లేలభక్షింపవు? పానీయం బేల గ్రోలవు? అనుటయు నేను చండాలజాతి కనుచిత మగునన్నాటచేతను, సద్వివేకంబుచేతను, విస్మయంబునొంది జీవితాశచే నాహారం బియ్యకొంటిఁగాని మానంబు విడువనైతి. ఇట్లు గొంత కాలంబు గతింప నొక్కనాఁడు ప్రాతఃకాలంబునఁ గాంచునంతకుఁ గనకపంజరమున నున్ననన్నును, ఇట్టిచండాలదారికను గాంచితి. ఆకన్యక దేవరవారిచేఁ జూడఁబడియెఁగదా? అంతలో నప్పక్కణంబు నమరపురీసదృశం బగుటయుఁ గాంచి చండాలవాటికలో వసించితి ననుదుఃఖంబు విడిచి యచ్చెరువున నిది యే మని యుఘుగ నెంచునంతలో నీచండాలదారిక నన్ను దేవరవారి పాదమూలంబునకుం గొనివచ్చెను. కాన యదియెవరో? తనకుఁ జండాలత్వము నేల కనఁబఱిచెనో? నన్నేల బంధించెనో? ఇచటి కేల కొనివచ్చెనో? ఈవిషయంబున దేవరవారివలె నేనును గౌతుకంబు గలిగియె యున్నవాఁడ, అని వైశంపాయనుండు వచింప నా శూద్రకుండు ప్రతీహారిని బిలిచి చండాలదారికను దోడ్కొని రమ్మని యానతిచ్చెను. అంత నాప్రతీహారి త్రోవఁ జూపుచుండ నమ్మాతంగకన్యక ప్రవేశించి యెదుట నిల్చుండియె తన తేజంబున్న దిరస్కరించుచుఁ బ్రాగల్భ్యంబున నిట్లనియె:—

చండాలదారిక శూద్రకుని పూర్వజన్మంబు వ్యక్తీకరించుట.

'భువనభ్రమణ ' రోహిణీపతి, కాదంబరీలోచనానంద చంద్ర, ఇతండు వచింప మీయిర్వుర పూర్వజన్మవృత్తాంతంబు నాలించితివిగదా ? ఇతం డీజన్మంబునను దండ్రిచే నిషేధింపం బడియుఁ గామరాగాంధుండై తండ్రియానతినుల్లంఘించి వధూ సమీపంబునకుఁ బ్రయాణం బగుట తాన చెప్పికొనియె. కాన ఏ నీదురాత్మునితల్లి నగుసిరిని. ఇతండు వెడలుట నితనితండ్రి దివ్యదృష్టిం గాంచి. ' ఈకర్మంబు పరిసమాప్తి నొందునందాఁక నీకొమరుండు తిర్యగ్జాతికంటెను నధోగతి నొందకుండునట్లు వీనిని మర్త్యలోకంబున నె బంధించియునుచుము. అనినాకాన తిచ్చె. కాన యితనికిఁ బశ్చాత్తాపంబు గలుగ నేనిట్లాచరించితి. ఇప్పుడాకర్మంబుపరిసమాప్తినొందె. శాపావసానంబుసమీపించె. శాపావసానంబున మీయిర్వురకుఁ బరస్పర సమాగమ సుఖం బు గలుగవలయు,నని నీయొద్దకు వీనిం గొనివచ్చితి. ఇందును లోకసంపర్క పరిహారంబునకయి చండాల జాతిని గనఁబఱిచితి. కాన యిప్పుడు మీయిర్వురును జన్మజరా వ్యాధి దుఃఖబహుళంబులగు నీశరీరంబులఁ బరిత్యజించి యిష్టజనసమాగమ సుఖంబనుభవింపుఁ,డని పలుకుచునె యందఱు గాంచుచుండ పుడమి నుండి గగనతలంబున కెగసెను. "

శూద్రకుండు పూర్వజన్మజ్ఞానముఁనొంది కాదంబరి నుద్దేశించి పరితపించుట.

అంత దాని వచనంబు వినఁగనె యారాజేంద్రునకు నాకృష్టకార్ముకుం డగు మకరకేతుండు కాదంబరిని పరమా

త్రంబుగఁ జేసి జీవితాపహారణంబునకై లోనఁ బ్రవేశించెను. అమ్మకరకేతునకు వెఱచెనన నితనియంతఃకరణంబు కాదంబరిని శరణుజొచ్చెను. అతని బాణపక్షవాతంబునావాతినోయన సీతనిశరీరంబు వడంకెను. మదనునివిశిఖరజంబు గ్రమ్మెననఁ గనుఁగవ నశ్రువుల విడిచెను. దహ్యమానం బగునాగ్ద్రకాష్ఠం బూష్మజలంబు విడుచునట్లు శరీరంబు చెమ్మటఁ గురిసెను. మదనునిశరశల్యంబులునాటెనన నితనియంగంబులు పరవశంబులయ్యె. ఇట్లు సకలబాహ్యకృత్యంబుల విడిచి యక్కాదంబరినే ధ్యానించుచును, నక్కాంతనె తలంచుచును, నవ్విలాసినినె కనుచును, నాసుందరినె ముచ్చటించుచును, నాలలననె బ్రతిమాలుచును, నారమణిపాదంబుల పయిఁబడుచును, నక్కామినితోఁ గ్రీడించుచును సకలకృత్యంబులవిడిచి పవలు గనుఁదమ్ములఁదెఱవక రేయియునిద్రింపక, మిత్రులతో మాటాడక, గురువులకుఁ బ్రణమిల్లక, ధర్మకృత్యంబులను జేయక, సుఖంబును గోరక, దుఃఖంబునకును దలంకక, మరణంబునకును వెఱవక, గురువులవలన లజ్జింపక, తనువునను స్నేహంబులేక వర్తించుచు, పరిజనంబులు పలుదెఱంగుల శిశిరోపచారంబులు సేయుచున్నను, కాష్ఠీభూతదేహుం డగుశూద్రకునకు దాహహేతువగుకామానలంబు పరిపూర్తి వహించెను. మహాశ్వేతయందలి యుత్కంఠచే వైశంపాయనునకును గామాగ్ని ప్రజ్వలించెను.

### వసంతర్తువర్ణనము.

ఆసమయంబున మదనానలంబు పురిగొల్పనో యన దక్షిణానిలంబుఁ బ్రవర్తింపఁ జేయుచు, బాలసహకారంబులఁ జిగుర్పఁ జేయుచు, కామిజనమనంబుల నున్మూలించుచు, మానంబు మాపివేయుచు, లజ్జను దుడిచివైచుచు. రాగమయంబో, ఉత్సవమయంబో, ప్రేమమయంబో, ఔత్సుక్యమయంబో యన సకలంబు గలిగించుచు, మధుమదకోకిలాలాపంబులచేఁ బాంథులకు దుఃఖంబు గలిగించుచు, మదాకులంబు లగు భ్రమరంబుల ఝంకారంబులచే విరహిజనమనంబుల నదలించుచు, మనోభవోల్లాసకారి యగు సురభిమాసంబు ప్రవర్తించెను.

కుసుమచాపుని పరమాస్త్రం బగు మధుమాసంబుచేఁ గాదంబరి తనడెందంబు పర్యాకులత నొందఁ గామదేవుని మహోత్సవంబు గొప్పయత్నంబున నెఱవేర్చి సాయాహ్నంబున స్నానంబు చేసి కామదేవుపూజ నిర్వర్తించి యద్దేవునెదుటఁ జంద్రాపీడు నతిసురభిశీతలంబు లగుజలంబులచే స్నానము చేయించి చరణంబులు దాఁక మృగమదామోదియగు హరిచందనంబున నలఁది సురభికుసుమమాలికలఁ గుంతలకలాపంబునఁ జుట్టి యతనిచెవికొన నశోకస్తబకంబు నునిచి కర్పూరమయంబులు, గుసుమఘటంబులు నగు నాభరణంబులచే నలంకరించి ఱెప్పవేయను మఱచి భావార్ద్రం బగు దృష్టిచేఁ గాంచుచు, మహాశ్వేత కాంచునో యని పలుమఱు దెసలం బరికించు

చేఁ బరవశయై యేకాంతంబున జీవించియున్న వానింబలె నిర్భరంబుగ గంఠంబు గౌఁగిలించెను. ఆకాదంబరి కంఠగ్రహణంబుచే జంద్రాపీడునికంఠస్థానము క్రమ్మఱజీవితంబు గ్రహించెను. దివసక్షయంబునకు ముకుళించిన కలువపూవు శరజ్జ్యోత్స్నచే వికసించునట్లు హృదయం బుచ్ఛ్వాసంబు వహించెను. ప్రభాతంబున తమ్మిమొగ్గ విచ్చునట్లు కనుఁగవ విచ్చెను. కమలంబు ప్రకాశించుతీరున వదనంబు శోభగాంచెను.

### చంద్రాపీడుండు జీవించి కాదంబరితో సంభాషించుట.

ఇట్లు చంద్రాపీడుండు నిద్రించి మేల్కాంచినవానివలె సకలాంగచేష్టల నొందికంఠలగ్నయగు కాదంబరి నట్టె కాంచి యక్కునఁ జేర్చికొని వాతాహతయగు బాలకదళియుం బోలె భయంబున వడంకుచుఁ గనుఁగవ మోడ్చి విడువను, గ్రహింపను నేరక యున్నయన్నాతితో నిట్లనియె:— ‘ భీరూ, భయంబు విడువుము, నీవు అమృతసంభవంబగు నప్సరఃకులంబున జన్మించితివిగాన నీదుకంఠగ్రహంబుచేతనె యుజ్జీవితుండనైతి. తేజోవంతం బగునీశరీరము తనంతనె యనశ్వరంబు. విశేషించి కాదంబరీకరస్పర్శంబున నాప్యాయితంబగు, నని యేఁజెప్పినమాట తలఁచితావుగదా? నీవు పాణిచే స్పృశించుచున్నను ఇన్నిదినంబులు జీవింపకుంటకు శాపదోషంబు నిమిత్తంబు. అది యిప్పుడు వదలిపోయె, శూద్రకాఖ్యం బగుతనువు విడిచితి. ఇత్తనువునందు నీకాసక్తి గలిగెనని యిద్దానిం బ్రతిపాలిం

చితి. కావన నీ కీలోకంబును, చంద్రలోకంబును భోగ్యంబుల య్యె. మఱియు నీప్రియసఖ యగు మహాశ్వేతకుఁ బ్రియతముం డైనపుండరీకుండును నాతోన విగతశాపుం డయ్యె,నని చంద్రాపీడుండు పలుకుచుండఁగనె పుండరీకుండు శుకశరీరంబువిడిచి చంద్రలోకవాసంబున లగ్నంబైన యమృతపరిమళంబు వహించిన యంగంబులతోఁ దొల్లిటిచందంబుననె కంఠంబున నేకావళిని వహించి కపింజలునికరంబు పట్టుకొనియరుదెంచెను. అతనిం దూరంబుననె కాంచి కాదంబరి చంద్రాపీడునివక్షస్థలంబు విడిచి తాన పరుగిడి మహాశ్వేతకంఠంబు గౌఁగిలించుకొని పుండరీకాగమనమహోత్సవంబు నివేదించునంతలోఁ బుండరీకుండు చంద్రాపీడుని సాన్నిధ్యంబు నొందెను. చంద్రాపీడుండతనిం గంఠంబున గౌఁగిలించుకొని యిట్లనియె:—

చంద్రాపీడుండు పుండరీకునితో సంభాషించుట.

'సఖుఁడ, పుండరీక, నీవు ప్రాగ్జన్మసంబంధంబున నా కల్లుండ వైనను, అనంతరజన్మంబునఁ గలిగిన సుహృత్స్నేహంబున నాతోఁ గూడి యుండవలయు.,' అని చంద్రాపీడుండుపలుకుచుండఁగనె చిత్రరథహంసులకు నీవృత్తాంతంబు నివేదింపఁ గేయూరకుండు హేమకూటంబున కరిగెను. అత్తఱి మదలేఖ యుఁ బరుగిడుచు నరిగి మృత్యుంజయజపవ్యగ్రుం డగుతారాపీడుని పాదంబులపైఁ బడి 'యువరాజు వైశంపాయనునితోఁ గూడ జీవించెనని యత్యానందంబున నుచ్చైస్స్వరంబునఁ బ

లికెను. తారాపీడుం డమ్మాటవిని పరమానందవిహ్వలుండై విలాసవతిని బట్టుకొని యడుగులు దొట్రువడ నృత్తము చేయువానివలె నడచుచు కనుఁదమ్ములు వికసించిననరపతి సహస్రంబులతోఁ గూడి మలయమారుతంబునఁ జలించినకమలాకరంబునుంబోలె 'నెక్కడ నున్నవాఁడు, ఎక్కడ నున్నవాఁడనియడుగుచు శుకనాసునితో నచ్చటి కరుదెంచెను. ఇట్లు విచ్చేసి పుండరీకునితోఁ గూడియున్న చంద్రాపీడుం గాంచి శుకనాసునితో నిట్లనియె:—

తారాపీడ ప్రముఖులు సంతసించుట.

'మంత్రిముఖ్యా, ఏను భాగ్యవశంబునఁ దనయుండు మగుడ జీవించుటవలనం గలుగునానంద మనుభవించితి.', అని పలుకుచుండ నానందపరవశుం డగుజనకునవలోకించి చంద్రాపీడుండు పుండరీకుని విడిచి తొల్లింటిచందంబున జనకునిపాదంబుల కెరగెను. అంతఁ దారాపీడుండు కుమారుని లేవనెత్తి యిట్లనియె:— 'పుత్ర, నీశాపదోషంబుననో, నాభాగ్యంబుననో జన్మించితివిగాన ఏను నీకుఁదండ్రినై; అయినను, నీవు జగమున కెల్ల వందనీయుండ వగులోకపాలుండవు. నాయందును నమస్కార్యం బగునేయంశముండెనో, అది నీయందు సంక్రమించెను. కావున నిరుదెఱంగులను నీవె నమస్కార్యుండవు.', అని పలుకుచు రాజపుత్రీసహస్రంబులతో నతనిపాదంబులపైఁ బడియెను. విలాసవతియు నతనిమోమునను, చెక్కిళులను, ప

లును స్పృశించుచు ముద్దిడుకొని విడిచెను. అంతఁ జంద్రాపీడుఁడు శుకనాసునకుఁ బ్రణమిల్లి యతం డాశీర్వదింపఁ దన తలిదండ్రులకును, మనోరమాశుకనాసులకును 'ఇదిగో వైశంపాయనుఁడని పుండరీకునిఁ గనఁబఱిచెను. ఆసమయంబుననె కపింజలుఁడు శుకనాసునితో నిట్లనియె:—

'భగవంతుఁడగు శ్వేతకేతుం డిట్లు వార్త ననిచె. ఏనీపుండరీకుఁ బెనిచితినేగాని కననైతి. నీకు వీఁడు కొమరుండై యుదయించె. వీనికి స్నేహంబును మీయందకలదు. కావ యితండు వైశంపాయనుండేయని నిశ్చయించి, పరుండని యుపేక్షింపక, వీనిని యవినయములవలన పాలింపవలయు. వీనిశాపంబు తొలంగినను నీపుత్రుండయని యుంచినాయొద్దకుఁ జేర్చికొననైతి.,నావిని శుకనాసుండు వినయావనమ్రుండగు పుండరీకు నాదరించె. ఇట్టిప్రస్తావంబులతో . నారాత్రి తెల్లవాఱెను.

### చిత్రరథహంసు లచ్ఛోదంబునకు వచ్చుట.

ప్రభాతంబుననె సకలగంధర్వబృందంబును వెంబడింప మదిరాగౌరులతోఁ గూడ గంధర్వరాజు లగు చిత్రరథహంసు లచ్చటి కరుదెంచిరి. అట్లు గంధర్వలోకాధీశు లరుదెంచి లజ్జింత లగుకూఁతులం గాంచి యానందించుచు, కల్లుండ్ర నవలోకించి మనంబుల మెచ్చుచు, దారాపీడశుకనాసులతో సంబంధకోచితం బగుసంవాదంబు నెఱపుచుండ నప్పుడు మహోత్సవంబు సహస్రగుణంబయి ప్రవర్తించెను. ఆసమయంబున జిత్ర

రథుండు తారాపీడు నవలోకించి యిట్లనియె:— ‘నిజభవనం బులుండ నరణ్యంబున మహోత్సవం బేల సలుపవలయు! మున కిందురుచించినను లోకవ్యవహారం బనువర్తింపవలయుం గాన మానగరంబో, మీదేశంబో, చంద్రలోకంబో ప్రవేశింప నగు.' ననవిని తారాపీడుం డిట్లనియె:— ‘గంధర్వరాజ, నిరతిశయం బగు సంపత్సుఖం బెందుం గననో, అదియె భవనంబు. ఇట్టి సంపత్సుఖంబు నే నిం కెందుఁగంటిని? ఏను సర్వగృహసుఖంబులను నీ యల్లున కొప్పగించితి. కాన గృహసుఖానుభవంబుకయి మిత్రకళత్రయుతుం డగునతనిం దోడ్కొని పొమ్ము,' అని రాజర్షి యగు తారాపీడుండు వచింపఁ జిత్రరథుండు ‘నీకు రుచించిన ట్లాచరించెద,' నని చంద్రాపీడుం దోడ్కొని హేమకూటంబున కరిగెను.

చిత్రరథహంసులు తమరాజ్యములతోఁగూడ
కాదంబరీ మహాశ్వేతలకు చంద్రాపీడ పుండరీకుల నొసంగుట.

అంతఁ జిత్రరథుండు కాదంబరితోఁగూడ నిజరాజ్యంబు చంద్రాపీడున కర్పించెను, అట్లు హంసుండును మహాశ్వేతతోఁ దనపదవి పుండరీకున కొసంగెను. ఆచంద్రాపీడపుండరీకులు హృదయంబునకు రుచించినవనితలు లభించినమాత్రన కృతార్థత నెంచి యితరంబు దలంపరైరి, అనంతర మొకప్పుడు కాదంబరి చంద్రాపీడునిఁ గాంచి యిట్లనియె:— ‘ఆర్యపుత్ర, మన మందఱము మృతినొంది మగుడ జీవించి యొకరితో నొ

కేరు గలిసితిమి. మనయందుఁ బత్రలేఖికానంబడదు. కానివా ర్త నేఁడుగ., నావిని చంద్రాపీడుండిట్లనియెః— ప్రియా, అది యింకెక్కడ నుండును? రోహిణి నాశాపవార్త విని యెంటిమై నీవెట్లు మర్త్యలోకదుఃఖం బనుభవించెదవని వగచి, ఏను వారించినను నాచరణ సేవకయి యుండె మర్త్యలోకంబున జన్మించెను. ఇటనుండి యేను జన్మాంతర మొందనుపరమింపఁ గాను శరీరంబు విడిచి, క్రమ్మఱ మర్త్యలోకంబున జన్మింప నుద్యుక్త యగుటయు నే నదలింప దేవలోకంబుననె యుండె. కాన దాని నందె చూడఁగలవు., నావిని కాదంబరి రోహిణియుదారతను, మహానుభావతను, స్నేహాలతను, పాతివ్రత్యమును దలఁచి డెందంబున నచ్చెరు వొంది లజ్జించి క్రమ్మఱ నేమియుఁ బల్కకుండెను.

### చంద్రాపీడ పుండరీకులు కాదంబరీ మహాశ్వేతలతో సకలసౌఖ్యంబుల గాంచుట.

చంద్రాపీడుండు శ్వశురగృహంబునఁ గాదంబరీ సమాగమసౌఖ్యం బనుభవింపుచుఁ బదిదినంబు లుండి పరితోషిత హృదయు లగుశ్వశురులయనుమతిని వెడలి తండ్రిపాదమూలంబున కరుదెంచి రాజలోకంబు నాదరించి పుండరీకునియందు రాజ్యభార మునిచి తలిదండ్రులపాదంబులు సేవించుచు, ఒకప్పుడు జన్మభూమిస్నేహంబున నుజ్జయినియందును, వేఱొకప్పుడు గంధర్వరాజునందలి గౌరవంబున హేమకూటంబునను, మఱి

యొకప్పుడు రోహిణీ బహుమానంబునఁ జంద్రలోకంబునను విహరించుచుండెను. ఇట్లు చంద్రుండు కాదంబరి తోడను, మహాశ్వేత పుండరీకునితోడను, పుండరీకుండు చంద్రునితోడ ను గూడి ఒకరినొకరెడఁ బాయక యెల్లరు నెల్లకాలంబును న ల్లసౌఖ్యంబుల ననుభవించుచుండిరి.

ఇది శ్రీమద్భారద్వాజ గోత్రపవిత్ర శ్రీమదుద్భట వంశాబ్జమిత్ర
శ్రీమదఘోరనాథతనూభవ – జ్వాలాంబాగర్భ
శుక్తిభవ విబుధజనారాధ్య- నాగలింగారాధ్య
ప్రణీతంబైన కాదంబరియను నాఖ్యాయిక
యం దుత్తరకాదంబరి.

స ం పూ ర్ణ ము.



Edward Press, Madras.

# జ్ఞానవాశిష్ఠము.

ఆంధ్రతాత్పర్య విశేషార్థ సహితము. రు. ౬-౦-౦

| విషయసూచిక. | పుటసంఖ్య. | విషయసూచిక. | పుటసంఖ్య. |
|---|---|---|---|

# జ్ఞా న వా శి ష్ఠ ము.

నిదర్శనమునకై రెండు శ్లోకములు వ్రాయఁబడుచున్నవి.

ఉపశమ ప్రకరణము. ౮౧౫ పుట.

మూ॥ గృహీతతృష్ణాశఫరి వాసనాజాలమావిలం ।
సంసారవారిప్రసృతం చింతాతంతుభిరాతతం ॥ ౧౦ ॥

మూ॥ అనయాతీక్ష్ణయాతాత ఛింధిబుద్ధిశలాకయా ।
వాత్యయాంబుదజాలంచ ఛిత్వాతిష్ఠపదేతతే ॥ ౧౧ ॥

తా. శ్రీరామచంద్రా, చింత లనుదారములచే నల్లఁబడినదియు, సంసార మనునుదకమునందు వేయఁబడినదియు, ఆశ లనుమత్స్యములను బట్టునదియు నగువాసన యనువలను గాలిచే మేఘజాలమును ఛేదించునట్లు తీక్ష్ణ మగుబుద్ధి యనుకత్తిచే ఛేదించి పరిపూర్ణుఁడవు బ్రహ్మమునందు ఉండుము.



# వేదాన్త గ్రంథమాల.

అను మాససంచిక.

సం॥ చందా రు. 3-0-0

1911 సం॥ ఏప్రెయిలు నెల మొదలుకొని ప్రతినెలకు 40 పేజీల కంతున ముద్రింపఁబడుచున్నది. ఇందు శ్రీశంకరాచార్య విరచితంబైన "సర్వ వేదాన్త సిద్ధాన్త సంగ్రహ" మను లోకోత్తరమగు గ్రంథము ప్రతిపద టీకాతాత్పర్యములతో బ్రకటింపఁబడుచున్నది. ఇందగు విషయములు సూచికచే తెలియనగు.

| విషయసూచిక. | విషయసూచిక. |
| --- | --- |
| మంగళాచరణము. | బ్రహ్మచర్యము. |
| అనుబంధచతుష్టయము. | అహింస. |
| సాధనచతుష్టయము. | దయ-అవక్రత. |
| నిత్యానిత్యవస్తువివేకము. | వైతృష్ణ్యము. |
| విరక్తి. | శౌచము. |
| కామదోషము. | అదంభము. |
| కామవిజయోపాయము. | సత్యము. |
| ధనదోషము. | నిర్మమత. |
| విరక్తిఫలము. | స్థైర్యము. |
| శమాదిసాధనములు. | అభిమానవిసర్జనము. |
| శమము | ఈశ్వరధ్యానము. |
| మనఃప్రసాదసాధనము. | బ్రహ్మవిత్సహవాసము. |

విషయసూచిక.

ఉదాహరణమునకై యొకశ్లోకమిందు పొందుపరచఁబడుచున్నది.

అ. అర్థకామముల నెట్లుజయింపవలయు నవఁగా జెప్పుచున్నాఁడు.

మూ॥ ఆరూఢస్య వివేకాశ్వం తీవ్రవైరాగ్యఖడ్గినః ।
తితిక్షావర్మయుక్తస్య ప్రతియోగీ నదృశ్యతే ॥ ౯౧.

టీ॥ వివేకాశ్వం=వివేకమను గుఱ్ఱమును, ఆరూఢస్య=ఎక్కినవాఁడును, తీవ్రవైరాగ్యఖడ్గినః=తీవ్రవిరక్తి యనుఖడ్గమును ధరించిన వాఁడును, తితిక్షావర్మయుక్తస్య=ఓర్పు అనుకవచమును తొడిగి కొనినవాఁడును నగు పురుషునకు, ప్రతియోగీ=విరోధి. నదృశ్యతే=కనఁబడఁడు.

తా. వివేక మనునశ్వము నెక్కినవాఁడును,తీవ్రవైరాగ్య మనుఖడ్గమును ధరించినవాఁడును, ఓర్పను కవచమును దొడిగికొనిన వాఁడును నగు పురుషునకు విరోధి యుండనేరఁడు. (వివేకము, వైరాగ్యము, ఓర్పు ఈ మూఁడును గలవాఁడు అర్థకామముల జయించుననుట).

---

# సుభాషిత మణికంఠహారము.

ఆంధ్రతాత్పర్య సహితము. రు 1-0-0.

# కువైద్యోపహాసము.

ము॥ వైద్యరాజ నమస్తుభ్యం యమరాజసహోదర ।
యమస్తుహరతి ప్రాణాన్ వైద్యః ప్రాణాన్ ధనానిచ ॥౧౬౩

తా॥ యమునకు నన్న వగునో వైద్యరాజా, నీకొఱకు నమస్కారము. ఏమనంగా, యముండు ప్రాణములను మాత్రమే హరించుచున్నాఁడు గాని. వైద్యుఁడైననో, ప్రాణములను, ధనములనుగూడ హరించుచున్నాఁడు కదా.

# కలి విడంబనము.

మహాకవి

నీలకంఠ ప్రణీతము.

ప్రతిపదటీకా తాత్పర్యసహితము, రు. ౧-౪-౦.

ఇందు పండితులు, జ్యోతిషికులు, మాంత్రికులు, వైద్యులు, కవులు, గృహస్థులు, అల్లుఁడు, అప్పిచ్చినవాఁడు, దారిద్ర్యము, లక్ష్మి: లోభి, అతిథి, డాంభికులు, దుర్జనులు వీరగలహాస్యము అతి చమత్కారముగా వర్ణింపఁబడి యున్నది. నూఱుశ్లోకములు గలవు.

లోభి.

శ్లో॥ శుష్కోపవాసో ధర్మేషు భైషజ్యేషు చ లంఘనం ।
జపయజ్ఞశ్చ యజ్ఞేషు రోచతే లోభశాలినాం ॥ 75.

టీ॥ లోభశాలినాం = లోభగుణముగలవారలకు, ధర్మేషు=ధర్మములయందు, శుష్కోపవాసః=కటికియుపవాసంబును, భైషజ్యేషు=చికిత్సలయందు. లంఘనం=లంఘనంబును, యజ్ఞేషు=యజ్ఞములయందు, జపయజ్ఞశ్చ=జపయజ్ఞంబును, రోచతే=రుచించుచున్నది.

తా. లుబ్ధులకు సకలధర్మములలో కటికియుపవాసము శ్రేష్ఠమనియు, సకలచికిత్సలలో లంకనము పరమౌషధమనియు, సకలయజ్ఞములలో జపయజ్ఞము సర్వోత్తమమనియు తోచుచుండును. ఇందుచే లుబ్ధాగ్రేసర చక్రవర్తులకు ధనము వ్యయపడున దేవియు సరిపడవనుట.

# సౌభాగ్యలక్ష్మి

ఆంధ్రతాత్పర్య సహితము. వెల 0 8 0

ఇందు లక్ష్మీప్రాప్త్యుపాయము, శ్రీస్తుతి, శ్రీసూక్తము, కమలాస్తోత్రము, లక్ష్మీకవచము, కమలాప్రీతి సాధనము, లక్ష్మీమాహాత్మ్యము, త్రైలోక్యమంగళ మనులక్ష్మీస్తోత్రంబును, ఇంకయు గొన్ని లక్ష్మీసంబంధములగు కవచములు, స్తోత్రములు మున్నగునవియు కలవు.

కమలాస్తోత్రము.

శ్లో॥ ఏకా దేవీతు కమలా యస్మింస్తుష్టా భవేత్సదా ।
తస్యాసాధ్యంతు దేవేశి నాస్తికించి జ్జగత్త్రయే ॥ ౩౯.

తా. ఏమనుజుని విషయమై యొకలక్ష్మీదేవి ప్రసన్నురాలై యుండునో, వానికి మూడులోకములయందును సాధ్యముగాని దెద్దియు లేదు.

---

# విదుర మహానీతి.

తెలుఁగు వచనము.

ఇందులేని నీతిరహస్య మింకొక్కచో గనఁబడదు.

మొదటిభాగము. రు. 0 2 0.

# దశకుమారచరితము.

తెలుఁగు వచనము.

ఈ సంస్కృతగ్రంథము తొల్లి కాళిదాసాది మహాకవుల యెదుట శ్లో॥ కవిర్దండీ కవిర్దండీ కవిర్దండీనసంశయః ॥ అని సరస్వతీవాక్రుచ్చి యుండెనే అట్టి కవిదండి పండితునిచే సంస్కృతమున రచితమై, నీతిప్రధానమై, నవరసనిధానమై, కథాకల్పనాచాతుర్యమున నిరుపమానమై, జ్ఞానాభివృద్ధికి బరమసాధనమై యొప్పుచున్నది. ఇట్టి సద్గ్రంథము తెలుఁగున వచనముగా, బ్ర, శ్రీ, ము. నాగలింగశాస్త్రులవారిచే వ్రాయఁబడినది. సులభశైలి, సలక్షణము. ఈ గ్రంథము 1911 సం॥ సెప్టంబరు నెల ఆఖరువఱకు ముద్రితమై వెలువడఁగలదు. దీని వెల రు. 1 4 0.

---

# శైవసిద్ధాన్తగ్రంథములు.

శ్రీహరదత్తశివాచార్య విరచితము.

చతుర్వేద తాత్పర్యసంగ్రహము సవ్యాఖ్యానము. రు 1-0-0.

ఇందు చెప్పంబడు విషయములు—1 సమస్తేశ్వరత్వము (అనగా సర్వాధారముగా చేయబడు సంసారము శివునిచే జెందుననియు, నితరులకు భవసాగరమును దాటుటయందు నధికారము లేదనియు తాత్పర్యము). 2 జగత్కారణత్వము- అనగా శివుడే జగత్కారణమనుట). 2 నారాయణో పనిషత్తునకు శివుడే యుపాసన చేయదగినవాడని యభిప్రాయమును చెప్పుట). 4 గాయత్రికి శివపరమగు నర్థమును నిరూపించుట. 5 యజ్ఞములయందారాధింపదగినవాడు శివుడేయని సిద్ధాంతము చేయుట మొదలుగా నాలుగు వేదములయందు జర్చింపదగిన యనేక మంత్రములయొక్క యర్థవిచారము సంస్కృతమునకు సరియైన తెనుగునను బాలురకును తెలియునటుల నర్థము తాత్పర్యములతో సహా వ్రాయబడినది.

# శ్రీమదప్పయదీక్షితులవారిచే రచియింపంబడిన గ్రంథములు.

## 1 బ్రహ్మతర్క స్తవము. సవ్యాఖ్యానము.

ఇందలి విషయములు.—1 రెండవపదములోఁజేరని బ్రహ్మపదమునకు శివుఁడేయర్థమనియు, 2 భగవద్గీత శివపరమనియు, 3 శ్రీకృష్ణునిచే గనంబరుపంబడిన విశ్వరూపము శివసంబంధముగుననియు, 4 వ్యాససూత్రములు శివపరములనియు, 5 బ్రహ్మవిష్ణువులయొక్క లలాటమున శివుండు జనింపలేదనియు, 6 అందుజనించుట దోషావహము కానేరదనియు, 7 రుద్రునకు తామసత్వము లేదనియు, 8 సాత్వికత్వమే కలదనియు, 9 పశుపతిత్వము దేవతలవద్ద వరముత్రీసికొని సంగునవచ్చినది కాదనియు, 10 విష్ణుపాదోద్భవియగుగంగను ధరింపలేదనియు, 11 బాణాసురుని యుద్ధమునందు రుద్రుండు పరాజయమును జెందలేదనియు, 12 స్మశానవాసిత్వము దోషావహముకాదనియు, నీమొదలగుననేకాంశములు ప్రబలహేతువులచేత సంస్కృతమునను అందుకుసరియగు తెలుగునను సులభశైలితో బ్రకాశింపంబడినవి. రు. 1 0 0

## 2 శివకర్ణామృతము.

ఇందలి విషయములు.—శివుడే విశ్వాధికుండనియు, విశ్వసేవ్యుండనియు, వేదములు సూత్రములు, పురాణములు, ముఖ్యవృత్తిచేత శివునే చెప్పుననియు, శైవమే వైదికమనియు, శివపురాణములు, తామసములు కానేరవనియు, సంస్కృతమునను అందుకు సరియగు తెనుగునను సులభశైలితో బ్రకటింపబడినవి. రు. 0 8 0

## 3 రామాయణ తాత్పర్య సంగ్రహము. సవ్యాఖ్యానము.

ఇందలి సంశయములు—వాల్మీకియొక్కయు, శ్రీరామచంద్రునియొక్కయు ఇంకనితరములున్నయువచన సందర్భములచే విశ్వాధికుండును విశ్వసేవ్యుండును శివుడేయను నభిప్రాయమును సంస్కృతమునను, అందుకుసరియగు దెలుగునను సులభశైలితో బోధించునది. రు. 0 4 0

## 4. భారత తాత్పర్య సంగ్రహము. సవ్యాఖ్యానము.

ఇందు శ్రీ ఆదివిష్ణ్వవతార భూతుండగు వేదవ్యాసమహర్షి శ్రీకృష్ణ చరిత్రరూపంబగు మహాభారతంబున నా శ్రీకృష్ణునకున్ను నిత్యోపాస్యునిగా జెప్పుచు శివునినే యాదితత్త్వముగా దృఢపరచెనను నీయర్థము అనేకపర్వములయందుగల వచనములచేత సంస్కృతమందును అందుకు సరియగు తెలుగునను ప్రకటింపంబడినది.

## 2. శ్రౌతాన్యేవ శైవచిహ్నాని.

శైవచిహ్నములు వైదికములే యగు—అనునీ మహోపన్యాసము. శైవులకు ముఖ్యములైన భస్మరుద్రాక్ష శివలింగ శివనామజప బిల్వములను పంచచిహ్నములకు నన్ని వేదముల యందగు విధివచనములను నిత్యత్వబోధక వచనములను గనబరచుచు స్మృతి కల్పపురాణాదులయందు వీనియొక్క ప్రాశస్త్యమును తెలియజేసి ఇంకవిషయమై వివిధములగు విమత పూర్వపక్షములయొక్క ఖండనమును ప్రశ్న ప్రతివచనములచే సంస్కృతాంధ్రములయందు మూలభి[illegible]బోధించునది రు. 0 8 0

## శ్రౌతమేవహిధారణం లింగస్య.

లింగధారణము వైదికమేకదా—అనునీ మహోపన్యాసము రు 0 8 0

## 4 శైవసిద్ధాంతసంగ్రహము. ప్రతిపదటీకాసహితము.

ఇందు శివుడే జగత్కర్త యనియును. సర్వోపాస్యుండనియు, భస్మము, రుద్రాక్షము, శివలింగము, శివనామజపము, బిల్వము వీనియొక్క ప్రాముఖ్యము, లింగధారణము, శివనిర్మాల్య ప్రశంస, శైవమే వైదికమనుట మొదలగు వంశములు ముఖ్య ప్రమాణములు మాత్రముదాహరించుటచేతగనపరచబడినవి. శైవసిద్ధాంతమంతయు కరతలామలకముగ దెలియజేయును. 0 6 0

ఈ కేటలాగులోని వెలలలో పోస్టుఖర్చులు చేరలేదు
అవి కొనువారే భరింపవలయును.

వడ్లగొండ నాగలింగశాస్త్రి,
93. వరదాముత్తియప్పన్ స్ట్రీటు, మద్రాసు.

